గ్రంథకర్త:



శ్రీమాన్ ఇనగంటి పున్నయ్యా గురుస్వాములు
అప్పికట్ల

శ్రీ పున్నయ్య గురుస్వాముల శిష్యులు



శ్రీ చలపల్లి సుబ్బయ్యచౌదరిగారు

ఓమ్

శ్రీ సద్గురు పరబ్రహ్మణేనమః

# మా ధ వ శ త క ము

---

గ్రంథకర్త:

శ్రీమాన్ ఇనగంటి పున్నయ్య చౌదరిగారు

అప్పికట్ల

# విన్నపము

—:o:—

ఆర్యులారా!

శ్రీ పులహరి వీరోజిబాబుగారు (శ్రీ వీర్దేశి కేంద్రాలయ స్వాములు)

శ్రీ పాటిబండ్ల వెంకటనరసమ్మాంబగారు (శ్రీవీరయార్యగురుసార్వభౌములవారి సతీతిలకము) మొదలగు మహదార్యుల సమక్షమున స్వ॥ శుక్లనామ సం॥ కార్తీకశుద్ధ అష్టమిరోజున అప్పికట్ల గ్రామములో మధ్యాహ్నంబున నాచే జరుపబడిన శ్రీ పాటిబండ్ల వీరయార్యగురు సార్వభౌములవారి యారాధన మహోత్సవమును ప్రతిసంవత్సరమును ఆరోజుననే నాచే అప్పికట్ల గ్రామములో జరుపబడును.

ఇట్లు

అప్పికట్ల　　　　　　శ్రీమాన్ ఇనగంటి పున్నయ్యచౌదరి

ఓం

శ్రీ సద్గురు పరబ్రహ్మణే నమః

# మాధవ శతకము

---

ఉ. శ్రీమదఖండమై విబుధ, సేవ్యమునై మునిబృందవంద్యమై
శ్యామలవర్ణమై దనుజ, సంహరణైక విశేషపూజ్యమై
కామవికారదూరమయి, కాంచనవస్త్రము గల్గియున్న నీ
కోమలరూపమారయఁగఁ, గోరికగల్గినదయ్య మాధవా. ౧

ఉ. శ్రీరమణీయమై వెలయు, చిన్మయరూపుఁడవైన నిన్ను మున్
నారదపుండరీక సుర, నాథుఁడు మున్నగువారు చూడఁగా
నేరక ధ్యానయోగులయి , నీపదసేవ యొనర్చియుండ నే
నారయఁ బూని యుంటపరి, హాసముగానగునేమొ మాధవా.

ఉ. ఏడుసముద్రముల్ నదులు, వృక్షములాకసమగ్ని వాయువుల్
మేడలుమిద్దెలద్దములు , మేదిని తారలు పర్వతావళుల్
గోడలు ద్వారముల్ మొదలు, లోకములన్నియు నీవె గానన్
జూడఁగలేనటన్నఁగడు, చోద్యముగానగునేమొ మాధవా.

ఉ. శౌరి ముకుంద కేశవ ని,శాచరభంజన సారసాక్ష బృం
దారకపోషణా భుజగ, తల్ప జనార్దన మానిరక్షణా
సూరిజనావనా కుజన, శోషణ శార్ఙ్గి సుపర్ణవాహనా
వారిజనాభ సూర్యకుల, పావనగోత్రధరార మాధవా. ౪

ఉ. సోమకరాక్షసుండనెడు, శూరుఁడు వేదము లబ్ధిముంపఁగా
దామరసోద్భవుండు పరి,తాపముఁ జెందుటఁ జూచి చేపవై
సోమకుఁద్రుంచియానిగమ,సూత్రములెల్ల నుదమ్మిచూలికిన్
ప్రేమనొసంగినాఁడవని, వింటిని నీదు యశంబుమాధవా. ౫

ఉ. దేవతలున్ని శాచరులు, ధీరతసాగరమున్ మథింప నీ
వేవరకూర్మరూపివయి, యీప్సితముల్ నెరవేర్పఁగాసుధన్
శీవిగదీసినారలట, నిర్జరబృందము పూర్వదేవతల్
గావున నిన్ను నమ్మికొనఁ,గష్టములెన్నఁడులేవుమాధవా. ౬

ఉ. కక్షకుకాలుద్రవ్వి త్రిజ,గంబులనాశనమొందఁజేయఁగా
దీక్షనుబూనియున్నరణ,ధీరుఁడుక్రూరుఁడుపావుఁడౌ హిర
ణ్యాక్షుని ద్రుంచినాఁడవు మ,హాద్భుతమైనవరాహరూపివై
సాక్షివిగావనన్నిటికి, సాధ్యముసర్వము నీకు మాధవా. ౭

ఉ. శ్రీధర శ్రీధరాయనుచుఁ, జిత్తములోస్మరియించుచున్న ప్ర
హ్లాదునిజీరి శ్రీధరుని, నర్చనసేయఁగరాదటంచు సం
శోధనచే హిరణ్యకశి,పుండు సుతున్ మరలింపలేక బల్
బాధలుపెట్టుతండ్రిని స,భాస్థలిగూల్చితివయ్యమాధవా. ౮

ఉ. వంచకుఁడై సురావళిని, స్వర్గమునందు వసింపకుండ బా
ధించఁదలచి క్రొవ్వున మ,దిరచి చరించి విరించికిన్ సదా
మించియసాధ్యుఁడై సకల, మేదినిగెల్చి యజేయుఁడౌ బలిన్
వంచనఁ జేసిత్రొక్కితివి,వామనరూపముదాల్చిమాధవా. ౯

ఉ. తజ్ఞులుమెచ్చుధర్మములఁ,దప్పిచరించుచునిత్యమున్ బరా
వజ్ఞతసల్పుచున్ బుధుల, బాధలబెట్టినయట్టి రాజులన్
ప్రాజ్ఞవిదూరులన్ బరశు,రాముఁడవై దునుమాడినావు నీ
ప్రాజ్ఞ బరీక్షఁజేయఁగఁద,రంబె విధాతృనకైనమాధవా.౧౦

ఉ. తామరసోద్భవాది సుర, తండములెల్ల దశాస్యుచేత బల్
బాములఁజెందితాళక వి,సజ్జన బాంధవ కేశవా పరం
ధామ ముకుంద నీకు శర,ణంబనివేడఁగ రావణాసురున్
రాముఁడవై వధించితివి,రాజ్యముతమ్మునకిచ్చిమాధవా౧౧

ఉ. ధారుణిసజ్జనుల్ ఖలుల,దాడిసహింపఁగలేక దీనులై
దారిఁగనంగరాక మది, తల్లడిలన్ బలరామమూర్తివై
గారవ మొప్పవర్ధిలుచుఁ, గౌరవపాండవ యాదవాదులన్
జేరిచిదుష్టులన్ దునిమి, శిష్టులబ్రోచితివయ్యమాధవా.౧౨

ఉ. అర్థవిహీనులన్ ధనికు,లైన జనావళినిన్ బ్రజాళినిన్
పార్థివులన్ మనీషులను, పామరులన్ బహునీచజన్ములన్
సార్థకులన్ సమస్తమును, సాక్షివిగాఁ బరికించుచుండు భా
వార్థము బుద్ధరూపమని,యార్యులుచెప్పిరిమున్ను మాధవా

ఉ. గూఢముగాఁ జరించి బుధ, కోటులఁ గూళల వేరు జేసి యా
మూఢమత ప్రజాళి నొక, మోలకుఁ జేర్చుటెగాక వారలన్
గాఢబలంబుఁ జూపికడి, కండలు ప్రేవులుఁ జీల్చిచంప నా
రూఢత నీవు శ్రీకలికి, రూపముఁ దాల్చెదవయ్య మాధవా. ౧౪

ఉ. దేహము శాశ్వతంబని మ, దిన్ దలపోయుచు మూఢ చిత్తుఁడై
మోహమునన్ దగుల్కొనిము, ముక్షువుగాక భవాగ్ని చేత వ్యా
మోహితుఁడైనవానికి య, ముండు శ్రమల్ గలిగించుగాన సం
దేహము లేక నా మనసు, నీపయిఁ జేర్చితినయ్య మాధవా ౧౫

ఉ. వాసవసన్నుతా భువన, వర్ధనభోగిశయాన సంతతా
భ్యాస వశంవదాసుజన, పాలనపూతచరిత్ర శ్రీమనో
ల్లాసవిచిత్ర మోహన వి, లాస విశేషవికాస భూషణా
దాసహృదబ్జభృంగకుమ, తవ్రతభంగ శుభాంగ మాధవా ౧౬

ఉ. నాలుగు వేదముల్ చదివి, నన్ స్మృతులన్ బఠియించి నేర్చినన్
లోలత నారు శాస్త్రముల, లోఁ గలసంగతులన్ గ్రహించినన్
గోలయెగాక యందుఁ గల, గోప్యమెఱింగిన నీవు దక్క నిం
కేలెడు వారలీ జగతి, కెవ్వరు లేరుగదయ్య మాధవా. ౧౭

ఉ. నీదయ లేక యున్న ధర, ణీస్థలి పాలనసేయు పార్థివుల్
బీదదనంబుఁ జెందుదురు, పేదలు నీ కటాక్షమున్నచో
భూధవులై చెలంగుదుర, మోఘయశః పరిపూర్ణమూర్తులై
నీదరిఁ జేరినాఁడనను, నీకరుణాంబుధిఁ దేర్చు మాధవా. ౧౮

ఉ. సారసపత్రనేత్ర మధు, జైత్రమహాబలఘోరదైత్య సం
హారకముఖ్యసూత్ర దురి, తావళి బంధలతాలవిత్రబృం
దారకనాథమిత్రముని, తండవినిర్మల హృత్సరోజ సం
చారచరిత్ర గోత్రధర, చారుపయోధరగాత్రిమాధవా. ౧౬

ఉ. కమ్మనితేనియల్ చిలుకు, కైతనునీపయి గ్రుమ్మరించ నా
నెమ్మనమూనె నేనొకమ, నీషివరుండను గాను పంచకా
వ్యమ్ములు నేర్చియుండను బ, దార్థవిచక్షణ జేయుశక్తి లే
శమ్మును లేదుగానఁ గొన, సాఁగునొ సాఁగదొ శ్రీరమాధవా

ఉ. అన్నవగున్న మావిచిగు, రాకులు మెక్కుచు చొక్కుకోయిలే
తెన్నననేగదో మొలవ, తీపియలాకులకై యదేవిధిఁ
గొన్నిచరిత్రలుండినను, గోరదు నామది నీచరిత్రమే
యన్నివిధంబులన్ దలచి, హాయినిఁ బొందుచునుండు మాధవా.

ఉ. వన్నెలుచిన్నెలున్ గలుగు, బంగరుపుట్టము బర్హిపింఛమున్
తిన్నని తమ్మికన్గవ సు, నీలపయోద నిభాంగసంపదన్
పున్నమవెన్నెలన్ మిగిలి, ముద్దులుగుల్కెడి లేతనవ్వు నా
కన్నులపండువౌనటులఁ, గాంచుదునో గనలేనొ మాధవా.

ఉ. గోవులగోపికామణులఁ, గూరిమిమీరఁగఁ గాచి రుక్మిణీ
దేవిని సత్యభామ నొక, టీరుగ నేలిన భాతిఁ దోఁపఁ బ్ర
జ్ఞావిభవంబుజూపుచు వ, సందగునందెలజోడు ఘుంఘుణా
రావములీననాడెడు వి, రాజితరూపము జూపుమాధవా. ౨౦

ఉ. చిత్రముగాదె గర్విత ని,శీచరరాజ సమూహతంత్రవై
చిత్రవిఖండనుండవయి, జెన్నలరారెడు నీకు గోపికా
పుత్రికలట్టివచ్చి తరి, ముద్దలు మెక్కొనన్ యశోదయే
మాత్రమటంచురో లొకటి-మాత్రమెవీపునగట్టెమాధవా

ఉ. చల్లదనంపుచూపులు ప,సంములుగుల్కెడునాట్యసంపదల్
తెల్లనిలేతనవ్వుకడు, తియ్యనలొల్కెడి ముద్దుపల్కులున్
ఫుల్లసరోరుహాననము, మోహనశోభితవేణుదండమున్
మెల్లగపొంచిగాంచెద సు,మీకడునేర్పుతో శ్రీరమాధవా.

ఉ. పెందళుకీనఁగాఁ దులసి, పేరులగుత్తులు గట్టి యందమై
విందొనరించుచుండ నొక, పిల్లనగ్రోవినిబట్టి నీటుగా
సిందురమద్ది పచ్చని ప, సిండిమెరుంగు పటంబుదాల్చి నా
ముందర నిల్వకున్ననెటు, మ్రొక్కఁగలాఁడనయారె మాధవా

ఉ. మామనుజంపినావు పలు,మారులుగొల్లలపాలుద్రావి మా
రాములు జేసినావు నడి,రాతిరి వెన్నలదోచినావు పెన్
బామునుద్రొక్కినావు మరి, బావమరందిని గొట్టినావు ని
న్నేమనవచ్చుఁగొండవయి,కెత్తిన సామి నమామిమాధవా.

ఉ. ముమ్మొనవాలుఁదాల్చు దొర, ముద్దులచేడియగంగ నీదు పా
దమ్మునసుద్భవించెనట, తమ్మియనన్ దనరారు పొక్కిలిన్
బమ్మజనించియుండెనట, భారమొకింతయులేక పద్మజాం
డమ్మునుకుక్షినుంచితట, నాకొకమారిటుజూపుమాధవా.౩౭

శ్రీ పున్నయ్య గురుస్వాముల శిష్యురాలు



శ్రీమతి వులసి బుల్లెమ్మ

# కృతజ్ఞత

మదీయ గురువర్యులు శ్రీ చిదానంద స్వరూపులు శ్రీ శ్రీ శ్రీ ఇనగంటి పున్నయార్య సార్వభౌములవారి ధర్మపత్ని శ్రీమతి చల్లమాంబాదేవిగారు వారి భర్త గారిచే రచింపబడిన (1) బ్రహ్మరహస్యము (2) జన్మ రాహిత్యము (3) ముక్తికాంతావిలాసము (4) మాధవ శతకము అను నాల్గు గ్రంథరాజములు ద్రవ్యలేమిచే నన్ను తిర్గి అచ్చువేయించి, శ్రీ గురువర్యులవారి మనో గతమయిన అద్వైతాచల విధానంబులు వారి శిష్యకోటి కందించుటకు ఆజ్ఞ నా కొసంగినారు; ఇందులకు వారికి నా ప్రణామములు. శ్రీ చల్లమాంబాదేవిగారి ఆజ్ఞాను సారము పై గ్రంథములను ఒకేసంపుటిగ అచ్చొత్తించి "శ్రీ శ్రీ శ్రీ ఇనగంటి పున్నయ్యచౌదరి కృతులు" అను పేర భక్తలోకమునకు సమర్పించుకొంటిని. ఈ గ్రంథ సంపుటికి శ్రీ శ్రీ శ్రీ పులహరి ఫీరోజిబాబుగారి ప్రస్తా వన, శ్రీ తుమ్మల సీతారామమూర్తిగారి పరిచయవాక్య ములు కడు శోభ చేకూర్చినవి. వారికి నా సహస్రాది ప్రణామములు.

తనువును, ధనమును అర్పించుచు గురువుగారి మఠనిర్మా ణములో ప్రత్యేక శ్రద్ధ చూపుచు ముందంజ వేయు చున్నారు. వీరి గురుభక్తి అద్వితీయము.

గురువులవారి నిర్యాణానంతరము శ్రీ చల్లమాంబ గారును, పిచ్చయ్యగారును గురుసమాధిపై మఠమునిర్మిం చుటేకాక, అందు లింగ, విఘ్నేశ్వర, ధ్వజస్తంబ ప్రతి ష్ఠలు సల్పి, సర్వదా సాధుసజ్జన పూజతో, సమగ్ర దీక్షతో నుండుట మెచ్చదగిన విషయము. మరియు గురుపత్నియగు చల్లమాంబగారు, శిష్యరత్నంబగు ఇన గంటి పిచ్చయ్యగారు గురుత్వాధికారంబుల స్వీకరించి ఒకరికొకరు చేదోడువాదోడుగా మెలగుచు శిష్య సముదాయమునకు సద్గురుబోధ లుపదేశించుచు బ్రహ్మా నంద తత్పరులైయున్నారు. వీరు ఈ విధముగా జీవి తాంతము వరకు సద్గురుకార్యములయందు నిమగ్నులై నిశ్చలానంద తత్పరులై విలసిల్లుదురు గాక!

శ్రీ పున్నయార్యులవారు రచించిన మఱి కొన్ని గ్రంథములు ముద్రితములయినను వాని ప్రతులుకూడ నేడులేవు. కనుక ఉదారులగు ఉత్తమ పురుషులందరు ఆ గ్రంథములను మరల ముద్రింపించి సహాయపడ వలయునని అన్నివిధముల గోరుచు ఇంతటితో విరమించు చున్నాను.

ఇట్లు
పులహరి పీరోజిబాబు

# పరిచయము

ఈ కృతిసంపుటము రచియించిన ఇనగంటి పున్నయ్యచౌదరి గారు బాపట్లతాలూకా, అప్పికట్ల నివాసులు. బాపమాంబ, నరసింహాచౌదరి అనుదంపతులు వీరితల్లిదండ్రులు. వీరు స్వగ్రామ పండితులు కొండముది నరసింహాముగారి శుశ్రూషలో ఆంధ్ర సాహిత్యము నార్జించిరి. చిన్నతనముననే కవిత్వము వ్రాయ నేర్చిరి. జన్మాంతరవాసనలేవో బలాత్కరింపగా వీరు దాదాపు ముప్పదియేండ్ల వయస్సులోనే వేదాంతము దెసకు మరలిరి. వీరి వేదాంతగురువులు, పూజ్యులైన పాటిబండ్ల వీరయార్యుల వారు. కాఁగా వీరు కొంత లౌకిక కవిత్వము, కొంత వేదాంత కవిత్వము వ్రాసిరి. 'కవిరాజశిరోమణి' బిరుదమునందిరి. లౌకిక రచనలలో జగన్మోహినీ విలాసము అను కావ్యము, భువనసుందరి అను నవల అముద్రితములు. రైతుకన్నీరు, పూలచెట్లు, (ఖండకావ్యములు) మాధవశతకము అనునవి ముద్రితములు. వేదాంతరచనలు: బ్రహ్మరహస్యము, ముక్తికాంతావిలాసము, జన్మరాహిత్యము అనునవి ముద్రితములు. ఈగ్రంథములు మూఁడును, మాధవశతకమును ఈ సంపుటములో కలవు.

పున్నయ్యగారు వేదాంతగురువులై గురుపీఠమును నెలకొల్పి పెక్కండ్రు శిష్యులకు తత్త్వబోధ చేయుచుండెడి వారు. తమగురువులైన వీరయార్యుల యారాధన మహోత్సవ మును 1928 నుండి ప్రతి కార్తికమాసమందును అత్యంత వైభవోపేతముగా తమయింట జరిపెడివారు. వీరిలో తార్కిక శక్తి, హాస్యనైపుణి అపారముగా కలదు. వీరు నిలిచినచోటు

తనువును, ధనమును అర్పించుచు గురువుగారి మఠనిర్మాణములో ప్రత్యేక శ్రద్ధ చూపుచు ముందంజ వేయుచున్నారు. వీరి గురుభక్తి అద్వితీయము.

గురువులవారి నిర్యాణానంతరము శ్రీ చల్లమాంబగారును, పిచ్చయ్యగారును గురుసమాధిపై మఠమునిర్మించుటేకాక, అందు లింగ, విఘ్నేశ్వర, ధ్వజస్తంబ ప్రతిష్ఠలు సల్పి, సర్వదా సాధుసజ్జన పూజతో, సమగ్ర దీక్షతో నుండుట మెచ్చదగిన విషయము. మరియు గురుపత్నియగు చల్లమాంబగారు, శిష్యరత్నంబగు ఇనగంటి పిచ్చయ్యగారు గురుత్వాధికారంబుల స్వీకరించి ఒకరికొకరు చేదోడువాదోడుగా మెలగుచు శిష్య సముదాయమునకు సద్గురుబోధ లుపదేశించుచు బ్రహ్మానంద తత్పరులైయున్నారు. వీరు ఈ విధముగా జీవితాంతము వరకు సద్గురుకార్యములయందు నిమగ్నులై నిశ్చలానంద తత్పరులై విలసిల్లుదురు గాక!

శ్రీ పున్నయార్యులవారు రచించిన మఱి కొన్ని గ్రంథములు ముద్రితములయినను వాని ప్రతులుకూడ నేడులేవు. కనుక ఉదారులగు ఉత్తమ పురుషులందరు ఆ గ్రంథములను మరల ముద్రింపించి సహాయపడవలయునని అన్నివిధముల గోరుచు ఇంతటితో విరమించుచున్నాను.

ఇట్లు
పులహరి పీరోజిబాబు

# పరిచయము

ఈ కృతిసంపుటము రచియించిన ఇనగంటి పున్నయ్యచౌదరి గారు బాపట్లతాలూకా, అప్పికట్ల నివాసులు. బాపమాంబ, నరసింహచౌదరి అనుదంపతులు వీరితల్లిదండ్రులు. వీరు స్వగ్రామ పండితులు కొండముది నరసింహముగారి శుశ్రూషలో ఆంధ్ర సాహిత్యము నార్జించిరి. చిన్నతనముననే కవిత్వము వ్రాయ నేర్చిరి. జన్మాంతరవాసన లేవో బలాత్కరింపగా వీరు దాదాపు ముప్పదియేండ్ల వయస్సులోనే వేదాంతముదెసకు మరలిరి. వీరి వేదాంతగురువులు, పూజ్యులైన పాటిబండ్ల వీరయార్యుల వారు. కాఁగా వీరు కొంత లౌకిక కవిత్వము, కొంత వేదాంత కవిత్వము వ్రాసిరి. 'కవిరాజశిరోమణి' బిరుదమునందిరి. లౌకిక రచనలలో జగన్మోహినీ విలాసము అను కావ్యము, భువనసుందరి అను నవల అముద్రితములు. రైతుకన్నీరు, పూలచెట్లు, (ఖండకావ్యములు) మాధవశతకము అనునవి ముద్రితములు. వేదాంతరచనలు: బ్రహ్మరహస్యము, ముక్తికాంతావిలాసము, జన్మరాహిత్యము అనునవి ముద్రితములు. ఈగ్రంథములు మూఁడును, మాధవశతకమును ఈ సంపుటములో కలవు.

పున్నయ్యగారు వేదాంతగురువులై గురుపీఠమును నెలకొల్పి పెక్కండ్రు శిష్యులకు తత్త్వబోధ చేయుచుండెడి వారు. తమగురువులైన వీరయార్యుల యారాధన మహోత్సవ మును 1928 నుండి ప్రతి కార్తికమాసమందును అత్యంత వైభవోపేతముగా తమయింట జరిపెడివారు. వీరిలో తార్కిక శక్తి, హాస్యనైపుణి అపారముగా కలదు. వీరు నిలిచినచోటు

ఒకగోష్ఠిగా పరిణమించెడిది. ఎంతవారైనను కాలచక్ర పరిభ్రమణమునకు లొంగకతప్పదు. కావున వీరు దాదాపుడెబ్బదినాలుగు సంవత్సరముల వయస్సులో 23-10-54 బ్రహ్మైక్యమునందిరి. వీరులేకపోవుట అప్పికట్లకు పెద్దకొఱఁత యని చెప్పకతప్పదు.

వీరి యనంతరము గురుపీఠమునకువచ్చిన వీరియర్ధాంగి చెల్లమాంబగారును, ముఖ్యశిష్యుఁడు శ్రీఇనగంటి పిచ్చయ్య చౌదరిగారును పున్నయ్యగారి సంస్మృతికొఱకై శాశ్వతచిహ్నము నిర్మింపఁదలఁచిరి. ఈ సంకల్పమునకు పున్నయ్యగారి శిష్యులు, బంధుమిత్రులు తోడై వలయు సాహాయ్యము గావించిరి. దీనిఫలముగా పున్నయ్యగారి సమాధిపై ఆలయము నిర్మింపఁబడెను. ఇందు 3-6-56 లింగప్రతిష్ఠ కావింపఁబడెను. దీనికి నాఁటినుండియు చెల్లమాంబగారును, పిచ్చయ్యగారును నిత్య నైవేద్యదీపధూపములు సాగించుచుండుట ప్రశంసాపాత్రము. ఇంతేకాక వీరియాలయమునకు ప్రతిసంవత్సరము వైశాఖ బ.౧ నాఁడు బ్రహ్మోత్సవము సాగింతురు. ఈ యుత్సవ సందర్భమున పెద్దలెందఱోవచ్చి అధ్యాత్మ ప్రసంగములు కావింతురు. పున్నయార్యులను సంస్మరింతురు— పూజింతురు. ఇది పున్నయ్యగారి ధన్యతకు తార్కాణము.

అప్పికట్ల }
14-5-60 }

ఇట్లు
తుమ్మల సీతారామమూర్తి

ఓమ్

శ్రీ రామచంద్రానుగ్రహ శ్రీవీరగురుపరబ్రహ్మణేనమః

# బ్రహ్మరహస్యము



[భక్తిభావము, జ్ఞానభావము, అచలభావము, పూజావిధానములను గురించిన తత్వములు]

ఇది

అప్పికట్ల పురీనివాసుండును, కమ్మకుల చంద్రుండును, ఇనగంటి నరసింహ చౌదరి బాపమాంబికాగర్భ సంజనితుండును, ఆశు కవీంద్రుండును, శతావధానియును, శ్రీ పులహరి ఫీరోజి ఋషివర్యులవారి ప్రియ శిష్యులగు శ్రీమాన్ పాటిబండ్ల వీరయార్య గురువరేణ్యుల వారి ప్రియ శిష్యుండును, విబుధజన విధేయుండైన

**ఇనగంటి పున్నయ్య చౌదరిచే**

రచియింపఁబడియె.

ద్వితీయముద్రణము 1,000

భారతీప్రెస్, తెనాలి.

కాపీరైటు రిజిష్టర్డు] [సర్వస్వామ్యసంకలితము

# కృతిసమర్పణము

---

సీ॥ సాంఖ్య భావంబు వి । స్తారంబు బోధించి
　　　　దేహి దేహంబుల । దెలిపినావు
తారకభావంబు । తరుచుగా వెదజల్లి
　　　　పరమాత్మపై భక్తి । నెరపినావు
అమనస్కభావంబు । నందించి జీవంబు
　　　　బ్రహ్మమార్గణి నే । ర్పరచినావు
పరిపూర్ణభావంబు । బయలగునట్లుగా
　　　　జేసి యెరుకను విశ । దీసినావు

గీ॥ పాటిబండ్ల కుల క్షీర । వార్ధిచంద్ర
వీరయార్య వరేణ్య స । ద్విమల చరిత
నేను మీ ఋణమును దీర్ప । లేనుగాన
అందుకొనుమయ్య బ్రహ్మర । మాస్యకృతిని.

ఇట్లు

అప్పికట్ల.　　　　ఇనగంటి పున్నయ్యచౌదరి,

గ్రంథకర్త, వారి సతీతిలకము



శ్రీమాన్ ఇనగంటి పున్నయార్యగురుస్వాములవారు
శ్రీమతి ఇనగంటి చల్లమాంబగారు

శ్రీరస్తు

# గురూపదేశాధికార పత్రిక



స్వస్తి శ్రీ విభవనామ సంవత్సర మాఘ శుద్ధ ౫ (పంచమి) గురువారమున శ్రీ సద్గురు వంశపారంపర్యులైన శ్రీమాన్ పాటిబండ్ల వీరయ గురుసేవా ధురీణులైన అప్పికట్ల పురీనిలయుండగు ఇనగంటి పున్నయ్య దాసునకు శ్రీ సత్తెనపల్లి గ్రామవాసులగు శ్రీషిర్డీ కేంద్రాలయ స్వామి అధికార మొసంగడమైనది.

ఇట్లు

పులహరి ఫిరోజిబాబు

షిర్డీ కేంద్రులవారి మఠాధ్యక్షులు.

సత్తెనపల్లి

గుంటూరు జిల్లా

ఇందుకు సాక్షి

సచ్చిదానందులగు గురువులే.

ఓమ్

శ్రీ సద్గురు పరబ్రహ్మణే నమః

సీ. పరమగోప్యార్థసం భరిత పూర్ణానంద
పరతత్త్వ ముపనిష ద్బ్రహ్మపథము
సచ్చిదానంద వి స్తార సామ్రాజ్యంబు
రంగరాజాచార్య రాజవీథి
ద్వయదోషహర కల్ప తరువు చిట్టెంసెట్టి
లక్ష్మణాచార్య వి లాససీమ
అద్వైత భావాంత రార్థ సారాంశము
జమిలి శేషయ గురూ త్తమ సదనము
అలరు ఫీరోజిబుషి రహ స్యంబు వీర
యార్య గురుధనమైన జ్ఞా నాధికార
మందుకొంటిని సాష్టాంగ వందనములు
జేసి ఫీరోజిబాబు దే శికవరేణ్య

అప్పికట్ల
14—2—1929

ఇట్లు
ఇనగంటి పున్నయ్యచౌదరి

# విజ్ఞప్తి

---

ఆర్యులారా !

శ్రీ పులహారి ఫీర్దేశి కేంద్రాలయ స్వాము లొసంగిన గురూపదేశాధికార పత్రికయే. గాక మరి కొందరు మహా భాగ్యులచే నాకొసంగబడిన శ్రీ సద్గురు పీఠాధికార పత్రికలు పరిపూర్ణ బోధాధికార పత్రికలు మున్నగునవి యనేకము లున్నను, గ్రంథ విస్తరభీతిచే అట్టి పత్రిక లిందు ప్రకటింపజాల నయితిని.

ఇట్లు

అప్పికట్ల — ఇనగంటి పున్నయ్యచౌదరి

# తొలి పలుకు

మహాశయులారా! నేనీ బ్రహ్మరహస్యమను గ్రంథమును భక్తిభావము, జ్ఞానభావము, అచలభావము, పూజా విధానములను నాలుగు భాగములుగా వ్రాసియుంటిని. యీ గ్రంథము నచ్చొత్తించుటకై కొందరు భక్తాగ్రేసరులు నన్ను త్వరపెట్టుటచే తిరిగి సవరణ జేసికొనుటకు సావకాశము లేనివాడనైతిని. యీగ్రంథమును వ్రాయుటలో వ్యాకరణము ననుసరించి యక్షరములు మార్పు జేయకుంటిని. కారణమేమన అక్కను నక్కగాను, పుట్టను బుట్టగాను, పండ్లను బండ్లుగాను, వ్రాయవలసిన పద్ధతిని యీ బ్రహ్మరహస్యమునకు ముడిబెట్టిన నేను సర్వజన విదితమగునట్లు వెల్లడింపదలంచిన బ్రహ్మరహస్యము మరుగుపరచవలసివచ్చినది. అందుచే నేనట్లు జేయకుంటిని. అంతియేగాని వ్యాకరణమును జవదాటిన వాడనని భావింపవలదు. మరియు నేనీగ్రంథమునందెచ్చటను ఒక మతమునుగూర్చిగాని, యొకసంఘమునుగూర్చిగాని, యొకవ్యక్తిని గూర్చిగాని నిందారోపణము జేసియుండలేదు. కాబట్టి కవియభిప్రాయము మరుగైయుండుటవలనగాని, లేక సామాన్య దృష్టితో జూచుటచేతగాని, మరి యేవిధముననైనగాని యట్టి భావమే మహనీయులకైన స్ఫురించెనేని వారి కొఱకు నేనిదే క్షమాపణము గోరుచున్నాడను.

ఇట్లు

అప్పికట్ల,
8—4—1929

విన్నవించు విబుధజనవిధేయుడు,
ఇనగంటి పున్నయ్యచౌదరి.

ఓమ్

శ్రీరామచంద్రానుగ్రహ శ్రీ వీరగురుపరబ్రహ్మణే నమః

# బ్రహ్మరహస్యము

## భక్తిభావము

౧. కీరవాణి రాగము - ఏకతాళము.

రామ నామమను - మిఠాయి యిదిగో।
రండి భుజించుడి జనులారా॥
తామసాది దుర్గుణములు మాన్పెడి।
తగిన యౌషధము జనులారా ॥రా॥
బాగుమీర వాల్మీకమహాముని। పాకముబట్టెను జనులారా
యోగులైనశుకశౌనకాదిమును। నేర్పునవండిరి జనులారా॥రా॥
సారసముగ దేవేంద్రుఁడు జూచి। చక్కగ దించెను జనులారా
నారద రుక్మాంగద మహానీయులు। నాణెముజేసిరి జనులారా॥రా॥
ధనమునకమ్ముట లేదనుచు కబీర్। దాసు వచించెను జనులారా
దనరగ భక్తుల సొమ్మనుచు కమాల్
దాసుడు దెల్పెను జనులారా ॥రా॥
అరమరలేకను అప్పికట్లపుర। మందున దొరుకును జనులారా
ధర యినగంటి పున్నయ దాసుని
పరమైయున్నది జనులారా ॥రా॥

పాటిబండ్ల వీరయ గురువర్యుని । వశమై యున్నది జనులారా
వాటముగా ఫీరోజిబుషీశ్వరు । భావంబైనది జనులారా ॥రా॥

౨. ఆనందభైరవి రాగము - అటతాళము

శ్రీరామ నీవేమి జేసిన కాదను । వారు లేరా యేమిరా
సరిగాదను వారు లేరా యేమిరా ॥
కోరికదీర నిను గొల్చుచుండెడి భక్త
లూరకుందురా యితరు । లూరకుందురుగాని ॥శ్రీ॥

వాలి సుగ్రీవులు వనితకై పోరాడి । జాలి జెందుచు నుండగా
నెటుదోచక । జాలిజెందుచు నుండగా
యేలాగైనను వారి కిష్టము గూర్పక ।
వాలి నొకకోలచే - గూలబడద్రోసితివి ॥శ్రీ॥

ధార్తరాష్ట్రులు పాండు - తనయులు మును మధ్య ।
వర్తిగ నినుగోరగా సంధికి మధ్య - వర్తిగ నినుగోరగా ॥
వర్తించి పాండవ పక్షంబునను నీవు
ధార్తరాష్ట్రుల బట్టి - ధరపై గూల్పించితివి ॥శ్రీ॥

వరుసగ గోపుర - ప్రాకారమంట పా । ల్విరివిగ గట్టించుచు
భద్రాద్రిలో - విరివిగ గట్టించుచు ॥
నిరతము నినుగొల్చు వరరామదాసుని
కరుణజూడక బంది - ఖానాలోనుంచితివి ॥శ్రీ॥

అన్నా రామన్నా నా - కన్నుదోయితో నే ని
న్నెన్నడు గాంతు ననుచు । కోరికదీర - నెన్నడు గాంతుననుచు

యెన్నడు నిను మరువ - కన్న శ్రీ యినగంటి
పున్నయ్యదాసుని । మొర వినవైతివి ॥శ్రీ॥
భాస సత్తెనపల్లె వాసుడౌ పులహారి। వంశాబ్ధి చంద్రుడైన
ఫీరోజి ఋషీ - శ్వరుని ప్రియ శిష్యుడైన । భాసిల్లు శ్రీపాటి-
బండ్ల వీరయ్యా గురుని । దాసులవిడదీసి । దరిజేర్చుకున్నావు॥శ్రీ॥

3. తోడి రాగము - ఏక తాళము.

నిరతము హరిపద - స్మరణను సలిపెడి । నరునకు మోక్షమే - యో మనసా ॥ పరిపరి విధముల - భ్రాంతులు గలిగెడి పాపపు సంసారములో । నరుగకే । తిరుగకే । యెరుగకే । మరువకే ॥ గురుజన బృందము - గూడి చరించుచు ॥ని॥

తాపసు లందరు - శ్రీపతి పదముల । బ్రాపుగనమ్మి తరించిరే మనసా॥ ఆపరమేశ్వరు - ననుదినము తగను । యోపిక తోడను వేడన్ ॥ కోపమున్ । తాపమున్ । పాపమున్ । బాపెడిన్ కాపాడగదే - కరుణాకర యని ॥ ని ॥

బలిమదహారణుని దలచిన వెంటనే । కలుషములన్నియు - దొలగుగదే । హాలువుగ యినగంటి - పున్నయ్యా దాసుని । బ్రోచినవాడే వాడు ॥ పలుకుచున్ । గులుకుచున్ । దలచుచున్ । బిలచుచున్ । బలుమారును శ్రీపతిని భజించవే ॥నిర॥

తరుగుచు । పెరుగుచు । విరుగుచు । కరుగుచు । దిరిగెడి యెరుకను విడవే ॥ వరలెడు పాటి - బండ్ల వీరగురు । వరు । మంత్ర ధ్యానముచే ॥ తరుగకే - పెరుగకే ॥ విరుగకే । కరుగకే । స్థిరముగనిలచిన - దేవుని వేడవే ॥ నిరతము ॥

౪. బేహాగ్ రాగము - అట తాళము.

రాముల భజన జేయగ రారేమయా॥ ॥రా॥
భామలవలలలో-పల జిక్కి-యుండిన। నేమిసౌఖ్యము లేదయా॥
దేవుని జేరే మార్గము గన రేమయా॥
శ్రీ వాసుదేవుని - సేవించువారలు। పావనులౌదురయా ॥రా॥
అనుదినమును శ్రీ - హరిని దలచ రేమయా॥ ॥రా॥
వనజదళాక్షుని-భజియించువారికి। జననము మరణము లేదయా
అడుగడుగునకు - మాధవా యన రేమయా॥
పుడమి శ్రీ యినగంటి - పున్నయ్యదాసుని। నుడువులు విన రేమయా॥రా॥
మరువక శ్రీరా - మా రామా యన రేమయా ॥రా॥
వరలెడు శ్రీపాటి - బండ్లవీరయగురుని। భావంబు గన రేమయా॥

౫. బేహాగ్ రాగము - జాల్వ తాళము.

రా- మ- భక్తి - రామభక్తి గల్గియుండిన।
యిక రాదు జననము-మరి లేదు మరణము ॥రామ॥
వా - సు- దే- వ। వాసుదేవ నామస్మరణమే।
యనివార్య సౌఖ్యము। కైవల్యమార్గము ॥రామ॥
అ - ప్పి - క - ట్ల। అప్పికట్ల పురిని వెలసిన।
మురహరుని వేడిన। సంహారము వేదన ॥రామ॥
ఇ- న- గం- టి। ఇనగంటి పున్నయాఖ్య దాసుడు।
రచియించు కీర్తన। తరియించు ప్రార్థన ॥రామ॥

పా- టి- బం- డ్ల । పాటిబండ్ల వీరయార్యుని ।
అనుభవవిధానము । హరిభజనసూత్రము ॥రామ॥

౩. దేవగాంధారిరాగము :-జంపెతాళము

నమ్మరాదీ దేహము - బొమ్మలాట విలాసము ॥
తుమ్మలదగ్గులదుంప - తొమ్మిది తొట్లలకొంప ॥నమ్మ॥
పండుటాకు విధమున భూ - మండలంబున రాలుచుండెడి ।
కండలక్రొవ్వులతట్ట - మెండగు నరముల చుట్ట ॥నమ్మ॥
మూడునాళ్ల బ్రతుకుకింత - మోహము జెందుట వింత ।
పాడుపొట్ట కొఱకు చింత - పడుట గొప్ప తప్పుకొంత ॥న॥
చక్కగ యినగంటి పున్నయ - చౌదరి శోధించిచూచిన ।
యొక్క శాస్త్రమైనగాని - యొప్పలేదట సత్యమని ॥న॥
సూటిగ ఫీరోజగురుని - సూత్ర తాత్పర్యంబెరింగిన ।
పాటిబండ్ల వీరయార్యుల-పాదసరోరుహములాన ॥న॥
వాసిగ (శ్రీ) అప్పికట్ల ని - వాసుడైన రామచంద్రుని ।
దోసిలొగ్గి వేడుకొన్న - దోసము లన్నియును సున్న ॥న॥

౭. శంకరాభరణ రాగము - ఆదితాళము.

భజనజేసెడివారిని - పరిహాసమాడ - పామరత్వంబౌసుమీ ॥
సుజనుల కేమికొదువ - కుజనులోర్వకయున్న ।
గజ మెక్కువానికి గలదా శునకబాధ ॥భ॥
చదువులెన్నిజదివినన్-స్నానము సంధ్య జపము తపము జేసినన్ ।
కుదురదు సమబుద్ధి - కుచ్ఛితమతిబోక ।

వదలునె సంసార వాంఛ హరిభక్తిలేక ॥భ॥
గర్వాంధకారులకు – సందేహమేల। కలదు పునర్జన్మము।
శర్వాణీ నుతుడైన – చక్రపాణి భజన।
సర్వకాలములందు సల్పిన గలుగదు ॥భ॥
భవసాగరములోబడన్ – తాపత్రయాది। బాధలచే గుందెడిన్।
భువిని శ్రీ యినగంటి – పున్నయ్యదాసుని।
దివులుదీర్చిన వీరదేశికునిగని రామ ॥భ॥

౮. భారువరాగము – ఏకతాళము.

రామభజన జేయ – రండీ హరి దాసులారా ॥
కామితార్థము లిచ్చి – కాచెడి జానకీ ॥రా॥
తిరుమణి ధరియించి – తిరుచూర్ణము దాల్చి।
కరతాళంబులు – ఘులు ఘుల్లు మనిమ్రోయ ॥రా॥
నీటౌ యడుగులు – సూటిగ వేయుచు।
ఆటల నాడుచు – పాటలు బాడుచు ॥రా॥
సరిగమ పదనిస – సనిదప మగరిస।
సరిగారిగమ గరి – సారి మగరి యని ॥రా॥
ధరికిట ధరికిట – తక్కిట తాకిట।
ధరికిట ధరికిట – తాధిమ్మి తా యని ॥రా॥
భువిని శ్రీ యినగంటి – పున్నయ్య చౌదరి।
శవనధారలుజల్లే – కైవారములు బాడి ॥రా॥
ధరణి శ్రీ వీరయార్య – గురు సార్వభౌముని ॥
వరమంత్ర రాజమును – పఠనజేయుచు మీరు ॥రా॥

౯. ఆనంద భైరవి - ఏకతాళము.

రామ రవికులసోమ - సురరాజ వరదనామా ।
యేమిర నీనామ - మెప్పు - డేమర నో పరంధామా ॥రా॥
వేణుగాన లోల - నిను వేడితి సురపాలా ।
జ్ఞానగుణ సుశీల- నను- గావగ- రావేర కాంచనచేలా ॥రా॥
నీలమేఘశరీర - నవ - నీతచోర రారా ।
జాలిలేదాయేర - నిను చాలగ నమ్మినారా ధీరా ॥రా॥
ధరణి (శ్రీ) అప్పికట్ల పుర - ధామ నా పైవాదా ।
కరినిగావలేదా యనగంటి - పున్నయ్యదాసుని వరదా ॥రా॥
వరలు సత్తెనపల్లి- పుర- వాసుడౌ ఫీరోజి ।
గురుని జేరిన వీర- గురుమంత్ర విశేషవికాస విలాస ॥రా॥

౧౦. బేహాగ్ - ఆదితాళము.

హరి నామార్చనముచే - తరించగలవే ఓమనసా ॥
పామరంబేమికన్ - స్వామిని నోమినన్ ॥
రామనామమంత్ర రాజపఠనము-కామక్రోధలోభహరము॥హ॥
అనుమానములేదు (శ్రీ) - రాములదలచగ మోక్షము ।
గానమున్ ధ్యానమున్ పూనికన్ బూనినన్ ॥
వేణుగానలోలు వేడినవారలన్ - జ్ఞానులని వచియింపగా బడున్ ॥హ॥
కొనియాడినవారల - కోరికదీర బ్రోచే స్వామిని ।
వేడవె - చూడవే - యాడవే - పాడవే - యేడీ రామునికంటె
నితర దైవంబిలను - చూడగలేమెన్నటికిని ॥హ॥

కరి – నాథునిగాచిన – సరోజనేత్రు భజనజేసిన ।
వాదమున్ భేదమున్ – క్రోధమున్ లేదికన్ ।
మోదమున యినగంటి – పున్నయ్యా దాసునకు ।
బోధించి వీరగురుడు దెల్పిన ॥హా॥

## ౧౧. కేదారగౌళరాగము - అటతాళము.

శ్రీరాముల భజనజేయ – దూరమగు పాపములు ।
కోరివేడ ప్రహ్లాదుని కోర్కెదీర్చి బ్రోచినట్టి ॥శ్రీ॥
వనమునందు పాషాణము – వనిత యగురీతిజేసి ।
మునివరుల జన్నముల – ఘనముగాను గాచినట్టి ॥శ్రీ॥
తాటకిని సంహరించి – మేటియగు ఖరునిద్రుంచి ।
వాటముగ నింద్రసుతు – గీటణచి మించినట్టి ॥శ్రీ॥
గజరాజును మకరి బట్టి – గజిబిజివి జేయగను ।
నిజ చక్రముచే వధించి – త్రిజగంబుల స్తుతిగాంచిన ॥శ్రీ॥
గురుతుగ శ్రీ వీరగురు – వరు మంత్రము పఠనజేయ ।
ధరణి యినగంటిపున్నయ – దాసు కోర్కెలీడేర్చిన ॥శ్రీ॥

## ౧౨. హిందూస్థాని ముఖారి - ఆది తాళము.

రామారామా బ్రోవవే మా – రఘుకులసోమా ।
రాక్షసవిరామా । ననుగనుమా । రాక్షసవిరామా ॥
యేమిరా నీ – నామము నే । నేమరక స్మరియించెదన్ ।
కామ జనకా – నా మొరను విని । కామితార్థము లీయరా॥రా॥
నీరజాక్షా క్రూరశిక్షా । సూరిరక్షా మాధవా ।
సారె సారెకు వేడినానుర । జాగమెంచక గావరారా ॥రా॥

ఆపదలను బాపు దొరవని । ప్రాపుజేరితి కేశవా ।
హే పరాత్పరా - నీపదంబుల । నోపికను నే - వింతురా ॥రా॥
భాసురంబౌ - అప్పికట్ల ని । వాస సజ్జన పాలనా ॥
భాస శ్రీ యినగంటి - పున్నయ దాసునేలిన రాఘవా ॥రా॥
వాసినా ఫీరోజి ఋషివరు - పాదసరసిజ మందిన
భాసురంబగు వీరగురు మనో । ల్లాస వాసవపోషణా ॥రా॥

౧౩. ఆనందభైరవి రాగము - ఏకతాళము

రాములను దలచుచున్న - ఓమనసా ।
నీకు - రావు జనన మరణము లెపుడు - నో మనసా ॥
పామరులను గలసియున్న - నోమనసా ।
నీకు - బాధగలదే యమునిచేత - నోమనసా ॥
హరిదాసులను పూజించిన - నోమనసా
నీకు నరచేతిలో వైకుంఠమే - యోమనసా ॥
పరులజూచి నిందించిన - నోమనసా ।
నీకు నరలోకము కాపురమే యో మనసా ॥
కల్ల మాటలాడకున్న - నోమనసా ।
నీకు కైవల్యము ప్రాప్తించునే యోమనసా ॥
యిల్లువాకిళ్లను నమ్మ యోమనసా ।
నీకు నిహాముదప్ప పరములేదే యోమనసా ॥
భువి యినగంటి పున్నయ చౌదరి - యో మనసా ।
నీకు ముక్తిగలిగే మార్గముదెల్పె - నోమనసా ॥
వివరమెఱిగిన వీరగురుని - యోమనసా ।
నీవు వేగమేగని హరిని జేరువో మనసా॥

౧౪. భైరవిరాగము - అటతాళము

సీతాపతి యని - సేవ జేసెడివారి ।
పాతకములు బోవునే - వినవే మనసా ॥

భూతలమున నీవు - పుట్టి గిట్టుచు నుండే ।
రీతి దొలగ జేయునే - వినవే మనసా ॥సీతా॥

కరిరాజ వరద రు - క్మాంగద రక్షణ ।
ఖరహరణా యని వేడవే - వినవే మనసా ॥

హరినామ స్మరణ జే - యని మానవులబట్టి ।
చెరబెట్టునే కాలుడు - వినవే మనసా ॥సీతా॥

సర్వకాలములందు - సర్వావస్థలయందు ।
సర్వేశా యని వేడవే - వినవే మనసా ॥

శర్వాణీసుతుడైన - చక్రపాణి భజన ।
గర్వించి మరువబోకే - వినవే మనసా ॥సీతా॥

కలనైన మరువకు - కాంచనాంబరు పాద ।
కమలముపై ధ్యానము - వినవే మనసా ।
కలిమిలేములు గల - కల్ల సంసారము ।
దలచి దుర్భ్రమ జెందకే - వినవే మనసా ॥సీతా॥

భువిని శ్రీ యినగంటి - పున్నయ్య చౌదరి ।
తవిలిభజించినాడే - వినవే మనసా ॥

అవిరతమలరుచు - అప్పికట్లపురిని ।
నివసించు పరమేశుడే - వినవే మనసా ॥సీతా॥

భాసస త్తెనపల్లె - వాసుడౌ ఫీరోజి ।
వర దేశికేంద్రుజేరి - వినవే మనసా ॥
భాసిల్లు శ్రీ పాటి - బండ్ల వీరయగురుని ।
భావమున నున్న వాడే - వినవే మనసా ॥సీతా॥

౧౫. శంకరాభరణరాగము - ఆదితాళము

నీరేజదళనయన - క్షీరసాగర శయన । కారుణ్య సద్గుణ రాం రాం రాం ॥ సూరిజన మం - దార కేశవ ॥నీరే॥

కాంచనచేలరార - కరుణాలవాలరార । పంచబాణ-జనక రార రాం- రాం- రాం। యెంచి నిను సే-వించుచుంటిని ॥నీ

కరిరాజపోషణ-కౌస్తుభ భూషణ । దురితవిశోషణ రాం- రాం- రాం- ॥ మురాసురాహార - ధరాసుతావర ॥ నీ॥

దానవభంజన-దశరథనందన । మానిజనరంజన రాం-రాం- రాం॥ గానలోల - జ్ఞానశీల ॥నీ॥

భువిని శ్రీ యినగంటి-పున్నయ్య చౌదరివంటి । కవులు నిను వేడ వింటి రాం-రాం-రాం॥ దివదివంబును - సేవజేసెద ॥నీ॥

భాసిల్లు శ్రీ పాటి-బండ్ల వీరయ్య చౌదరి । వరగురు హృదబ్జ భృంగ రాం- రాం- రాం ॥ భాసమానవి-లాస రాఘవ ॥నీ॥

౧౬. శంకరాభరణరాగము - జాల్వ తాళము

బ్రతికెడిదినముల - గోపల రాముని। భజియించగదే మనసా ।
సతతం బీ సం- సారములోబడి । వెతలను జెందక - సౌఖ్యము బొందెడి । గతి గనవలెనే మనసా ॥ బ్రతి ॥

పుట్టుచుగిట్టుచు – నుండెడి జగతికి। మూలములేదే మనసా॥
పుట్టను జెదలు – బుట్టుచు గిట్టుచు। రట్టువడినవతు – కాలము
బుచ్చక । రాముని వేడవే మనసా ॥బ్రి॥

పాపముజేసెడి– నరులకు యముని। బాధలుగలవే మనసా॥
కోపం బనియెడి – గొప్పవిరోధిని । నోపికతోడను నేపణగిం
చిన తాపము గలుగదే మనసా ॥బ్రి॥

దారసుతాదులు –నిజమని నమ్మిన ।వారికి మోసమే మనసా॥
నేరుపుతోడను – నీరజనాభుని! కోరి భజించిన– మానవు
లకు వై । కుంఠముగలదే మనసా ॥బ్రి॥

ఎవరేమనినను – భయపడకను పర । మేశునినమ్మవే మనసా॥
భువి యినగంటి – పున్నయచౌదరి । తవిలిభజించిన – దేవుని
జేరి । ధన్యత గాంచవే మనసా ॥బ్రి॥

భాసనత్తైనపల్లి – వాసుడౌ ఫీరోజి। వరఋషి పథమిదె మనసా॥
భాసురముగ పాటి – బండ్ల వీరయ్య గురు । భావము దెలసిన
ప్రత్యక్షంబగు । స్వామిని జేరవే మనసా ॥బ్రి॥

౧౭. బేహాగ్ రాగము - ఏకతాళము.

ఏ రా (శ్రీ) గో – పాలబాలా । యింతటి చలమేలా ॥
వారిజలోచన – సద్గుణ శీలా । వరకాంచన చేలా ॥ విలసిత–
వర కాంచన చేలా । రారా రాధాలోల మేలా । రక్షింప
కదేలా ॥ఏరా॥

మురియుచు నుండెడి - మోహన రూపా । మునిజన నుత చరణా । శోభిత - మునిజననుతచరణా । ధరా ధర ధారణ - విశ్వంభరణా । దానవసం హారణా ॥ఏ॥

కాకుమాను పుర చెన్న కేశవా । కరుణించవ దేరా । బిరాన- కరుణించవదేరా-ప్రాకటముగ యినగంటి పున్నయా । హృదయ హృదయ విహారా ॥ఏ॥

వాసిగ పులహరి-ఫీరోజిబుషీ। శ్వరు హృత్కంజ నివాసా ॥ వరబుషీ । శ్వరు హృత్కంజ నివాసా । భాసుర పాటి - బండ్ల వీరగురు । వర సుమనోల్లాసా ॥ఏ॥

౧౮. బేహాగ్ రాగము _ ఏక తాళము.

జనులార రామభజన - కనుల కలువుదీర । గనుడీ పరాకు లేక ॥ ధనధాన్యంబుల - దారాసుతాదుల । ఘనులైన ముఖ్య బంధువుల ॥ మనము నందు దలచక యే - యనుమానము । జెందక యే ॥ జను ॥

ఎన్నాళ్లు బ్రతికినను - కొన్ని దినంబుల । కున్నది మరణ మొకటి ॥ కన్నుగానక మీారు- కన్నులవలలజిక్కి । యున్నా రదేమికారణము । యెన్నటికి -నమ్మరాదు । నున్న సుమి ॥ కామసుఖము ॥ జను ॥

కడుపుచిచ్చు కొఱకు గడబిడలేటికి । చెడుపనివలదు ముమ్మాటికి । అడవి పక్షుల కెవ్వ -డాహారమిచ్చెనో । యడిగినవే మును జేరబిలచి॥ అడుగక యే - జీవులకు। వడిమొసంగె । మాధవుండు ॥జ।

భవసాగరములోన - బడి తేలగా లేక । దివులు జెందెడ చేటికి । భువిని శ్రీ యినగంటి- పున్నయ్యదాసుని । బ్రోచిన వీర గురు వరుని । వివరమెరిగి । హరిని వేడ । భవరోగము । బాసిపోవు ॥ జ ॥

౧౫. ముఖారి రాగము - ఆదితాళము.

సురవర నుత చరణా - ఖరాసుర ! హర విశ్వంభరణా । దురితవిదారణ - ధరాధర ధారణ । నిరతము నిన్నే - మరువక నమ్మితి ॥సుర॥

సరసిజాక్ష రారా - నాపై చలము మాను ధీరా ॥ కరివరదా నను - గావగ భారమా । దరి జేరితి నీ -దయ జూపుము రా ॥సుర॥

పక్షివాహ రారా - మురాసుర । శిక్షగావ వేరా ॥ దీక్షతోడ సా - ధించి భజించెద । నక్షయముగ న- న్నాదరించరా ॥సుర॥

దనుజనికరహరణా - జనార్దన । వనధిసుతా రమణా ॥ అనయము నామది - నిను స్మరియించెద । ననిమిషరక్షణ - యరమర సేయకు ॥సుర॥

భవవిదార రారా అప్పికట్ల । వాసనిర్వికారా ॥ భువి యినగంటి - పున్నయ్య దాసునకు । వివరము దెల్పిన - వీరయ గురు నత ॥సుర॥

౨౦. జేవాగ్ రాగము-చాపుతాళము.

రాముల భజనజేయ – రాదా పాపిష్టిమనసా ॥
ఏమిలేదు ఛీఛీ – కామసుఖములో । పామరులకేగాక । నీకేలనే
పామరులకేగాక । యేమాత్రమున్ – దలంచబోకు చాల్ చాల్॥
సోమసూర్యులను – చూపులచేతను – చూచుచునుండెడివాడు।
రాముడని నమ్మవలెనే । ముమ్మాటికి । రాముడని నమ్మవలెనే।
పామరమున్ – దొలంగ జేయ మేల్ మేల్ ॥

నేమముతోడను । వేమారు శ్రీరామ నామము స్మరియించు
చున్న వారలన్ । కామితార్థములిచ్చి–కాచుచుండునే । నీమూ
ఖ రమున్ వదలివేసిన హోయ్ హోయ్ ॥రా॥

కోరి పఠనజేయవే – గోవిందుని కీర్తన ॥
సారెసారెకున్ –చాలనమ్మికన్ । సారసనేత్రుని మదిన్ । స్మరిం
చుచున్ సారసనేత్రుని మదిన్ । విడనాడకే । కాలము వృథా
జేయకే । లేకుసుమ్మి యీ–ధారుణియందున ।శ్రీరఘురాముని
సములు । వేరైనభ్రాంతిజెందకే । వెదకిన లేరు । వేరైనభ్రాంతి
జెందకే । నోరాడదే । యితరులతో బోల్పగా ॥
శ్రీరామ యని యొక్క । సారి దలంచిన । ఘోరపాపములు।
దూరమౌనె । దారిదెలియక నీవు– దైన్యమొందకే । యేరోజు
నన్ – పరమేశ్వరుని మరువకే ॥రా॥

భవానీ సుతుండే । పాపాళిసంహారుడే ॥
జపముతోడను – స్మరణజేయుమా । యెవరితో నీకేలనే ।

శ్రీరాముడుండ । యెవరితో నీకేలనే । యేమరకే తవిలి
భజన జేయవే ॥

అవిరతమును మా - ధవుపాదంబుల । నర్చనజేసిడివారికి ।
భవరోగములంటవే । భస్మములౌను । భవరోగములంటవే ।
దివులొందకే । భక్తితో సేవించవే ॥

భువిని శ్రీయినగంటి । పున్నయ్యదాసునకు । వివర మెరిగించిన ।
వీరగురు నుతిగన్న । భువన మోహను డైన - పురుషోత్తముడే ।
నివసించెనే । అప్పికట్లపురములో ॥రా॥

౨౧. దర్బారురాగము - అటతాళము

నారాయణ కమలచరణా । జగత్కారణ దుష్టసంహారణా ।
భూరిభుజగశయనా । భూమిసుతారమణా ।
కారుణ్యసద్గుణ । గజరాజరక్షణ ॥నా॥

కమనీయకాంచనచేలా । వేణుగానలోలా విబుధపాలా ।
అమరసన్నుతశీలా । యఖిలభువనఖేలా ।
విమలశోభితఫాలా । విలసితశరజాలా ॥నా॥

భాసురశ్యామలవేషా । వజ్రవైడూర్యమాణిక్యభూషా ।
వాసవపరిపోషా । వైరితతిసంశోషా
దాసప్రసంతోషా । తత్వార్థసంభాషా ॥నా॥

మానసేంద్రహృదయవిహారా । భక్తమానసవీధిసంచారా।
దానవసంహారా । ధర్మాధర్మవిచారా ।
దీనజనమందారా । దివ్యసదాచారా ॥నా॥

జ్ఞానిజనసముదాయపతీ । యినగంటి పున్నయదాసరతీ ।
ఆనందవీరగురు । మానసాంతరదీప్తీ ।
మానిత శ్రీవత్స । మధుకైటభశిక్షీ ॥నా॥

శ్రీరామచంద్రానుగ్రహ శ్రీవీరగురు పరబ్రహ్మార్పణమస్తు.
భక్తిభావము సంపూర్ణము.



ఓమ్

శ్రీ రామచంద్రానుగ్రహ శ్రీ వీరగురుపరబ్రహ్మణే నమః

# బ్రహ్మరహస్యము

## జ్ఞానభావము

### ౧. లతాంగి - ఏకతాళము.

మనసా నా మాట నమ్మవే। సద్గురుని జేర। జనన మరణ
ములుండవే। ధనధాన్యములు జూచి - దారాపుత్రుల జూచి।
ఘనమౌ లోగిండ్లుజూచి - గర్వించుచున్నావేమే ॥మన॥

ఇతరు లేమన్న నీ కేమే। వారికే గ్గే। గతిని దలపగ పని
యేమే। సతతము ఘోరమౌ సం - సారములోన జిక్కి।
వెతజెందుచుండి నీవు - విలపించు చున్నావేమే ॥మన॥

ఏమి శాశ్వతము దేహము। క్షణభంగురంబిది। యెందుకు
నీకీమోహము। కామక్రోధములచే - కనులగానక నీవు। పామ
రత్వముచేత - బాధపడు చున్నావేమే ॥మన॥

త్రాడు చీకటిలో ద్రొక్కియు। పామనుచు నమ్మి। తత్తర
పాటుజెందియు। గోడుజెందెడి వాని - గోలచందముగానే।
పాడు జగమునుజూచి భయమొందు చున్నావేమే ॥మన॥

ధాటిగ బోధించు నట్టి। యినగంటి పున్నయ। దాసుని
బాట గనిపెట్టి। మూటి మూటిని దాటి - మేటికూటమున
నిలచి। సూటిగ వీరగురుని చూడలేకున్నావేమే ॥మన॥

౨. మధ్యమావతి - జాల్వ తాళము

ఎన్నాళ్ళు బ్రతికిన - నేమి ఫలమమ్మా । యిది యేమి ఫల మమ్మా । ఎన్నడో యొకనాడు । యెగిరిపో నమ్మా । యిది యెగిరిపో నమ్మా ॥ఎ॥

చుట్టాలు పక్కాలు చూడ రారమ్మా । నిను జూడ రా రమ్మా।కట్టెలలో బెట్టి-కాల్చెదరమ్మా।నినుగాల్చెదరమ్మా॥ఎ॥

మట్టిబొమ్మవంటి - మాయఘటమమ్మా । యిది మాయ ఘట మమ్మా । పుట్టుగిట్టులదిరిగే - బొంగర మమ్మా । యిది బొంగర మమ్మా ॥ఎ॥

మూడారు నాకిళ్ళ - మురికి కొంపమ్మా । యిది మురికి కొంపమ్మా । పాడుపొట్ట కొఱకు । బాధించునమ్మా । యిది బాధించునమ్మా ॥ ఎ ॥

కండకావరముచే కనుగానదమ్మా । యిది కనుగానదమ్మా । దండి యమబాధకు-తాళలేదమ్మా । యిదితాళలేదమ్మా ॥ఎ॥

పగవారికైన యీబాధ వద్దమ్మా । యీ బాధవద్దమ్మా । జగము పైన భ్రాంతి - చాలించ వమ్మా । యిక చాలించ వమ్మా ॥ఎ॥

గురుపాదమునుబట్టి - గురు తెరుగవమ్మా । నీగురు తెరుగ వమ్మా । గురు తెరిగినను నీవు - తిరిగి రావమ్మా । యిక తిరిగి రావమ్మా ॥ఎ॥

(శ్రీ) వీరగురువరుని - సేవించవమ్మా । నీవు సేవించవమ్మా ।

భావించి పరమాత్మ్మ - భజియించ వమ్మా । నీవు భజియించ వమ్మా ॥ఎ॥

పున్నయ్య దాసుని - బోధవినవమ్మా । సద్బోధవినవమ్మా నిన్ను నీవు జూచే - నిజము గన వమ్మా । నీ నిజము గన వమ్మా ॥ఎ॥

3. మోహన - అటతాళము

సేవించరారే - శ్రీవీరగురుని - సేవించరారే ॥
సేవించరారమ్మ - చింతలన్నియు మాని ।
భావించి సద్గురుని పరమాత్మ యని మీరు ॥ సే ॥

సందేహమేలా - ఘోరమాబాధ - జెందెదరేలా ।
ఎందరో మీకనుల - ముందు మరణించిరి ।
యెందుకు మీకింక - యీలోకముపైయాశ ॥ సే ॥

క్రూరులై మీరు - చేసెదరేల - ఘోరకర్మలు ।
సారములేని సం - సారవారాశిలో ।
దూరి తపించక - తొలిగించుకొని మీరు ॥సే॥

కనుపాపలందు - వెలిగెడిజ్యోతి । కలదు మీయందు ।
కనిపించి కనరాక - మినుకుమినుకనదోచు ।
ఘనకోటి సూర్యప్ర - కాశము గననెంచి ॥సే॥

భవరోగములకు - దివ్యౌషధము - పరమార్థపథము ।
భువిని శ్రీ యినగంటి - పున్నయ్య దాసునకు ।
శివర మెరిగించిన - వేదాంత వేద్యుని ॥ సే ॥

## ౪. నాదనామక్రియ - ఏకతాళము.

భక్తిగల్గి గురు - పాదపద్మములు । బట్టినవారే ధన్యులు ।
భక్తిహీనులై - వరగురుపాదము । బట్టనివారేయన్యులు ॥భ॥

పంచభూత సం - బంధము దెలిసి । వరలెడివారే ధన్యులు ।
వంచకత్వమున పరదూషణతో - వదరెడువారేయన్యులు॥భ॥

ఆరుచక్రముల కావలిచక్రము - నరసినవారే ధన్యులు ।
జారచోర సంచారులస్నేహము - సలిపెడివారేయన్యులు ॥భ॥

ధీరులగుచు వర తారకమున కడ - తేరినవారే ధన్యులు ।
ఘోరమైన సంసార వారినిధి - గూలినవారే యన్యులు ॥భ॥

ధరణిని పున్నయదాసుని బోధలు - తరచినవారే ధన్యులు ।
పరమాత్ముని సద్భక్తుల హేళన - పరచినవారేయన్యులు॥భ॥

## ౫. కీరవాణి - అటతాళము.

ప్ర॥ వసుధమానవజన్మమెత్తిన - ఫలమదేమో గురువరా ।
ఉ॥ పొసగ మోక్షము జెందిజన్మము-పూర్తి జేయుటశిష్యుడా॥వ॥

పూర్తిజేసే విధమదేమో - బోధజేయుము గురువరా ।
మూర్తివంతముగాని దేవుని - మ్రొక్కి వేడర శిష్యుడా ॥వ॥

మ్రొక్కి వేడే తలపునాకు - పుట్టదేమో గురువరా ।
అక్కటకటా పూర్వకర్మము - లడ్డమాయెను శిష్యుడా ॥వ॥

అడ్డమైన కర్మజాలం - బణగుటెట్లో గురువరా ।
దిడ్డివాకిట నిలిచిద్వారము - తెరిచిచూడర శిష్యుడా ॥వ॥

తెరచిచూచిన గానుపించెడి - తెరవదేమో గురువరా ।
మరలజన్మము లేకయుండే - మార్గమేయది శిష్యుడా ॥వ॥
మార్గమధ్యము నందునిలచిన - మాయయేమో గురువరా ।
స్వర్గలోకము జేరవలెనను - భ్రాంతిరాయది శిష్యుడా ॥వ॥
భ్రాంతివలన గలుగబోయెడి - బాధయేమో గురువరా ।
కొంతకాలం బుండిజన్మము - గోరుచుంచుట శిష్యుడా ॥వ॥
కోరికలు నశియించగా సమ - కూరుటేమో గురువరా
నారదాది మునీంద్రబృందము - గోరుమోక్షము శిష్యుడా ॥వ॥
మోక్షమిచ్చి రక్షజేసెడి - పుణ్యులెవరో గురువరా ।
సాక్షియై వెలుగొందు వీరయ - సద్గురుండే శిష్యుడా ॥వ॥
వీరయార్యుల సేవజేసే - విధమదేమో గురువరా ।
ధారుణిని యినగంటి పున్నయ - దాసు దెల్పును శిష్యుడా ॥వ॥

౬. యదుకులకాంభోజి - అటతాళము

లోకాతీతుడైన గురుని - లోనిగుట్టుదెలిసికొని । శోకమోహ ములనువిడవేమే । ఓవెఱ్ఱిమనసా । నీకులేనిచింత నాకేమే ॥లో॥
మూడు కోవలపుట్టలోను - కోడెత్రాచుపడిగవిప్పి । ఆడుచున్నది నీపైపగబట్టి॥ఓవెఱ్ఱిమనసా । మేడయెక్కి నిదుర జెందవే॥లో॥
ఆర్గురు శత్రువులునిన్ను - హతము జేయ నాలోచించి । మార్గమధ్యమందు నిలచిరి ఓవెఱ్ఱిమనసా । మార్గమునుమార్చి తిరుగవే ॥లో॥ క్రూరమృగములెనిమిది నీ - కొఱకు మేతనీళ్లు మాని । పోరదలచి పొంచియున్నవే । ఓ వెఱ్ఱిమనసా । ఊరివారిని విడిచియుండకే ॥లో॥

ధారుణి యినగంటి పున్నయ । దాసునేలిన పాటిబండ్ల । వీర
య్యాగ్ర్య గురువరేణ్యుని । ఓ వెఱ్ఱిమనసా । కోరి కొలచి ముక్తి
జెందవే ॥ లో ॥

౭. అసావేరి - జాల్వ తాళము

గురుపాదపద్మముగంటిని । నా । గురుతు నేనే దెలిసికొంటిని॥గు॥
గురుమంత్రరాజమును - కోరి పఠించుచు ।
పరులతో మాటలాడే - పని మానియుంటిని ॥గు॥
కోటిజన్మముల గాంచియుంటిని ।నేను। నేటికీమాన జన్మగంటిని
బూటకములుజేసి - పొట్టనిండించుకొని ।
కాటికట్టెలకేగే - గతి నాకేమంటిని ॥గు॥
తల్లిదండ్రు లన్నదమ్ములు । చూడ । కల్లగారడీవాని బొమ్మలు।
పిల్లలు బొమ్మలకు - పెండ్లిండ్లు జేసినట్లు ।
ప్రల్లదనమున నరులు - బడుపాట్లు గంటిని ॥గు॥
యోగులు భోగులు బోయిరి బై! రాగులు మాయమైపోయిరి।
రాగులు జోగులు - రాజాధిరాజులు ।
త్యాగులు బోయిరింక తడవు నాకేలనంటి ॥గు॥
విరిపగబోధించి దీక్షగా - పులహారి । ఫీరోజి దేశికేంద్రుని
సాక్షిగా । ధరణి యినగంటి పున్నయ - దాసుని బ్రోచినట్టి।
వరపాటిబండ్ల వీరయ - గురుసార్వభౌమునిగంటి ॥గు॥

౮. శహాన జాల్వతాళము

ప్ర॥ గురుపాద పద్మములను - కోరి పూజించిన
దొరికెడిఫలమేమే తల్లీ నాకు । దొరికెడిఫలమేమే తల్లీ ।

ఉ॥ దరిలేని జననమరణ - తాపంబుచల్లారి । తరియించేఫలము దొరుకునమ్మానీకు । తరియించేఫలము దొరుకునమ్మా ॥

వరగురుని పూజజేసే - పద్ధతి నేనెరుగ । కరుణించి బోధ జేయుము తల్లి నాకు । కరుణించి బోధచేయుముతల్లి ॥

గురుసన్నిధినిజేర - గురుడే బోధించుగాని । పరులుదెల్పగ లేరో యమ్మా నీకు । పరులు దెల్పగలేరోయమ్మా ॥

గురుసన్నిధినిజేర - గుణహీనురాలను నేను । తరమానా జేరుటకు తల్లినాకు । తరమానా జేరుటకు తల్లి॥

గురుకరుణ గలిగెనేని - గుణహీనమంతరించి । సరస సద్గుణము గల్గునమ్మా నీకు । సరససద్గుణము గల్గునమ్మా ॥

సరసద్గుణములొసగి - సంరక్షణము జేసే - గురునిజూపింప వేమే తల్లినాకు । గురునిజూపింపవేమే తల్లి ॥

ధరణి యినగంటి వున్నయ - దాసునేలిన వీర । గురుని జూపెద చూడవమ్మానీకు । గురునిజూపెద చూడవమ్మా ॥

వర పాటిబండ్ల వంశ - వారాశిచంద్రుడైన । గురుని దర్శనమందె తల్లినాకు । గురునిదర్శనమందె తల్లి ॥

వరలు సత్తెనపల్లె - వాసుడౌ ఫీరోజి । గురువరుని కరుణ గలదోయమ్మా నీకు । గురువరుని కరుణగలదోయమ్మా ॥గు॥

## ౯. శంకరాభరణము - జుల్వతాళము

కాంతలార బయలుదేరరే । సొగసైన ముక్తి । కాంతపెండ్లి కనులజూడరే ॥

ఎంత కాలమైనగాని - అంతులేని పనులు జేయ । యింతటి యారాటమేల - కొంతసేపు విడిచి పెట్టి ॥కాం॥

ఎందరో మహానుభావులు - ఘనరాజయోగు । లెందరో వేదాంతవేద్యులు । ఎందరో రాజాధిరాజులు । ఎందరోవరచక్ర వర్తులు । కొందరనివచింపనేల - నందరు వేంచేయుచుండిరి॥కా॥

కులము గోత్రములనుజూడరు । ఆ పెండ్లివారు । గుణము నేగని పెట్టుచుందురు। వలు రకంబుల వన్నె చీరెలు- వర లేడు బంగారు సొమ్ములు । తళుకు బెళుకుల రంగు రవికెలు।కలిగిన ధరియించుకొని ॥కాం॥

తల్లిదండ్రుడు లెవరులేరట । ఆ చిన్న దానికి । తగిన వరుడు దొరుక లేదట । పెళ్లిపందిరి మధ్యలోన -కల్ల యంత్రమొకటి గట్టి ॥ విల్లనంబుతో గొట్టువానికి - పెండ్లిజేయగ నెంచియుం డిరి ॥కాం॥

భాసుర (శ్రీ) రామదాసుడౌ।ఫీరోజిదేశిక । వర్యుని ప్రేమంపు శిష్యుడౌ ధీసమేతుడైన వీరయ - దేశికేంద్రుని యాజ్ఞ బొంది । వాసిగ యినగంటి పున్నయ - దాసు వ్రాసిన లేఖ జూచి ॥కాం॥

## ౧౦. నాదనామక్రియ - అటతాళము

ఎందుకే యీజన్మము । పాపిష్ఠి మనసా । పొందవే కైవల్యము:॥ పందిబురదలో మునిగియుండిన - చందమున మోహామున జిక్కి । ముందు గతియేమో యెరుంగక - పందవై చరియించుచుంటివి ॥ఎం॥

ధనము ధాన్యము సత్యమా । దారా సుతాదులు । ఘన గృహంబులు నిత్యమా । ఘనహరిశ్చంద్రుండు నలుడు– కర్ణుడు ను దశరధుడు సగరుడు – తనువు విడచి వెడలిపోయెడి – తరుణమున గొనిపోయినారా ॥ఎం॥

వంచకులతో జేరకే । మద మత్సరంబులు బెంచి వాదము జేయకే॥ పంచవన్నెల రామచిలుక – పంజరంబుననుండి దుమికి పొంచి రెండు గండుబిల్లుల – పోరిచంపిన జాడ దెలియవే ॥ఎం॥

మూటి మూటిని జేరవే – పైభాగమందున । మేటిరంధ్రము దూరవే। మూటిమూటిని నాల్గుమూర్ల వాటముగ హెచ్చించి చూచిన । ఆటలాడే సూత్రధారుని । యర్థమే పరమార్థమౌను ॥ఎం॥

కోరికలు విడనాడవే । వైరాగ్యపురుషుల జేరి పాటలు బాడవే । ధారుణిని యినగంటి పున్నయ – దాసునేలిన పాటిబండ్ల । వీరగురుని సేవజేసిన – దూరమా జననంబు మరణము ॥ఎం॥

౧౧. నాదనామక్రియ – ఆదితాళము

హంసనుబట్టి విధమును సమ్మని ।
హంసను గనుగొని తెలియరయా ।
హింసలుజేయుచు ఘోరనరకమున ।
హింసలు జెందెద రెందుకయా ॥హం॥
విడివడి వడిగాదిరిగే చిలుకను – విశ్వవశ నిలకడజేయరయా।
కుడియెడమల నాటాడే నెమలిని–
కుదురుపరచి బంధించరయా ॥హం॥

రెండుపాములనడుమ బరుండిన - కొండచిలువను లేపరయా ।
కొండలోపల గనుపడుచుండే-
గుహలో పయనముజేయరయా ॥హం॥
మధ్యకమలమున తుమ్మెద రొదవిని -
మకుకారంబులు వీడరయా ।
తథ్యముగా ముమ్మూలకోనలో -
తళుకులు బెళుకులు జూడరయా ॥హం॥
వేయిరేకుల కమలపీఠమున - వికసితరంధ్రము దూరరయా ।
మాయజగజ్జాలవు గారడీ మటు -
మాయమైన బయలందరయా ॥హం॥
ధర యినగంటి పున్నయదాసుని - తత్వార్థంబు పఠించరయా
మరువక పాటిబండ్ల వీరగురు -
మంత్రంబును ధ్యానించరయా ॥హం॥

౧౨. పున్నాగ - అటతాళము.

ప్ర॥ నాపూర్వ ఫలమేమో - నన్ను నేనెరుగను । యీపాపు దేహామందేమైయున్నా నే । కల్పవల్లీ । కల్పవల్లీ । ననుగన్న తల్లీ । కల్పవల్లీ ॥

ఉ॥ పాపలలో శుద్ధ - స్ఫటిక సన్నిభమైన । ఆపోజ్యోతివినీవై - యలరుచున్నావే। ప్రియకుమారీ। ప్రియకుమారీ। వర సౌకుమారీ। ప్రియ కుమారీ ॥

ఆపోజ్యోతిని నేనై - యలరుచున్నట్లయిన - చూపులో చూపుజూచే విధమేమే । కల్ప వల్లీ ॥ ......

ఛూపు రూపులులేని – చోటున నిలచిన – ఆ పరంజ్యోతిః
నీ – కనుభవ మానే ॥ ప్రియకుమారీ ॥............

ఈడు జోడై క్రీడ – లాడుచుండే హంస । జోడు విడచి
వెళ్లేజాడ యేమమ్మా ॥ కల్పవల్లీ ॥..................

మూడారు వాకిళ్లు – మూసి నిద్రించిన । కోడె త్రాచును
లేపి యాడించ వలెనే ॥ ప్రియకుమారీ ॥...............

పడిగ విప్పినపాము – పగబట్టి పైకెగసి । కుడి యెడమలను
జుట్టుకొన్న నేమానే ॥ కల్పవల్లీ ॥ ..................

అడుగు భాగమునందు – యణచి త్రొక్కిన పాము –
పెడత్రోవకేగును భీతిలేదమ్మా ॥ ప్రియకుమారీ ॥ ......

ఆరీతి పెడత్రోవ నరిగియుండిన పాము । చేరే మార్గంబేమో
చెప్పవేమమ్మా ॥ కల్పవల్లీ ॥.......................

దారి దొలగినపాము – మేరుగిరి గుహలోన । దూరి శిఖర
ము పైకి జేరునోయమ్మా ॥ ప్రియకుమారీ ॥............

మేరుశిఖర సహ – స్రారపీఠిని జేరి । కారాడే పెనుబాము
గతియే మానమ్మా ॥కల్పవల్లీ ॥ ..................

ఫీరోజి గురువరుని – పీఠస్థానంబున । వీరగురుమంత్రము ను –
వినిభస్మమానే ॥ప్రియకుమారీ॥.....................

రవిచంద్రు లంటంగ – రాని యాస్థలమందు । అవిరళముగ
వనునే – నరయు విధమే మే ॥కల్పవల్లీ॥...............

భువిని (శ్రీ) యినగంటి – పున్నయ్యదాసుని। వివరమడిగిన
నీకు – వివరించునమ్మా ॥ప్రియకుమారీ॥ ... ... ...

౧౩. ముఖారి – అటతాళము

కారణాచార్యులు – కరుణించినను మోక్ష। ద్వారమునకు
జేర్చెనే । తారకబ్రహ్మ సం – దర్శన మందించి । తాపంబు
చల్లార్చెనే ॥కా॥

గంగాయమునలనడుమ – పొంగి పొరలుచున్న । రంగైన
నది జేర్చెనే । చెంగావి రంగుల – సింగారముల తోడ ।
రంగారు భ్రమ దీర్చెనే ॥కా॥

నిండుపున్నమనాటి – పండువెన్నెలలోన – ఖండచిత్కళ
జేర్చెనే । ఎండమావుల వలె – నుండే పిండాండ బ్ర ।
హ్మాండము బోకార్చెనే ॥కా॥

ఆరుమేడలపై శృం – గారమైనట్టి బం । గారు మేడకు
జేర్చెనే । సార సాంతర్భాగ – స్థలమందుగల సూక్ష్మ ।
ద్వారమునకు దూర్చెనే ॥కా॥

తరుగుపెరుగులు లేని – మరల తిరిగిరాని । పరిపూర్ణమున
జేర్చెనే । మరిమరి తొలకరి – మెరుపులవలె దిరిగే । మెరు
కను బరిమార్చెనే ॥కా॥

భువిని శ్రీ యినగంటి – పున్నయ్యదాసుని । బోధ వీధుల
జేర్చెనే । భవరహితుడౌ పాటి – బండ్ల వీరయగురుని । భావం
బు సమకూర్చెనే ॥కా॥

## ౧౪. కీరవాణి - అటతాళము

కారుచీకటి కోనలోపల – కాపురము దొలగించరా,
మేరమీరిన మెరుగు బంగరు – మేడలో నివసించరా ॥కా॥
కలతలను గలగించు మతముల – గాథలను విరమించరా।
అలుకు తొలకరి మెరుపుతీగెల – తళుకులను గమనించరా ॥కా॥
తెలిసి తెలియని తర్కవాదుల – చెలిమి యిక జాలించరా।
పలురకంబుల చీరెగట్టిన – భామతో భాషించరా ॥కా॥
వాడవాడల దిరుగు పక్షిని – బట్టిరెక్కలు దు్రించరా।
ఈడు జోడుగ గూడి క్రీడల – నాడు హంసను బెంచరా ॥కా॥
మాయగారడి బొమ్మలాటత – మాషలను వర్జించరా।
మాయమాయంబైన సద్గురు – మార్గమును శోధించరా ॥కా॥
వీరయార్యవరేణ్యు సన్నిధి – జేరి బంధము ద్రెంచరా।
ధారుణిని యినగంటి వున్నయ – దాసు బోధపఠించరా ॥కా॥

## ౧౫. వరాళి అటతాళము

ప్రశ్న॥ కటికి చీకటివేళ – కారడవినున్నావు। కాపుర మేయూరు చిన్నదాన।

ఉ॥ ఘటము లోపలవెలిగే–ఘనకోటిసూర్యప్ర। కాశంబు మాయూరు చిన్నవాడా।

మెరుపు తీగెలకాంతి –మించిన మేనితో। తిరుగు కారణమే మే చిన్నదానా।

ధరణి లోపల నాకు - తగిన పురుషుడు లేక । తిరుగుచు న్నానోయి చిన్నవాడా ।

వయసు సొగసులు గలిగి-వరలుచుండిన నన్ను । వరియించ రాదటే చిన్నదానా ।

భయముడిగి మాయూరు - పయనమై వచ్చిన। వరియించ గలనోయి చిన్నవాడా ।

పండురంగుల నాల్గు - బంగారు రేకుల । మండల మున్నదే చిన్నదానా ।

దండ కమండల - ధారియౌ బ్రహ్మను । దర్శించిరావోయి చిన్నవాడా ।

ఆరు రేకులచే సిం - దూరమై మెరయు గ । ర్భాగార మున్నదే చిన్నదానా ।

సారస వరశంఖ-చక్రగదా ధరుని । స్మరియించి రావోయి చిన్నవాడా ।

పది రేకులను మేఘ-వర్ణసంయుతమైన । ప్రాకారమున్నదే చిన్నదానా ।

పదిలంబుగా వృషభ - పతియైన రుద్రుని । భజియించి రావోయి చిన్నవాడా ।

శ్రమించు పండ్రెండు - రేకులధూమ్రంపు । చిత్రగృహ మున్నదే చిన్నదానా ।

భూమీ భారంబణచే–మూడుకన్నుల వాని । పూజించి రావోయి చిన్నవాడా ।

పదహారు రేకుల – భాసిల్లు సిందూర । భాండార మున్నదే చిన్నదానా ।

చెదరకుండగ మనసు – జేర్చి సదాశివుని । సేవించి రావోయి చిన్నవాడా ।

రెండు రేకులు గల్గి – యుండి । ధవళంబైన ।కొండబోటున్నదే చిన్న దానా ।

పండు వెన్నెలలోన – ఖండ చంద్రూపుని । ప్రార్థించి రావోయి చిన్నవాడా ॥

వేయిరేకుల రాజ – వీధిచే నలరారు । పెద్దయూగున్నదే చిన్న దానా ।

ఆయూరే మాయూరు – అందున్న । సద్గురుని । ఆజ్ఞగైకొనవోయి చిన్నవాడా ।

భవరహితుడౌ పాటి–బుడ్ల వీరయగురుని । భావమందెను రావే చిన్నదానా ।

భువిని (శ్రీ) యినగంటి – వున్నయ్యదాసుని । బోధచే గల సితి చిన్నవాడా ।

౧౬. నాదనామక్రియ - జాల్వతాళము.

సంసారమను మోహా – సాగరంబున జిక్కి । హింస జెందెద

వేమే మనసా। హంసభావజ్ఞుడై – యలరారు గురురాజ। హంస
దరిజేరవే మనసా ॥సం॥

ధన ధాన్య వస్తు వా – హన సంపదలకొఱకు। తల్లడిల్లెద
వేమే మనసా। కనకాద్రి సమమైన – కలిమి గల్గినగాని। తనివి
దీరదే వెఱ్ఱి మనసా ॥సం॥

పుత్ర మిత్ర కళత్ర – భోగంబులనుగాంచి। మురియు చుం
డెదవేమే మనసా। ధాత్రీస్థలినివిడచి – తరలిపోయెడి మరణ।
సూత్రంబు గుర్తించు మనసా ॥సం॥

ఎందుండివచ్చితివో – యెందుకిట్లుంటివో। ముందెందు బో
యెదవో మనసా। సందర్భమునుగాంచి – సారంబు దిలకించి।
సద్గతినిజెందవే మనసా ॥సం॥

శ్రీ గురుబ్రహ్మ యని – శ్రీ గురుర్విష్ణుయని। శ్రీగురుశ్శివ
యనవే మనసా। శ్రీ గురు పరబ్రహ్మ – చిద్విలాసాద్వైత।
చిత్రపరిపూర్ణమిది మనసా ॥సం॥

భువిని శ్రీ యినగంటి- పున్నయ్య దాసుని। బోధగైకొన
వేమే మనసా। భవరహితుడౌ పాటి-బండ్ల వీరయ గురుని।
భావంబుగానవే మనసా ॥సం॥

వాసిగా ఫీరోజ-వర దేశికేంద్రుని। పరమార్థమును వినవే
మనసా। భాస శేషయగురు వి। లాస భద్రాచలని। వాస
రామా యనవే మనసా ॥సం॥

రహిలక్ష్మణాచార్య - రంగరాజాచార్య । రాజమార్గంబిదే మనసా । సహజ పరిపూర్ణ వి - స్తారసారోప ని । పద్రబ్రహ్మ పథమిదే మనసా ॥సం॥

ఈ రహస్యంబెవ్వ - రేని నిన్నడిగిన । యెరిగించగారాదే మనసా । వీరగురు శిష్యుడై - వెలయు వున్నయదాసు । వివరించి తెల్పునే మనసా ॥సం॥

శ్రీరామచంద్రానుగ్రహా శ్రీ వీరగురు పరబ్రహ్మార్పణమస్తు.

జ్ఞానభావము సంపూర్ణము.



ఓమ్

శ్రీ రామచంద్రానుగ్రహ శ్రీ వీరగురుపరబ్రహ్మణే నమః

# బ్రహ్మరహస్యము

---

## అచలభావము

### ౧. సింహభూపాలము - అటతాళము.

రామ భజనలు జేయరేమండీ । జనులార మీరు । రాము డెవడో తెలియ రేమండీ ॥

రాముడెవడో తెలియనేరక - రామ భజనలు జేసినంతనే కామితార్థంబెటుల గల్గును - రామరామదొరకబోదు ॥రా॥

రాము డనగా దేవుడే నండీ । ఆ రామమూర్తికి । నామ రూపము లేమి లేవండీ । గుర్తించుటకునై । రాముడనెడి పేరు గలదండీ । ప్రశ్నింప వలదు । రామనామము చిత్రమౌనండీ ॥

రాముడన బ్రాహ్మణుడు గాడు - రాముడన క్షత్రియుడు గాడు । రాముడన వైశ్యుండుగాడు - రాముడన శూద్రుండు గాడు ॥ రా ॥

జనన మరణము లెపుడు లేవండీ । రావణుడు మొదలగు । దనుజులకు భయపడడు నిజమండీ । సనకాదిమునులకు । గన బడుట బహుదుర్లభం బండీ । వాల్మీకియైనను । మనమునను ధ్యానించవలె నండీ ॥జ॥

వనమునను వసియించు టేమో – వనితకై పోరాడుటేమో ।
దనుజులనుదునుమాడుటేమో–తానెరుంగడొకప్పుడైనను ॥రా॥

స్నానములు సంధ్యలును జపములును । తపములును వ్రతములు । దానములు ధర్మంబులర్చనలు । యోగములు ముద్రలు ధ్యానములు శ్రవణములు మననములు । బహుబంధనంబులు । మానములు మంత్రములు తంత్రములు ॥స్నా॥

మానవులు జేసెదరుగాని – మాటలాడండా మహాత్ముడు ।
తాను నేనను భ్రాంతి లేనం - బైన వాడే రామమూర్తి ॥రా॥

తిరుపతికి రామేశ్వరంబునకు । కాశికిని పండరి । పురమునకు బదరీవనంబునకు । కంచికిని మంగళ । గిరిపురికి కన్యాకుమారికిని । యీతత్వ భావంబెరుగగా జన నవసరములేదు ॥తి॥

వర గురుండౌ వీరయార్యుని – కరుణచే పరమార్థతత్వము ।
తరచగల యినగంటి పున్నయ - దాసునడిగి వినరమెరిగి ॥రా॥

## ౨. దేవగాంధారి – అటతాళము

వినరా। మాయలమారిజీవా ॥ కనరా। సద్గురువరుని త్రోవ।
జననమరణము లనెడిచక్రం । బునను గిరగిర దిరిగి చెడితివి ॥వి॥

ఎవరు నీ ఖతిజూచేవారు । ఎవరు । నీమొరవినబోరు ।
పవనమాకస మగ్ని నీరము । భువియుశూన్యంబై నశించెను ॥వి॥

నీకు। నీవేదిక్కైయున్నావు।నీకు । నీవేమొక్కైయున్నావు।
లోకమెల్లనశించెనని బహు । లోభమున విలపించు చుంటివి ॥వి॥

జార । చోరుల జేరినావు । క్రూర । కర్మము జేసినావు । నోరు దెరచి క్రింగ నిన్నొక । ఘోర రాక్షసి మిగిలియున్నది ॥వి॥

ఎరుక । నీవనితలచినావు । మరపు । నీవని భ్రమసినావు । ఎరుక మరపులు లేని బ్రహ్మం । బెరుగగా నీవేయటంచును ॥వి॥

కరుణా । మయుడగు వీరగురుని । కరుణ । వలనను దెలిసికొని । ధరణి శ్రీ యిసగంటి పున్నయ । దాసు దెల్పెడి వర రహస్యము ॥వి॥

3. సావేరి - ఆదితాళము

ప్ర॥ నాగతియేమో - తెలియకయున్నది । ననురక్షింపవదేమి
గురుడా నను రక్షింపవదేమి ॥

ఉ॥ నీగతియేమో - తెలియగదలచిన । నిన్ను నీవుగనవేరా ।
శిష్యా । నిన్ను నీవుగనవేరా ॥

నన్ను నేనుగను - మార్గంబేమో । నా కెరిగింపవదేమి ।
గురుడా । నా కెరిగింపవదేమి ॥

ఉన్నపరబ్రహ్మంబును గని లే । కున్న జగము విడవేరా ।
శిష్యా । (లే) కున్న జగము విడవేరా ॥

విరివిగదోచెడి - యీ జగమెల్ల । విడిపోయెడి విధమేమి
గురుడా విడిపోయెడి విధమేమి ॥

ఎరుకను కలలో - వచ్చిన యీజగ । మెరుక వదల విడిపోరా శిష్యా । యెరుకవదల విడిపోరా ॥

ఎరుకను వదలే తెరవడియేమో। యెరుక పరచవేమయ్యా గురుడా । యెరుక పరచవేమయ్యా ॥

పరిపూర్ణంబను । భావంబెరిగిన । పారిపోవురా యెరుక శిష్యా । పారిపోవురా యెరుక ॥

పరిపూర్ణంబన – నెటువలెనుండునో। బాగుగ నా కెరిగించు గురుడా । బాగుగా నా కెరిగించు ॥

తరుగక పెరుగక । విరుగక కరుగక । మరుగు యొఱుగులేకుండు! శిష్యా । మరుగు యొఱుగులేకుండు ॥

తరుగని పెరుగని – పరిపూర్ణంబే । తత్వజ్ఞుడు గమనించె గురుడా । (యే) తత్వజ్ఞుడు గమనించె ॥

ధరణిని శ్రీ యినగంటి పున్నయ।దాసుడు గమనించెను రా శిష్యా (పున్నయ) దాసుడు గమనించెను రా ॥

పున్నయ దాసున – కును పరిపూర్ణము । బోధించినవారెవరో గురుడా । బోధించినవారెవరో ॥

చెన్నలరెడు వీరయగురు వర్యుడు। చెలువుగబోధించెను రా శిష్యా । చెలువుగ బోధించెను రా ।నా॥

## ౪. దర్బారు - అటతాళము

ఎంచ సాంఖ్యము చాలదమ్మా। గురుని పొంచి కాంచగలేమోకొమ్మా॥ పంచ కర్మేంద్రియ – పంచతన్మాత్రల–పంచజ్ఞానేంద్రియ – పంచప్రాణంబుల। నంచితాంతఃకరణబృందము-నంటుకొనుచు ప్రపంచ విషయము । పెంచుటయు ద్రుంచుటయె జ్ఞాతృ – గాంచలేదా గురునిసన్నిధి ॥ఎం॥

తారక మెరుగదోయమ్మా। గురుని । దర్శించగాలేమే కొమ్మా ॥తా॥

ఆరుకమలములను - నలరు సహస్రార। సారసమునను వి - స్తారవేగముగాను । చేరి రెండువందల పద। హారువందలమార్గ హంస। కేరిదళముల దిరుగుగాని। చేరలేదా గురునిసన్నిధి ॥౧॥

అమనస్కమందదోయమ్మా। గురుని। అవలోకించగలేమే కొమ్మా ॥

అమర రాక్షస సిద్ధ-యక్షగంధర్వలో। కములరవిచంద్ర న-క్షత్రమండలముల। క్రమముగా గుత్తిరుగుచును తన - క్రమ మదేమో తెలియనేరని। క్రమముచేయెరుకైనయాత్మ। కాంచ లేదా గురునిసన్నిధి ॥౨॥

పరిపూర్ణ భావమోయమ్మా। గురుని। పరిశీలనముజేయు కొమ్మా॥ ఎరుక మరపులులేక - పరిపూర్ణుడైయున్న। వర వీరయార్య స - ద్గురు సార్వభౌముడు। ధరణి శ్రీ యినగంటి పున్నయ - దాసునకు బోధించి తెల్పిన। పరమ గోప్యంబెరిగి యుండిన - నరయవచ్చును గురునిసన్నిధి ॥౩॥

౫. ముఖారి - అటతాళము

ఏదిరా। బ్రహ్మంబేదిరా। పెడవాదములతో। కాదురా। లాభము లేదురా ॥

సూది మోపను సందులేకను। చోద్యముగ వ్యాపించె శూన్యము। రాదుపోదెన్నడును బయలని - రచ్చకెక్కి వచించి నంతనె ॥ఏ॥

లేనిమాయ ప్రధానమందున - నీన్నెలు వసియించియున్నది। జ్ఞానమాయమనస్కమందున। తాను తానని దెలిసినంతనె ॥ఏ॥

పంచభూతము లావరించి ప్ర। పంచమై గాన్పించుచున్నది। కాంచి జీవంబై వరలు సాం - ఖ్యంబు పరిశీలించినంతనే ॥ఏ॥

వాయువులు పదిగల్గి తనువు యు - పాయముగ జరియించు చున్నది। మాయగారడి హంసయోగం - బైన తారక మెరిగి నంతనే ॥ఏ॥

ధరణి శ్రీ యినగంటి పున్నయ। దాసునేలిన వీరగురుని। కరుణచేబయులందు బయలగు - పరపరాత్పరు నెరుగకుండిన ఏ॥

## ౬. వరాళి - జాల్వతాళము

మన్ను నీళ్లు నిప్పు గాలి- మిన్ను లేనినాడు నీవు। నన్ను విడచి వెళ్లియుంటివి రా। ఓ। యెరుకల వారి చిన్నవాడా। యెన్ని నాళ్లకు నిన్ను గంటినిరా ॥మ॥

రాకపోకలు లేకయున్న - రమణీమణినా నన్ను విడువ। నీకు దోచినమాయగాదురా।ఓ। యెరుకలవారి చిన్నవాడా। లేకయున్న నన్ను వీడవురా ॥మ॥

ఘోరమాయల మారియా సం। సారిదాని మాటనమ్మి। దారిబట్టి వెళ్లియుంటివిరా। ఓ। యెరుకలవారి చిన్నవాడా। క్రూరకర్మము జేసియుంటివిరా ॥మ॥

భ్రాంతివిడచి నన్ను జేరే - పద్ధతిగమనించలేక। అంతులేని చింతబడితివిరా। ఓ। యెరుకలవారి చిన్నవాడా। యెంత వింత జరిగియుండెను రా ॥మ॥

మూఁడు యేరుల నట్టనడుమ - జోడుగూడిన హంసనడిగి । జాడదెలియక బేలవైతివిరా । ఓ । యెరుకలవారి చిన్నవాఁడా । చూడచూడ చోద్యమాయెను రా ॥మ॥

రెండుపాముల మధ్యనున్న - కొండచిలువను విషరమడిగి। యుండి లాభము లేకపోయెను రా ।ఓ। యెరుకల వారి చిన్న వాఁడా । యెండమావుల నీరమాయెనురా ॥మ॥

ఆరుమేడలు తిరిగి - అందమౌ బంగారుమేడ । జేరి వెదకి విసిగి యుంటివిరా । ఓ । యెరుకలవారి చిన్నవాఁడా । మారుత్రోవలన్ని గంటివిరా ॥మ॥

ఎన్నిబుట్టిన నెన్నిగిట్టిన - యెన్నటికి చెడకున్న తావున । ఉన్న నన్నుగాన తరమటరా। ఓ । యెరుకలవారి చిన్నవాఁడా। ఉన్న దేది లేనిదేదిరా ॥మ॥

దారి డొంకలేనిచోట - జేరి కాల మెల్లగడుప । సారమేమి లేకపోయెను రా ।ఓ। యెరుకలవారి చిన్నవాఁడా । దారిదెలసి మేలుకొంటివి రా ॥మ॥

ధారుణి యినగంటి పున్నయ్య - దాసునేలిన పాటిబండ్ల। వీరగురుని మాటవింటివిరా ।ఓ। యెరుకలవారి చిన్నవాఁడా । కోరి నన్ను జేరియుంటివిరా ॥మ॥

సారసంబుగ ఫీరోజిఋషీ - శ్వరుని ద్వాదశిమంత్రమంపు। సారమిదిగో షోడశిపిడువరా।ఓ। యెరుకలవారి చిన్నవాఁడా । నోరుమూసి మాయమై పోరా ॥మ॥

సాదనామక్రియ - ఆదితాళము

అచలంబచలంబని బోధించెడి - వచనంబులు విడిపించండీ ।
ఆచలాంతర్భావార్థంబున పర-మాత్మగలడు గమనించండీ ॥అ॥

పుట్టని గిట్టని యచలంబనియెడి - ముచ్చటలను విడిపించండీ । పుట్టుగిట్టులణగించెడి దేవుని - పూజించుట గమనించండీ ॥అ॥

కదలని మెదలని యచలంబనియెడి - కథలెల్లను విడిపించండీ ॥ కదలు మెదలు యెరుకనుబాపెడి కర - కంజసేవ గమనించండీ ॥అ॥

తరుగని పెరుగని యచలం బనియెడి - తత్వంబులు విడిపించండీ । తరుగు పెరుగు మాయను ద్రుంచు పరా - త్పరుని భజన గమనించండీ ॥అ॥

ధర యినగంటి పున్నయ దాసుని - దరిపోసకని విడిపించండీ । వరలెడు పాటిబండ్ల వీరగురు - ద్వాదశి మదిగమనించండీ ॥అ॥

శ్రీ రామచంద్రానుగ్రహ శ్రీ వీరగురు పరబ్రహ్మార్పణమస్తు.

అచల భావము సంపూర్ణము.

శ్రీపున్నయ్య గురుస్వాముల సహోధ్యాయులు



శ్రీ బోళ్ల రామానుజార్య గురుస్వాములు

ఓం

శ్రీ రామచంద్రానుగ్రహ శ్రీ వీరగురుపరబ్రహ్మణే నమః

# బ్రహ్మరహస్యము

## పూజావిధానము

౧. మధ్యమావతి - ఆదితాళము

గురుని పూజించరారే మీరు। పరమాత్ముడౌ శ్రీ। గురుని పూజించరారే మీరు ॥

గురుదయలేకను - దొరుకదు మోక్షము। సరసిజ భవునకు శంకరునకును గరుడధ్వజునకు - ఘన దేవతలకు। వర యోగులకును - పరమమునులకును ॥గు॥

వేదశాస్త్రముల సారముదెలసి। కలహంబులాడే। వాదభేదములు వదలవేసి। ఆదికారణుం - డై యమితుండై। అంతరాత్ముడై। అవికారుండై। నాదబిందు కళ - లకు పరుడయ్యును। నాద బ్రహ్మ - నంద మయుండగు ॥గు॥

ఏడు కోటల దాటవిడచి। ఆ పైన మూడు। మూడుమేడల త్రోవనడచి। ఏడు యేడు పదు - నాల్గు లోకముల। నేకభావమున - నీసడించి కడ। మేడనెక్కి యిక తిరిగిరానియా। మేటిలోకమును పరిపాలించెడి ॥గు॥

సుర పొన్న పూల చెండ్లు దెచ్చి। తళతళలాడు। విరజాజి పూబంతులు దెచ్చి। పరిమళంపు మల్లియలను దెచ్చి। భాసుర

చెంగల్వములను దెచ్చి । సరసిజములు సంపెంగలు దెచ్చి ।
మరువము దవనము మరువక తెచ్చియు ॥గు॥

మేటి సత్తెనపల్లెపురిని । ఫీరోజి గురుని । సూటిదెలసిన వీర
గురుని । కోటిమార్లు సేవించికాంచి బల్ । వాటమైన పర
మార్థరత్నముల । మూటగై కొనిన శ్రీ యినగంటి । పున్నయ
దాసుని బోధలు గై కొని ॥గు॥

౨. ఆనందభైరవి - అటతాళము

ఆనంద మయుడవై - యన్నిలోకములను । పూనిసృష్టించి
యును - పోషించియు । లీనంబు జేసియును - లీలావినోదివై
జ్ఞానాజ్ఞానంబులు-లేని గురురాయా । జయమంగళం నిత్యశుభ
మంగళం । మహోత్సవ మంగళం దిగ్విజయ మంగళం ॥ఆ॥

అండ పిండాండ బ్ర - హ్మాండ భాండమునందు । నిండి
యఖండ రూ- పుండవగుచు । ఖండంబులో జగము - లుండిన
పోయిన । రెండు గుర్తెరుగక - నుండు గురురాయా । జయ
మంగళం నిత్యశుభ మంగళం । మహోత్సవ మంగళం దిగ్వి
జయమంగళం ॥ ఆ ॥

దండిత్రికూటాద్రి - నుండి గన్పడుచుండు । పండువెన్నెల
లోన మండితమై । అండదండయు లేక - నుండి సర్వమునకు ।
నండవై దండవై - యుండు గురు రాయా । జయ మంగళం
నిత్య శుభ మంగళం । మహోత్సవ మంగళం దిగ్విజయ
మంగళం ॥ ఆ ॥

మందారముల యందు - యిందీవరములందు । మంద రాచలమందు - డెందమందు । అందునిం దనరాళ । యెందు జూచిన నీవు । సంశేమి లేకున్న స్వామి గురురాయా । జయ మంగళం నిత్య శుభమంగళం । మాహాత్మ్యవ మంగళం దిగ్వి జయమంగళం ॥ ఆ ॥

భువిని శ్రీ యినగంటి - పునయ్య దాసుని । భవబంధ ములు ద్రుంచి - భక్తిబెంచి । భవనాశములు లేని - పరమా త్మ గనుగొనే । వివరమెరిగించిన - వీర గురు రాయా । జయ మంగళం నిత్య శుభ మంగళం । మాహాత్మ్యవ మంగళం దిగ్విజయ మంగళం ॥ ఆ ॥

(భక్తులయొక్క సంకల్పము ననుసరించి చెప్పంబడినది.)

3. ఆనందభైరవి - అటతాళము

వర రాజయోగ సం - భరితపూర్ణానంద । పరుడైన యుప నిష - ద్బ్రహ్మమునకు । నిరుపమాన విశేష - నిగమాంత వేద్యుడై । చరియించు రంగ రా - జగురూత్తమునకు ॥ జయ మంగళం నిత్యశుభమంగళం । మాహాత్మ్యవ మంగళం దిగ్వి జయమంగళం ॥ వర ॥

వరలు చిట్టెంసెట్టి - వంశాబ్ధి చంద్రుడౌ । వర లక్ష్మణా చార్య - వర్యులకును । వరమార్ధతత్వసం - ప్రాప్తదీక్షానంద । చరుడైన జమిలి శే - షయ్య గురు వరునకు । జయమంగళం నిత్య శుభ మంగళం । మాహాత్మ్యవ మంగళం । దిగ్వి జయ మంగళం ॥ వర ॥

ధరణి సత్తెనపల్లె - ధాముఁడౌ ఫీరోజి । గురు సార్వభౌమేంద్ర - కోవిదునకు । వర పాటిబండ్ల స - ద్వంశీయుడై వెలయు । వర వీరయార్య స - ద్గురు శిఖామణికి ।జయమంగళం నిత్య శుభ మంగళం । మహోత్సవ మంగళం దిగ్విజయ మంగళం ॥ వర ॥

చెన్నలరు సత్య సం - శీలుఁడౌ యనగంటి । పున్నయ్య గురు రాజ - పుంగవునకు । అన్ని లోకంబుల- నన్ని కాలంబుల । నున్న పరమాత్మను - గన్న భక్తులకు । జయమంగళం నిత్యశుభమంగళం । మహోత్సవమంగళం దిగ్విజయమంగళం ॥

## ౪. కీరవాణి - అటతాళము

మంగళము నిర్లోకనిశ్చల - మంగళము పరమేశ్వరా ।
మంగళము నిస్సంగనిర్మల - మంగళము జగదీశ్వరా ॥మం॥
మంగళము నిర్మోహ నిర్గుణ - మంగళము సుగుణాకరా ।
మంగళము నిష్కామ నిర్జర - మంగళము కరుణాకరా ॥మం॥
మంగళము నిర్ద్వంద నిర్భయ - మంగళము శుభదాయకా ।
మంగళము నిశ్చింత నిస్పృహా-మంగళము ఫలదాయకా ॥మం॥
మంగళము నిర్నిద్ర నిస్తుల - మంగళము బుధరంజనా ।
మంగళము నిర్భంగ నిష్కళ - మంగళము రిపుభంజనా॥మం॥
మంగళము పున్నయ్యదాస సు - మానసాంతర ఖేలనా ।
మంగళము శ్రీ వీరగురువర - మంత్ర భావవిచారణా ॥మం॥

## ౫. యదుకులకాంభోజి-అటతాళము

హారతి వీరగురువర్య । మంగళారతి గైకొనవే । కారణా

చార్య । హారతి వీరగురువర్యా ॥ఆరుకమలములపై- యలరు
సహస్రార । సారసమున వెలిగే - సద్గుణధుర్య ॥హా॥
పంచవింశతితత్వ- భావైక్యమైన ప్ర- పంచాతీత విహారా-
భక్తమందారా ॥హా॥
అంత పిండాండ బ్ర - హ్మాండభాండమునందు । నిండి వ్యా
పించిన నిర్మలానందా ॥హా॥
వాసిగ ఫీరోజి - వర దేశికుని జేరి । ధీసాక్షివైయున్న--దివ్య
ప్రకాశా ॥హా॥
భువిని శ్రీ యినగంటి - పున్నయ్య దాసునకు । విశద మొరి
గించిన వేదాంత వేద్యా ॥హా॥

౬. మధ్యమావతి - అటతాళము

లాలి హృద్గాంభీర్య - లాలి గుణధుర్యా । లాలి ధర్మా
చార్య । లాలి గురువర్యా ॥ లా ॥
ఫాలభాగమునందు - పరికించి చూచి । లీలా వినోదంబు-
చాలలేదనుచు । మేలైన ఓంకార మేళంబు వినుచు । చాలి
యున్నస్థలాన - శయనించినావా ॥ లా ॥
పాపకర్మంబనే - పట్టణంబునను । కాపురంబుండుట - కాని
పనియనుచు । చూపురూపులులేని - సొగసైనపురిని । ప్రావు
డాపై నీవు - వసియించినావా ॥ లా ॥
చీకు చింతలు గల్గి - స్థిరములేనట్టి । శాకిలోకంబనే-కార
డవి విడచి । రాకపోకలులేని - రాజ్యంబు గెల్చి । యేకచ
క్రంబుగా - నేలుచున్నావా ॥ లా ॥

భువిని శ్రీ యినగంటి - పున్నయ్యదాసు । భవబంధములూ
ద్రుంచి - భక్తిలతబెంచి । రవిచంద్రులంటంగ-రాని బయ
లందు । శివుడవైయుంటివా ! శ్రీ వీరయార్యా ॥ లా ॥

౭. భూపాలము - అటతాళము

మేలుకొనవే లోకవిషయ - లోలతనుబడి । చెడక యింద్ర
జాల మీాజగమనెడి సూత్రము । చదివి మేల్కొనవే । మనసా ।
మేలుకొనవే ॥ మే ॥

కోటి జన్మములందు జేసిన - క్రూరకర్మ జలధి మునుగక
సూటిగా గురుడోసగు నావను । జూచి మేల్కొనవే । మనసా
మేలుకొనవే ॥ మే ॥

కామమోహములందు గ్రమ్మిన - కారుచీకటిలోన జిక్కక ।
నీమమున గురుడిచ్చు వెల్గున - నిలచి మేల్కొనవే । మనసా ।
మేలుకొనవే ॥ మే ॥

బాధ గురువుల సందు గొందుల - బాటలను బడి విసుగు
జెందక । బోధ గురుని రాజమార్గము - పొంది మేల్కొనవే ॥
మనసా మేలుకొనవే ॥ మే ॥

ఎరుక లోగల చిత్రవిద్యల । నెరుగవలెనను భ్రాంతి జెందక । ఎరు
కలేనిపూర్ణ భావం । బెరిగి మేల్కొనవే । మనసా । మేల్కొనవే ॥ మే ॥

ధరణి! శ్రీ యినగంటి పున్నయ - దాసు బోధలు మరచి
యుండక । గురువరుండౌ వీరయార్యుని । కొలిచి మేల్కొనవే
మనసా । మేలుకొనవే ॥ మే ॥

శ్రీరామచంద్రానుగ్రహ శ్రీవీరగురుపరబ్రహ్మార్పణమస్తు.
పూజావిధానము సంపూర్ణము

"ఓమ్"

శ్రీ రామచంద్రానుగ్రహ శ్రీ వీరగురు పరబ్రహ్మణే నమః

సత్తెనపల్లె పురంబున శ్రీ పులహారి ఫీరోజి ఋషి వర్యుల వారి ఆలయంబున - శ్రీ పాటిబండ్ల వీరయార్య గురువ రేణ్యులవారు బ్రహ్మైక్య మొందిన సమయంబున జెప్పఁబడినది.

రా. ముఖారి - అటతాళము.

శ్రీ వీర గురువర్య - చిద్రూప గుణధుర్య । సేవితామర చర్యా । సదమలాచార్యా । పావనాద్భుత శౌర్యా ॥శ్రీ॥

ఏవిధిజూపి మ - మ్మీక్షితి విడనాడి । నావో తెలియగ రాదు । నళినగర్భునికైన - భావమున యోచించి శార్వరీ- బహుళపంచమి గల్గు దుందుభి ॥ మీవిలాసము జూడరాదని - మేలుగని బ్రహ్మైక్య మొందిన ॥శ్రీ॥

ఆరునెలలకు ముందే - నైక్య మొందెదనని । కోరిభక్తుల జేర్చి । సంగతులుగూర్చి । కోర్కెలన్నియుదీర్చి ॥ ఆషాఢిగా సహ - స్రార పద్మాంతరోం । కార నాదవిహార - మీరీతి యనిదెల్పి - నేరుపున రోజులును ఘడియలు - నిమిషములు వివరించి తుది సం । చార మిదియని యొక్క త్రుటిలో - జగము విడచి ప్రసిద్ధిజెందిన ॥శ్రీ॥

పర దూషణము నీకు - పని లేకుండుటే గాక । యొరులు జేయగనోర్చవు । మన్నించవు । విరసుల నోదార్చవు ॥ వర శాంతమరయ నీ - దరి గొప్ప కాపురము । గురుతరగంభీర -

గుణము సద్భూషణము । కరుణ నీకరమందు నిలయము -
కపటసంచారంబు శూన్యము । గురువరా మీదేహరూపము।
తిరిగి మేమెన్నటికి గాంతుమొ ॥శ్రీ॥

ఎందెందు జూచిన । సందులేకను నిండి । అందు నిందనరా
కను । యెటు దోచకను । డెందమునకు గాకను ॥ బంధ మోక్ష
ములేని - చందముగల బ్రహ్మ । నందము సద్భక్త బృందము
నకు దెల్పు । చందురుండవు నీవు పూర్ణా । నంద మొంది సమా
ధినుంటివి । సందియంబులుదీర్చి మమ్ముల - సాకువా రింకెవరు
తండ్రీ ॥శ్రీ॥

శ్రీ సత్యభామా పు । రీ సదన భద్రాద్రి । వాసప్రసాదా
భ్యాసా । పులహరి ఫీరో - జీ సద్గురోపాస । నా సుధీయుత
మహొల్లా । ల్లాస చిదానంద । భాస పాటిబండ్ల - వంశాంబు
నిధి చంద్ర । భాసురంబగు అప్పికట్ల నివాసుడౌ యినగంటి
పున్నయ । దాసునకు పరమార్థ పథమిడి - వాసిగాంచిన దేశి
కేంద్రా ॥శ్రీ॥

శ్రీ రామచంద్రానుగ్రహ శ్రీ వీరగురు పరబ్రహ్మార్పణమస్తు.



ఓమ్

శ్రీ రామచంద్రానుగ్రహ శ్రీవీరగురుపరబ్రహ్మణేనమః

# జన్మమాహాత్మ్యము

తత్వగానము

---

ఇనగంటి పున్నయ్య చౌదరిచే
రచియింపఁబడియె.

# ఒక మనవి

సోదరీమణులారా!

నా హృదయేశ్వరులగు శ్రీమాన్ ఇనగంటి పున్నయ్య చౌదరి గురుస్వాములవారిచే రచియింపబడిన గ్రంథములలోని సారాంశము.

సీ॥ మహిళామణులకున్న – సహజ సామర్థ్యంబు
మాధవశతకము – బోధపరచె
పడతులకును మంత్ర – పఠనాధికారంబు
బ్రహ్మరహస్యము – బయలుపరచె
స్త్రీలకు మోక్షార్థ – సిద్ధిగల్గుట ముక్తి
కాంతావిలాసము – గానబరచె
లలనల కుపదేశ – ములనొసంగెడిహక్కు
జన్మరాహిత్యము – సఫలపరచె
ధర్మమార్గంబు భువనసుం – దరి వచించె
పుణ్యావర్తనలను జగన్మో – హిని యిడె
నేలదున్నుట రైతుక – న్నీరు దెల్పె
చిత్రవిషయంబులను పూల – చెట్లు బలికె.

ఇట్లు,
శ్రీమతి ఇనగంటి చల్లమాంబ
అప్పికట్ల.

# పీఠిక

మహాశయులారా, ఈగ్రంథమునందలి గేయములలోని యర్థంబులు కఠకేనతైత్తిరీయబృహదారణ్యకోపనిష దనుసర ణీయంబులు, భావంబులు లింగానంత పైంగళ్యవజ్రసూచికోప నిషదానుకూల్యంబులు, సారాంశంబులు, సత్సంప్రదాయ సద్గు రూపదేశాంతర్యంబులు, రచనలు ఛందోభరతసంగీత వేదాంత వ్యాకరణబద్ధంబులు. ఇట్లగుటంజేసి కదాచితుగా కఠినంబులగు చోట్ల శ్రావ్యంబులగునట్లు హ్రస్వంబులు, దీర్ఘంబులు, పరు షంబులు, సరళంబులు, అచ్చులు, హల్లులు, సంధులు, శబ్దం బులు, సమాసంబులు సామాన్య ప్రజా ప్రచారమార్గంబున నడుపంబడినవి. అంతియేకాని క్రమంబెరుంగకయుంగాదు. ఎరుం గుదునను నతిశయంబునను గాదు. నీ, నా, మీ, మా అనుచోట్ల చదువునపుడు స్ఫురించెడి ధ్వనినే ప్రాధాన్యముగా గైకొన వలయుంగాని వ్యత్యస్తభావంబు బొందంవగదు. సుందరాంగి, ముద్దులగుమ్మ, క్రీడ, పొందు మున్నగు పదంబుల యర్థంబులు కేవలశృంగారంబులని తలంచదగదు. అవ్వానిని ప్రకృతికాంత, ముక్తికాంత, మనస్కాంత మొదలగు జ్ఞానవర్ణనలని భావించ నగు ముముక్షువులకు భక్తి, జ్ఞాన, వైరాగ్యముల బెంపొందించు టకై దుష్టత్వమును నిరసించుటలో గానంబడు బరువైన పదం బులు సాధ్యమైనంత మెలకువతో తూచి తూచి వాడినను, తూకములోని కొసరు మొగ్గులవలె మిగిలినవని యోచింపనగు. గురుస్తవములలో లోగడగ్రంథములలోని రామజోగులు, రాజ శేఖరులు అను వెన్కముందు సందర్భంబు లిందు సవరించంబడి

నవి. పూర్వపు మహాదార్యోక్తుల ననుసరించి అర్జునోద్ధవులకు సహాధ్యాయధర్మమును, వేమన శ్రీకరులకు సతీర్థధర్మమును గన్పరచబడినది. ఈ గ్రంథమునందెచ్చటను ఒకవ్యక్తిని, ఒక సంఘమును, ఒకమతమును గురించి యేవిధమైన నిందారోపణము జేసియుండలేదు. ఇయ్యది పూర్ణభావగ్రంథమగుటచేకవి యభిప్రాయం బతిగోప్యంబగుటచే గమనింపక పోవుటచేనైనను మరి యేవిషయమునైనను, ఏమహనీయులకైన నట్టిభావము స్ఫురించెనేని అమ్మహనీయుల కొరకిదియే నాక్షమాపణము. మరియు బహుకాలమునుండి హృదయస్థమగు యీ గ్రంథమును త్వరలో ప్రచారమునకు దెచ్చుటకై నన్ను ప్రోత్సహించిన ఒంగోలుతాలూకా దశరాజుపల్లె గ్రామ మున్సిఫ్‌గారగు శ్రీ గనిపినేని వెంకటసుబ్బయ్యగారి కుమారుడు వెంకటప్పయ్య చౌదరిగారికిని, సదరు తాలూకా లింగంగుంట గ్రామవాస్తవ్యులగు శ్రీ మంగమూరి పిచ్చయ్యగారి కుమారుడు వెంకటేశ్వర్లు చౌదరిగారికిని యీ గ్రంథమును లిఖితరూప మొనర్చుటలోను, ముద్రణాలయమందును అత్యంత సహాయమొనర్చిన బాపట్ల తాలూకా అప్పికట్లశివారు బృందావనం గ్రామ వాస్తవ్యులగు శ్రీ పాలడుగు వీరయ్యగారి కుమారుడు సీతారామాంజనేయులు చౌదరిగారికిని నా ధన్యవాదములు. సర్వేజనా స్సుఖినోభవంతు.

ఇట్లు
కవిరాజ శిరోమణి
శ్రీమాన్ ఇనగంటి పున్నయార్యగురుస్వాములు
గ్రంథకర్త : అప్పికట్ల

# కృతిపతి సవిస్తారము

సీ॥ శ్రీ మన్నవంశాబ్ధి – సోముండు వెంకట
రాయుండు కీర్తి వి – రాజితుండు
అమ్మహామహు ద్వితీ – యాత్మజుం డనఘుండు
బుచ్చయ్యచౌదరి – పూర్ణయశుడు
ఆ ధర్మవిదుని ది – వ్యాగ్రతనూజుండు
వెంకయ్యచౌదరి – విబుధజనుడు
వెంకయార్యవరేణ్యు – ప్రియదత్తపుత్రుండు
రత్తయ్యచౌదరి – రమ్యగుణుడు
రత్తయాభిఖ్యునకు శ్రీ వ – రమ్మ గర్భ
మందు జన్మించె చెంచు రా – మయ్య ఘనుడు
తెలుగు యింగ్లీషు నేర్చిన – ధీరుడితడు
సర్వజన భూషితానంద – సరసహితుడు.

సీ॥ శ్రీ మించిభూమిపై – జన్మించుజయలక్ష్మి
రైసుమిల్లునకు ప్రొ – ప్రైటరితడు
సలలిత శ్రీరామ – చంద్రటాకీసు ప్రొ
ప్రైటరై శోభించు – రసికుడితడు.
బాపట్ల లోగడ – ఫస్ట్లాసు ఆన్రరీ
మేస్ట్రీటు బెంచికి – మెంబరితడు
అలతు హైస్కూలు – హరిజన హాస్టలు
సంఘంపుగౌరవ – సభ్యుడితడు
గ్రామ మున్సిఫు మా అప్పి – కట్లకేతడు
చిన్నతనమున పదవుల – నిన్ని గనిన
చతురుడితడు మదీయ స – త్కృతినిగోర
సమ్మతించితి ఘన సంత – సమ్మునెంది॥

# కృతి సమర్పణము

సీ॥ శ్రీమచ్చెన్నసత్కుల - క్షీరాబ్ధిచంద్రుండు
సుజన హితుండు - యశోధనుండు
రత్తయ్యచౌదరి - ప్రథమసుపుత్రుండు
ధర్మవిదుండు స - త్యవ్రతుండు
ఖ్యాతిగన్న వరమ్మ - గర్భసంజనితుండు
సాధువర్తనుడు ప్ర - శాంతయుతుడు
రమణీయమౌ చెంచు - రామయ్యచౌదరి
నామాంకితుండు వి - నమ్రగుణుడు
పావనంబైన యీ గ్రంథ - పాటవంబు
ఘనతరంబని కృతిని గై - కొనదలంచి
సమ్మతము దెల్ప బుధకోటి - సంతసింప
ఇచ్చితిని జన్మరా - హిత్యకృతిని తనకు.

# కృతిపతి



శ్రీయుత మన్నె చెంచురామయ్యచౌదరిగారు, అప్పికట్ల

క౦. అంకాళమ్మ హృదీశ్వర, అంకిత వరచెంచురామ - యాఖ్యసుధీంద్రా
పంకజ సంభవమాధవ, శంకరు లిడుగాకనీకు - సర్వార్థంబుల్.

# కృతి స్వీకరణము

---

గురువర్యా ! నేను చిన్న వయస్కుడ నైయ్యును, నా పూర్వ పుణ్య విశేషంబున తమవంటి సత్పురుషుల సత్కృతు లందుకొనుట మహాద్భాగ్య మని తలంచి ప్రసంగ వశంబున సంకల్పించినంతమాత్రమున తమరు నాయం దనుగ్రహులురై నాకీ సత్కృతి నొసంగినందున నేనిద్దానిని శ్రద్ధాభక్తులతో స్వీకరించి ధన్యత్వ మొందితిని. కాబట్టి తమకు నాకృతజ్ఞతానేక నమస్కారములు.

ఇట్లు
ఆర్యజనవిధేయుడు
శ్రీయుత మన్నె చెంచురామయ్యచౌదరి
గ్రామమున్సిఫ్, అప్పికట్ల

•

# గ్రంథప్రస్తావన

మత్తకోకిల: చిత్రచిత్ర విలాసభాసిత-శేముషీ ఘనభూషణా
పాత్రపాత్ర విచక్షణాన్విత-భద్రధర్మ పరాయణా
గోత్రధీరసుగోగుసూళ్ళస-గోత్ర మన్నెకులోద్భవా
పౌత్రవర్ధన చెంచురామయ-చౌదరీంద్ర గుణాగ్రణీ.

గీ॥ అమ్మమాంబా సుపుత్రిక - యైచెలంగు
బాపమాంబా పవిత్ర గ - ర్భమునబుట్టి
జన్మధన్యతగన్న వి - శ్వాసమెరిగి
ఆమె పద పద్మములకు బ్ర - ణామమొసగి.

గీ॥ జనకుడై ఇనగంటి ప్ర - శస్తవంశ
సింధుశుభ్రాంశువౌ నర - సింహ చౌద
రీంద్రు పాదద్వయంబు ని - స్తంద్ర భక్తి
సన్నుతించి హృదయంబుజ - స్థలినిజేర్చి.

గీ॥ నిశితవిద్యాప్రదానంబు - నెరపినట్టి
కొండమూడి నరసింహ స - త్కోవిదేంద్రు
చరణ కమలంబులకు నమ - స్కరణ మొసగి
ఆర్యజనబృందమునకు జో - హారొనర్చి.

గీ॥ పరమ గోప్యార్థ పరిపూర్ణ - భావమిడిన
పాటిబండ్ల కులక్షీర - వార్ధిచంద్రు
డైన శ్రీ వీరగురుని ప - దాంబుజములు
స్వాంతమునసుంచి పూజించి - సంస్మరించి.

గీ॥ అస్తినాస్తిద్వయముగాని - అచలపూర్ణ
లింగమూర్తిని లేని బ - లీయమైన
ఎరుకవిడికొల్చి జన్మరా - హిత్యసరణి
విశదపరచెద వినులస - ద్విమల చరిత.

ఓమ్
శ్రీ సద్గురు పరబ్రహ్మణే నమః

# జన్మమాహాత్మ్యము

## తత్త్వములు

### 1. కీరవాణి రాగము అటతాళము

మెరుగు బంగరు చాయమించిన – మేను గల్గిన చిన్నది।
అరమరలు లేనట్టి గురువుల – దరిని నిలబడి యున్నది ॥మె॥
కలువరేకులవంటి చక్కని – కనులు గల్గిన చిన్నది।
తెలిసి తెలియని తర్కవాదుల – కలవిగాకయే యున్నది॥ మె॥
పూర్ణ చంద్రుని మిగిలియుండిన – మోము గల్గిన చిన్నది।
పూర్ణ భావజ్ఞులను గన్గొని – పొంగి పొరలుచు నున్నది ॥మె॥
అలరు మంకెన పూలవంటి – అధరములుగల చిన్నది।
కలహవాదపు కొంటెకాయల – పలుకరించక యున్నది ॥మె॥
కారు చీమల బారువలె నూ – గారు గల్గిన చిన్నది।
దారి దొలిగిన భక్తిహీనుల – జారవిడిచెద నన్నది ॥మె॥
కోరి డైమన్ చుక్కలద్దిన చీరెగట్టిన చిన్నది।
దారిదొలగని భక్తవరులను – జేరబిలచెదనన్నది ॥మె॥
రంగుగా యిస్పేటు మొగ్గల – రవిక దొడిగిన చిన్నది।
అంగ లింగ విధంబు దెలియని – సంగతులు విన నన్నది ॥మె॥
హంగు రంగులు గల కళావరు – ఉంగరంబుల చిన్నది।
అంగ లింగ విధంబు దెలిసిన – సంగతులు వినుచున్నది ॥మె॥

అరఘు చుక్కలు జేర్చికూర్చిన - హారములుగల చిన్నది।
ధరణి (శ్రీ) యినగంటి పున్నయ - దాసువశమైయున్నది ॥మో॥
సురుచిరంబుగ అగరు దినుసులు - కురులకద్దిన చిన్నది।
వరలు పాటిబండ్ల వీరయ - గురుని సొమ్మైయున్నది ॥మో॥

2. సింహేంద్ర మధ్యమ రాగము - ఏకతాళము

బంగరు సొమ్ములు దాచిన పెట్టెలు-దొంగకుజూపుటతప్పండీ।
దొంగగుణములకు సద్గురుసన్నిధి-త్రోవలుజూపుట తప్పండీ॥బం
చెప్పులు గొరికెడి కుక్కకు బెల్లపు - చెరకులు బెట్టుటతప్పండీ।
తప్పుడుగుణముల కుపదేశంబులు-జెప్పుట మిక్కిలితప్పండి ॥బం॥
కనకపు సింహాసన భాగంబున - శునకము నుంచుట తప్పండీ।
మననము జేయనిమందగుణములకు-మంత్రములిచ్చుటతప్పండీ॥క
గాడిద ఒంటికి కమ్మని కస్తురి - గంధము బూయుట తప్పండీ
పాడు గుణములకు గురుతత్వంబుల-పాటలుజెప్పుటతప్పండీ॥బం
కొండగొర్రె మెడలో పుష్పంబుల - దండలువేయుట తప్పండీ
మొండిగుణములకు గురుమర్మంబులు-బోధించుటబలెతప్పండీ
త్రాటి చెట్టుకడనిలబడి పాలను - త్రాగుచుండుటలు తప్పండీ
మోటుగుణములకుభూచరిఖేచరి-ముద్రలుజూపుటతప్పండి॥బం
సాగరమును మధురము జేయుటకై-చక్కెర గల్పుట తప్పండీ
త్యాగమెరుంగనిలోభగుణములకు-ధర్మము దెల్పుటతప్పండీ॥
కోయిల పిల్ల వసందుగ కూతలు - గూయుట కాకికి తప్పండీ।
మాయలమారికిలాడిగుణములకు-న్యాయముజెప్పుటతప్పండీ॥
కటిక రాళ్ళపైవరివిత్తనములు - కలియజల్లుటలు తప్పండీ।
మిటమిటలాడే తుటారిగుణముల - కెటుజెప్పిననుతప్పండీ॥బ
ధర యినగంటి పున్నయదాసుని - దరి తర్కించుట తప్పండీ।

వర లెను పాటిబండ్ల వీరగురు - వర్యుని మరచుట తప్పండీ ॥బం॥

3. కీరవాణి రాగము - ఆటతాళము

ఏరిరా సద్గురినితో సరి - వార లెవ్వరో చూడరా ।
ఆరితేరిన వారురా బ్ర - హ్మైక్యమై యున్నారురా ॥ఏ॥
చాటుమాటున వాగుగూబల - మాటలను వినబోరురా ।
వాటమైన సుషుమ్న సాధని - వాసులై యున్నారురా ॥ఏ॥
వదరుబోతు బడాయి పిల్లుల - వాదములు వినబోరురా ।
విదితమైన సహస్ర సారస—వీధిలో నున్నారురా ॥ఏ॥
మంకుబొంకుల రంకుజంకల - ఒంకలను వినబోరురా ।
జంకు గొంకులులేక నిర్విష-యాంకులై యున్నారురా ॥ఏ॥
దొంగయుక్తుల స్వాతికొంగల - సంగతులు వినబోరురా ।
అంగ లింగ విధంబుగని ని - స్సంగులై యున్నారురా ॥ఏ॥
కీలుదెలియని కొండగొర్రెల- కేకలను వినబోరురా ।
ఓలలాడుచు ముక్తికాంతా - లోలురై యున్నారురా ॥ఏ॥
గోప్య మెరుగని నీటికాకుల- గోలలను వినబోరురా ।
గోప్యమైన రహస్యకారణ - గురువులై యున్నారురా ॥ఏ॥
చిక్కుటక్కుల వెర్రికోతుల - చేష్టలను వినబోరురా ।
చక్కగా పరమార్థ మరసిన-స్వాములై యున్నారురా ॥ఏ॥
నీలివార్తల పిచ్చికుక్కల - నిందలను వినబోరురా ।
నీల తోయద మధ్య నిలచిన - నిపుణులై యున్నారురా ॥ఏ॥
హెచ్చుగచ్చుల అడవి పందుల - ముచ్చటలు వినబోరురా ।
సచ్చిదానంద స్వరూప వి - చారులై యున్నారురా ॥ఏ॥
పెంకె కూతల కాకుదున్నల - బింకములు వినబోరురా ।
శంకవీడిన జ్ఞానులై అక - లంకులై యున్నారురా ॥ఏ॥

శేలికూకల మకురు గాడ్దెల – మేకములు వినబోరురా ।
ఫాలనేత్రము దెరచి నిత్యము – మేలుకొనియున్నారురా ॥ప॥
భాసురంబగు వీరగురుని వి – లాస మిది సుఖదంబురా ।
వాసిగా యినగంటి పున్నయ–దాసునకు వినెదంబురా ॥ప॥

4. హిందూస్థాని ముఖారి రాగము - చాపు తాళము

ఎందుకురా యీ గందరగోళము ।
యిందేమిలేదురా – సందేహమేలరా
మాయలమారిది – మాయాప్రపంచము ।
న్యాయములేదుర – సాయము గాదుర ॥ఎం॥
నీటిబుగ్గలవలె – దీటుగసంచరించి । బూటకమైపోవు –
నాటకరంగముర ॥ ఎం ॥
మెరుపుతీగెలరీతి మెరసి దుర్భ్రిమలఁగొల్పి ।
త్వరలోన అంతరించు – తైతక్క బొమ్మలాట ॥ఎం॥
ఎండమావుల దోచు – చుండెడి జలముభంగి ।
ఉండియుండనిజగము – ఉంఓిలాభములేదు ॥ఎం॥
కలలోదోచినదెల్ల – కల్లలౌచందమున ।
మెలకువలోగూడ – తెలిసితె వ్యర్థములె ॥ ఎం ॥
వరవీరయార్యగురుని – కరుణాకటాక్షమొంది
ఎరుకమరువుల నెరిగి – మరచితె పూర్ణమౌను ॥ ఎం ॥
భువిని శ్రీయినగంటి – పున్నయ్యదాసుని
వివరమడిగితె నీకు – వివరించి బోధించు ॥ ఎం ॥

5. ఝంఝూటిరాగము - మిశ్రగతి అటాదితాళములు

అవనిజన్మించిన – అలివేణులారా ।
భవసాగరముదాటే – పట్టుదెలియండీ ॥అ॥

యిలమీద పశుపక్షి – మృగకీటకములు ॥
తలచనేతలచవు – దైవ సంగతులు ॥అ॥
నరజన్మములుమీకు – దొరికినందులకు ।
మరలజన్మలులేని – మరుగుదెలియుండి ॥అ॥
పుట్టలోపలచెదలు – బుట్టుచందమున ।
పుట్టిలాభములేదు – ముక్తిబొందకను ।అ॥
మీతల్లిదండ్రులు – మిముగనిరిగాని ।
ఏతీరొ కడతేరే – దెరిగించలేరు ॥అ॥
ధనధాన్యసంపదలు – వెనువెంటరావు
తనువులు నిలువవు – ధ్వంసమైపోవు ॥అ॥
ఎందుకీమోహంబు – ఇంద్రజాలంబు ।
గందరగోళంబు – కాకిలోకంబు ॥అ॥
హంగురంగులపొంగు – ఆత్మకెందులకు ।
సింగార మెందుకు – బంకారమునకు ॥అ॥
అనరాని వినరాని – కనరానిచోట ।
తనను తానెరుగక – జనియించె మెరుక ॥అ॥
ఎరుకతోవచ్చిన – యీజగములెల్ల ।
ఎరుకతో నశియించు – మెరుపులవలెను ॥అ।
పరిపూర్ణమునుదెల్పి – ఎరుకవిడదీసే ।
గురుడేసద్గురుడని – గురితించవలెను ॥అ॥
గురుడు దైవంబనే – గురినిల్పిమదిని ।
గురు సేవజేయండి – విరిబోణులార ॥అ॥
తను మన ధనంబులను – తగధారబోసి ।
అనుమానములువీడి – అర్పించవలెను ॥అ॥

గురునిందజేసిన - గురునింద వినిన ।
పరలోకము మీకు - స్థిరము కాపురము ॥అ॥
గురుని యానతిలేక - గురుమర్మములను ।
పరుల కెరిగించితే - బాధించుయముడు ॥అ॥
విరివిగా శాస్త్రములు - విప్పిచదివినను ।
గురునిదయ లేకున్న - దొరుకదుముక్తి ॥అ॥
గురుకటాక్షముగల్గు - గురుభక్తవరులు ।
తిరిగి యికరారోరు - మరల జన్మలకు ॥అ॥
భువిని శ్రీయినగంటి - పున్నయ్యదాసు ।
వివరించె పరిపూర్ణ - వేదాంతబోధ ॥అ॥
రహి పాటిబండ్ల వీ - రయ దేశికేంద్రు ।
సహజబ్రహ్మానంద - సామ్రాజ్యబోధ ॥అ॥
చరణంబులిరువది - సొంతంబుబాడి ॥
పరమార్థ సామ్రాజ్య - పట్నమేలండి ॥అ॥

6. శంకరాభరణరాగము - అటతాళము

చింతింపఫలమేమి । లేదురతండ్రీ । శ్రీగురునిసన్నిధి । జేరరాతండ్రీ
ఎంతకాలము నీకీ । బంధముతండ్రీ ।
అంతులేనివిషయ । బృందముతండ్రీ ॥చిం॥
తనువుమట్టికుండ । తెలియరతండ్రీ ।
కనగలిగితిన్నగ - తిరుగర తండ్రీ
తనమాట నీకేమి । జెప్పదుతండ్రీ
క్షణములో నమ్మించి । చనిపోవుతండ్రీ ॥చిం॥
తల్లిపిల్లలు మాయ । కల్లెర తండ్రీ ।
అల్లుండ్రు కోడండ్రు । అంతేర తండ్రీ ।

చెల్లెండ్రు మరదండ్రు । గజటక్కు తండ్రీ ।
ఇల్లు వాకిలి గూడ । ఉళ్లక్కి తండ్రీ ॥చిం॥
ఎన్ని నేర్చిన మోక్ష । మున్నదా తండ్రీ ।
నిన్ను నీవెరుగక । లేదుర తండ్రీ ।
ఉన్నవా డొక్కడె । దేవుడు తండ్రీ ।
సున్న యీ జగమెల్ల । చూడర తండ్రీ ।చిం॥
ఘోర సంసారములో । దూరకు తండ్రీ ।
కారుచీకటి కోన । కనిపెట్టు తండ్రీ ।
ఆరబోసిన పండు । వెన్నెల తండ్రీ ।
వీరగురు మోక్ష సా । మ్రాజ్యము తండ్రీ ॥చిం॥
యినగంటి పున్నయ్య । దాసుడు తండ్రీ ।
వినిపించె ఈబోధ । విడువకు తండ్రీ ।
మనసార యీమాట । మదినుంచి తండ్రీ ।
జనన మరణములేని । జాడగను తండ్రీ ॥చిం॥

## 7. భారవ రాగము - ఆదితాళము

ఏమి జన్మమె బాల । గమనించి చూచితె – దివాలా ॥ఏ॥
కామ మోహముల శూల । కడి – కండల క్రొవ్వుల మాల
తామస రాజస గుణముల గోల –
తత్వము దెలిసితె మొత్తము డీలా ॥ఏ॥
మదమత్సరములగల్ల । మటు – మాంసపు బూటకపు గుల్లా ॥మ॥
ఇది నవరంధ్రపు జల్ల । యెని – మిది జానల గోగు బుల్ల।
వదరెడి పదరెడి బెదరెడిబిళ్ళ– వాస్తవమెరిగి తెసర్వముకల్లా॥ఏ॥
క్రోధలోభములమూట । బహు-ఘోర రోగము లకోటా ॥క్రో॥
వాద భేదముల బాట । కడు – వలపుల బంధపు పేట।

నీదినాదియనుకలహపుపీట-నిజముగజూచితెసకలముర్ఘూటా॥ఎ
ఎవ రెటు వాగుచునున్న । భయ-మేటికిగురుదయయున్నా ॥ఎ॥
వివరము గనుగొనియున్న । వర-వీరయగురువరు గన్న ।
భువి యినగంటి పున్నయ దాసున్ని-
బోధలు విన్న జన్మము నున్నా ॥ఏ॥

8. ముఖారి రాగము - అటతాళము

ఈజన్మమింకేల । ఇకసాగనంపండి ।
నాజన్మకడతేరే - నానోము దీరే ॥ఈ॥
ఏజాముననుహంస - ఎగిరిలేచిపోవు ।
ఆజాడ మీకెవరి । కంతుబట్టబోదు ॥ఈ॥
ధనధాన్యములు నన్ను-దాచిపెట్టగలేవు ।
ఘనమైన గృహములు । కాపాడలేవు ॥ధ॥
కనకంపు రాసులు - నను నిల్పుకొనలేవు ।
మనియున్న మట్టుకే - మావారు మీవారు ॥ఈ॥
అక్క చెల్లెలుగాని - అన్నదమ్ములుగాని ।
ఒక్కరైనను నన్ను - వుంచగలుదురా ॥అ॥
ఎక్కడి సతి సుతులు-ఎక్కడి బంధువులు ।
టక్కు టమారమీ - టక్కరిలోకము ॥ఈ॥
ఎన్నాళ్లు బ్రతికిన-ఎన్నడో యొకనాడు ।
ఉన్నదిగద చావు - ఉర్వీజనమునకు ॥ఎ॥
కన్నీళ్ళుగార్చిన - గలుగులాభమేమి ।
కన్నులు తెగవాచి - కష్టమొందుటెగాని ॥ఈ॥
కండక్రొవ్వులుగల్గి - యుండి చీకుచుండే ।
పండుటాకువంటి - పాడుదేహములో ॥క॥

ఉండితాళగలేక – ఉపదేశమును బొంది ।
దండి గురు దయచేత – ధన్యత్వమొందితి ॥ఈ॥
భువిని శ్రీయినగంటి – పున్నయ్య దాసుని ।
వివరమడిగి తెలిసి – వెతలుమానండీ ॥భు॥
భవరహితుడౌ పాటి – బ్రాడ్లవీరయగురుని । తవిలి ప్రార్థన జేసి–
తరియించి మరిరండీ ॥ఈ॥

9. నీలాంబరి రాగము – అటతాళము

గురుసార్వభౌమేంద్ర – సురుచిరసద్గుణసాంద్ర ।
పరతత్వార్థ విచార – పరమాత్మగురుచంద్ర ॥గు॥
నీమహిమ దెలియుటకు – మేమెంతవారముర ।
తామసగుణములు విడువని – పామరులము పసివారము ॥గు॥
చూపు రూపుల భ్రమసె – పాపాత్ములము మేము
కాపాడి రక్షించు – కారణ గురురాయ ॥గు॥
ఏమి శాశ్వతము లే – దీ మాయలోకములో
స్వామీ నీ ఒక్కడవె – శాశ్వతమై యున్నావు ॥గు॥
మటుమాయ సంసార మమకారమున జిక్కి ।
కిటుకు దెలియక మేము – కృషియించుచున్నాము ॥గు॥
ఈ జన్మము లింకేల – యిక చాలు పరమేశ ।
మాజన్మలు కడ తేర్చి – మము బ్రోవు జగదీశ ॥గు॥
భువిని శ్రీ యినగంటి – పున్నయ్య దాసునకు ।
శివజీవైక్యంబొసగిన – శ్రీ వీరగురుదేవ ॥గు॥

10. కీరవాణి రాగము – అటతాళము

శ్రీకరంబుగ గురుని సేవ – జేయుటెందుకె అక్కరో ।
రాక పోకలులేని మోక్ష–రాజ్యపదవికి చెల్లెలా ॥శ్రీ॥

మోక్ష రాజ్య పదవిజెందే - మూలమేమే అక్కరో ।
దీక్షబూని దుష్టగుణముల - దీసివేయుమె చెల్లెలా ॥ శ్రీ॥
దుష్ట గుణముల దీసివేసే - త్రోవయేదే అక్కరో ।
స్పష్టముగ గురుడిచ్చు మంత్రము- స్మరణజేయుమె చెల్లెలా ॥శ్రీ॥
గురుని మంత్రము స్మరణజేసే - గురుతు యేదే అక్కరో ।
స్థిరముగా పద్మాసనంబున - చెలగియుండుమె చెల్లెలా ॥శ్రీ॥
చెలగు పద్మాసనమునందు వి - శేషమేమే అక్కరో ।
తలను సమముగ నిలిపిచూచితె - వెలుగు గన్పడుచెల్లెలా ॥శ్రీ॥
వెలుగుజూచిన గలుగబోయెడి - ఫలమదేమే అక్కరో ।
పలురకంబుల నలరు ముద్రల - పట్టుదొరకునె చెల్లెలా ॥శ్రీ॥
ముద్రలందున సారమేమో - ముచ్చటించవె అక్కరో ।
అద్రి శిఖరము పైకి జేరే - అనుభవంబె చెల్లెలా ॥శ్రీ॥
శిఖరమెక్కే జాడయేమో - చెప్పవేమే అక్కరో ।
సుఖముగా కుండలిని లేపే - సూత్రమే ఓ చెల్లెలా ॥శ్రీ॥
కుండలిని లేపుటకు నాకెటు - గుండెజాలునె అక్కరో ।
దండిగా గురు మంత్రయోగము - దారిజూపునె చెల్లెలా ॥శ్రీ॥
యోగమందున సిద్ధిబొందే - యుక్తియేదే అక్కరో ।
భోగభాగ్యంబులు నిజంబని - పొంగకుండుమె చెల్లెలా ॥శ్రీ॥
పొంగకుండిన నాకు గలిగే - పుణ్యమేమే అక్కరో ।
గంగ యమున సరస్వతులను - గడచిపోవుమె చెల్లెలా ॥శ్రీ॥
కడచిపోయిన దానినేమి - కానుపించునే అక్కరో ।
కడువిచిత్రపు తళుకు బెళుకుల - కాంతిగాదమె చెల్లెలా ॥శ్రీ॥
కాంతిపైన దిరుగుచుండే - బంతియేమే అక్కరో ।
బంతియె పదినూర్ల రేకుల - పద్మమే ఓ చెల్లెలా ॥శ్రీ॥

మేటిపద్మముపైన మెరసే - మెరుపుయేమే అక్కరో।
సూటియైన బ్రహ్మరంధ్రపు-సూక్ష్మభాగమె చెల్లెలా ॥శ్రీ॥
వింతసూక్ష్మపు బిలముపైగః-వింతయేమే అక్కరో ।
భ్రాంతిలేని పండువెన్నెల-బయలుగాదటె చెల్లెలా ॥శ్రీ॥
పండువెన్నెల బయలులోపల - భావమేమే అక్కరో ।
నిండుబయలున బట్టబయలై - నిలచియున్నదె చెల్లెలా ॥శ్రీ॥
నిలచియుండిన బయలుజూచే - తెలివియేదే అక్కరో ।
తెలివి తెలివిని దెలిసినంమున - తెలివిలేదే చెల్లెలా ॥శ్రీ॥
తెలివిదెలిసి తెలివిసనుసిన - ఫలితమేమే అక్కరో ।
ఇలనుపుట్టుట గిట్టుటలు యిక - తొలగిపోవునె చెల్లెలా ॥శ్రీ॥
తొలిగిపోయిన చావుపుటకలు - దెలియుటెట్లె అక్కరో ।
కలనుగాంచి మేలుకొన్న - కరణిగాదటె చెల్లెలా ॥శ్రీ॥
వాటముగ మేల్గొన్నజ్ఞానుల - వార్తయేమే అక్కరో ।
నూటికొక్కడు కోటికొక్కడు-మాటనమ్మవె చెల్లెలా ॥శ్రీ॥
మాటలోపల మర్మమెరిగితె - మాటలేదే మక్కరో ।
మాటలాడక నోరుమూసి - మరలిపోవే చెల్లెలా ॥శ్రీ॥
అవును యిదిగనలేని నరులే - మామరోగద అక్కరో ।
ఎవరికర్మమువారిది నీ - కెందుకాకథ చెల్లెలా ॥శ్రీ॥
నిజముదెలియగ ప్రశ్న జేసితి - నెపముదేమె అక్కరో ।
నిజముబల్కిన నిమిషముననే - నిష్టురంబగు చెల్లెలా ॥శ్రీ॥
హరిహరి గమనించితిని జగ - మల్లెయున్నది అక్కరో ।
మురిపెముననే మంగళించితి - ముద్దులివ్వవె చెల్లెలా ॥శ్రీ॥
ముద్దులిచ్చితి సిద్ధిబొందితి - ముదముజెందితి అక్కరో ।
రద్దిసేయక గురునిపద సా - మ్రాజ్య మేలవె చెల్లెలా ॥శ్రీ॥

గురునిపద సామ్రాజ్యమునకు – మరుగుపేరే మక్కరో ।
ఎరుక మరుపులు రెండులేని – పరమపూర్ణమె చెల్లెలా ॥ శ్రీ॥
ఇమ్మహిని పూర్ణానుభవమది– ఎంతదుర్లభ మక్కరో ।
కొమ్మలోదవిన పండితులకె– బ్రిమ్మదిరిగెనె చెల్లెలా ॥ శ్రీ॥
ఈరహస్యార్థంబు నీకు – యెవరుదెల్పిరె అక్కరో ।
ధారుణిని యినగంటిపున్నయ – దాసుదెల్పెనె చెల్లెలా ॥ శ్రీ॥
భువిని శ్రీపున్నయ్యదాసున – కెవరుదెల్పిరె అక్కరో ।
వివరముగ శ్రీపాటిబండ్ల – వీరగురుడే చెల్లెలా ॥ శ్రీ॥
వీరయార్యుల కెవరు దెల్పిరి – విశదపరచవె అక్కరో ।
ధీరుడౌ ఫీరోజిబుపిగురు – దేవుడే ఓ చెల్లెలా ॥ శ్రీ॥

11. ముఖారి రాగము – అటతాళము.

ఎందుకే ఈజన్మ – యికవద్దే కొమ్మా ॥ఎందుకే యీజన్మ ॥
మందమతివై సంధి తెలియక– బంధమునబడి కుందుచుంటివి।
సుందరాంగిరో ముందుసద్గతి – జెందగలఫలమందవమ్మా ॥ఎం॥
పగవారికైనను – పనిలేదె కొమ్మా ॥పగవారికైనను॥
అగణితంబగు మోహజలనిధి – దిగి కృశించక కన్ను తెరచి।
చిగురుబోణిరో పరముజేరే–స్థితియదేమోయెరుగవమ్మా ॥ఎం॥
మదిలోన యీమాట–మరువకేకొమ్మా ॥మదిలోనఈమాట॥
మదముమత్సరమణచి పెద్దల –పదములకు బ్రణామిల్లి నిరతము।
మధురవాణిరో విషయబృందము–చిదిపిధూపము వేయవమ్మా॥ఎ॥
పరమార్థమెరుగని – బ్రతుకేల కొమ్మా ॥పరమార్థమెరుగని॥
ధరణి శ్రీ యినగంటి పున్నయ – గురువరుని యుపదేశమంది।
సురుచిరాంగిరో ముక్తిబొందే సూత్రమేదో గాంచవమ్మా॥ఎం॥
శ్రమలులేనిబాట – సరిజూడు కొమ్మా ॥శ్రమలులేనిబాట॥

శమదమంబుల నలరుచుండెడి-చల్లమాంబను వివరమడిగి।
భ్రమరవేణిరో తిరిగిరాని - క్రమమదేదో తెలియవమ్మా ॥ఎం॥

12. బిలహరి రాగము - అట తాళము

ఇదియేమిచిత్రమెకాంతా । నీకు-యెందుకే సంసార చింతా ॥ఇ॥
వదినమరదలు తోడికోడలు - వరుసగల మేనత్తకూతురు।
కదలివెంటరారు వల్ల - కాటి వరకే వచ్చి పోదురు ॥ఇ॥
పతియెవడేసుతుడెవడేబాలా।నీకు-భవబంధములప్రేమగోలా॥ప॥
సతతమును నీరెండు రెక్కలు - చితికిముక్కలు చెక్కలగునటు।
అతుకులతికిన నీకు బొక్కడు-మెతుకువేసెద రేమిలాభము॥ఇ॥
ఎందుకే ఈ బ్రతుకుకొమ్మా।నీకు-ఏమిధైర్యముదోచెనమ్మా ॥ఎం॥
పంది పిల్లి నల్లి బల్లి - కందిరీగ కొంత గొర్రె।
చందమున తిని తిరిగి నిద్ర - జెందిలేచిన నేమి లాభము ॥ఇ॥
ఎన్నాళ్లు ఈ పొంగుచెలియా।నీకు-యిపుడో రేపో చావు తెలియా॥ఎ॥
అన్నదమ్ములు అక్కజెల్లెలుఅ- త్తమామలు ఆడుబిడ్డలు।
ఉన్నమట్టుకు దోచుకొని తిని-నిన్ను ఈడ్తురు రుద్రభూమికి ॥ఇ॥
గురుడే దైవము వినవే సుదతీ।నీకు మరివేరెవ్వరులేరేపడతీ ॥గు॥
ధరణి (శ్రీ) యినగంటి పున్నయ-దాసుని పరమార్థమెరిగితె।
వరలు వీరయ గురువరేణ్యున - కరుణచే తరియించగలవే ॥ఇ॥

13. మోహన రాగము - అట తాళము

అందరికందదుగురుబోధ । అది-అందితెచెందదుగురుబోధ ॥అం॥
వందల కొలదిగ - వరహాలు బోసిన
మంద మానసులకు - పొందశక్యము గాదు ॥అం॥
నాశములేనిది గురుబోధ । బహునమ్మకమైనది గురుబోధ ॥నా॥
కాశికి బోయిన - గంగలో మునిగిన ।

ఆశలుడుగని జనుల – కందశక్యముగాదు ॥అం॥
తెలివి లోపల తెలివిగురుబోధ । అది–
కలిమాయ కందదు గురుబోధ ॥తే॥
కులగోత్రములనెంచి – కలహించుచుండెడి ।
పలుకుల కెన్నటికి – తెలియశక్యముగాదు ॥అం॥
వెలలేని బంగారుగురుబోధ ।
అది తులదూగు సేవకు గురుబోధ ॥తే॥
బలహీన మానవనంబుల చేతగర్వించె ।
తలపుల కెన్నటికి – తలపశక్యముగాదు ॥అం॥
పారంపర్యమునుమ్మి గురుబోధ ।
అది–పట్టాభిషేకము గురుబోధ ॥పా॥
నోరూరుకొనక శివ – నారాయణ యని ।
కోరి యుపదేశించే – వారలశక్యముగాదు ॥అం॥
పదిహేను పదహారు గురుబోధ ।
అది పదిరెంటిపైమాట గురుబోధ ॥ప॥
చదువులు శాస్త్రాలు – సంఖ్యలుస్నానాలు ।
ముదిరినభ్రాంతులకు – కుదుర శక్యముగాదు ॥అం॥
శివజీవలీనము గురుబోధ । అదిశ్రీవీరగురుధనముగురుబోధ ॥శి॥
భువిని (శ్రీ) యినగంటి – పున్నయ్యదాసుడు ।
వివరించి తెల్పితె – విడువశక్యముగాదు ॥అం॥

14 పూరికల్యాణిరాగము – అటతాళము

గురుపాదసేవ జేయుమురా ।
మా – గురుడే బ్రహ్మయువిష్ణు – పరమేశ్వరుడురా
నరుడవై ధరణిపై – తిరుగుచుంటివిగాని ।

పరముజేరె యుక్తి - యెరుగకుంటివిరా ॥గు॥
మరిమరిజెప్పెదవినరా।
మా - గురుని యుపదేశాలు - వరరత్నములురా ॥మ॥
వరహాలు ముత్యాలు - వజ్రాలు మొహారీలు
మరకతాల్ వైక్రాంతాల్ - మాణిక్యములురా ॥గు॥
కులగోత్రములగోల విడరా।
యే - కులమైన గుణముతో - తులదూగునటరా ॥గు॥
బలరూపయౌవనం - బులు శాశ్వతముగావు।
తొలకరి మెరుపుల - వలె చిత్రములురా ॥గు॥
మనసు నిలకడ జేసికొనరా।
మూఢ - జనులుజెప్పేమాట - లను వదలుకొనరా ॥మ॥
ధనధాన్యవస్తువా - హన సంపదలపైన
బెనగొన్న మోహము - పెకలించివలెరా ॥గు॥
ఇల్లువాకిలి బూటకమురా।
నీకు - తల్లిపిల్లలతోడ - తంటాలెందుకురా ॥ఇ॥
కల్ల గారడివాని - కనికట్టువిధమున।
కల్లసంసారము - ఉళ్లక్కిగదరా ॥గు॥
అజపమంత్రము సార్థకమురా।
గురుని - భజియింపకున్నచో బ్రతుకేవ్యర్థమురా ॥అ॥
గుజగుజ జపములు - గొణిగిన ఫలమేమి।
నిజముమాట్లాడితె - నిష్టురమౌరా ॥గు॥
సంద్భ మెఱిగి తిరుగుమురా।
భక్త - మందారుడై వెలయు - మాగురుని గనరా।
ఎందుండి వచ్చితివో ఎందుకేట్లుంటివో।

ముందెందు బోయెదవో - సంధిగనుగొనరా ॥గు॥
నిన్ను నీవు దెలిసికొనరా ।
ఆపై - నున్న దేవుండెవడో - తిన్నగ గనరా ॥సి॥
చెన్నలరు వీరగురు - శిష్యుడౌ యినగంటి
పున్నయ్యదాసుని - బోధ వినవకురా ॥కు॥

15. తోడి రాగము - ఆదితాళము

ఢిల్లీ యెక్స్ప్రెస్సు జూడండయ్యా ।
ఓ మనుజులారా యిది - వెళ్ళితె మళ్ళి రాదండయ్యా ॥ఢి॥
ఢిల్లీ మద్రాసు మధ్య - పల్లెటూళ్ళల్లో నిల్వదు ।
జిల్లా బస్తీలలో నిలచి - త్రుళ్ళిపడి పోతుందయ్యా ॥ఢి॥
ఇరువుగ తొంబైయారంగుళా, లింజనుమరకుతొమ్మిదిరంధ్రము
లరవై యారు మేకులునాటిన-మరుగుస్థలంబులునూటతొమ్మిది।
మురువుగ యిత్తడి రేకులు-శేసు-ముప్పదిమూడుకోట్లశీలలు।
అరయగ అతుకులు తొంబై రెండు -అతికినటఃకము నలభై శేస్లు।
అరసో లెడుపెట్రోలు సోలెడు-కిరసనాలతో బిర బిర బోయ్యె ॥ఢి॥
నూటిగాను మెలిచుట్లు జుట్టుకొని- పేటపేటకునుతళుకులద్దబడి।
కోటిసూర్యుల కాంతిని మించిన - వాటమైన బంగారు తీగెను।
నీటుగానఃర్ఘోడించిలాగితే-నిమిషమునకుపదిహేనుమాగ్లుబల్
ధాటిగ వెడలెడిపొగలోపలనే-బాట జేసికొని బ్రహ్మరంధ్రమును
మీాటిప్రయాణవుగంటగొట్టగామిన్నబద్దలగుకూతలుగూసే।ఢి
వరుసనైదుగురు చిన్నడ్రైవరులు - వారిపైననొక పెద్దడ్రైవరు॥
తరలిపోవుటకుతాళముగైకొనియిరువదినాలుగుగొలుసులువిప్పి
బిరబిరయింజన్ మరనుద్రిప్పి - తిరిగిచూచి దొరగార్డునడుగగా
తరుగుపెరుగులేకుండసిద్ధముగ,సరిపడనాలుగుక్లాసులుముగిసెను

తరలుమనుచు జెండాను బట్టదె౹ ।
వరులు జూచి పయనము సాగించే ॥డి॥
ఆధార స్వాధిష్టానంబులు – అందమైన మణిపూరకంబును ।
నాదముమ్రోగుఅనాహతంబును నాణెముగాగనుపించువిశుద్ధము
ఆదరు వైతగు అజ్ఞా మొదలుగ–ఆరుచక్రముల కదలిక మొదలిడ
పాముగదలి సహస్రారంబనె – బండిచక్రము గిరగిర దిరుగుచు ।
బాడినట్లులంఘించి భగ్గుభగ్–భగభగ భగభగ పర్వడిజేసే ॥డి॥
భూలోకంబనె స్టేషన్విడచి – భువర్లోకమనె స్టేషన్గడచి ।
సువర్లోకమనె స్టేషన్విడచి – మహార్లోకమనె స్టేషన్గడచి ।
జనర్లోకమనె స్టేషన్విడచి – తపోలోకమనె స్టేషన్గడచి ।
సత్యలోకమనె స్టేషన్విడచి – స్టేషన్గడచి స్టేషన్విడచి ।
స్టేషన్గడచి స్టేషన్విడచి – స్టేషన్గడచి ఘోషలుబెట్టే ॥డి॥
బ్రతుకలేముపరమాత్మామేముమతిజెడియెక్కితిమని ప్రజలరువగ
అతలము వితలముసుతలమహాతలమతులితమైనతలాతలమట్టుపై
వితతరసాతల పాతాళంబులు_గతిజెడి ధన్ ధన్ ధన్ మని అదరగ
తతధిం తతధిం తధిమిత ధిమిధిం – ధింతత ధింతత ధిమిత తధిమిధిం
ధిమిధిమిధిమిధిమిధిమిధిమిధిమిధిమి –
ధింధింధింయనిపరుగులు బెట్టే ॥డి॥
తలను వెంట్రుకల తాల్పుసంగతులు –
జలములోపలను మునుగుసంగతులు
తులసిచెట్లకునుపూజసంగతులు _
జిలుగురాళ్లకును మ్రొక్కుసంగతులు
కులగోత్రంబుల గొడవసంగతులు–
కలతలుబెంచు మతాలసంగతులు

పలువిధముల బాషించు మానవుల -
పలుకులు వినకయె తలనువంచుకొని
ఇలపైపుట్టుట గిట్టుటలణగే - స్థలమునుజేరి నిలువదలంచిన ||డి||
దీనిచూపులో చూపుగదండి - దీనిరూపు చిద్రూపుగదండి
దీనిబాణి చింతామణియండి - దీనిఛాయలు బయలౌనుగదండి
భూనభోంతరాళంబులునిండి - పూర్ణంబైన ఎక్స్ప్రెస్ బండి
పూనికతోడను శ్రీయినగంటి - పున్నయదాసుని బోధవినండి
మానక పాటిబండ్ల వీరగురు - ధ్యానముజేసి తరియించండి ||డి||

16. శంకరాభరణ రాగము - అటతాళము

గురుపాదపద్మము గంటిని - కోరిఉపదేశము వింటిని ||గు||
నరజన్మమెత్తియూ - ధరపైబడినందులకు ।
పరమార్థమును దెలిసికొంటినిగురువరేణ్యుని గొల్చుచుంటిని||గు||
గుట్టుమట్టులుమీరి నడువను -మెట్టవేదాంతాలునుడువను ||గు||
వట్టిమాటలుగావు - ఒట్టువేసెదచూడు ।
పట్టినపట్టునే విడువను - పలుగాకికూతలకు దడువను ||గు||
అన్నదమ్ములభ్రాంతిబోయెను-అక్కచెల్లెలుదూరమాయెను||అ
నన్నుగని పెంచిన - నాతల్లిదండ్రులకు ।
అన్ని యాశలు దీరిపోయెను-వన్నెచిన్నెలుమాయమాయెను||గు
నాగురుడు ననుమాయజేసెను-నమ్మించి ఒకపసరుబూసెను||నా||
రాగాలుబాడించి - యోగాలుజూపించి ।
జోగిబైరాగినిజేసెను - చూపురూపులు మార్చి వేసెను ||గు||
పంచరంగుల చీరెగట్టెను - మంచిజల్తరుపైటజుట్టెను ||పం||
మించిన వజ్రాల - మేలైనమొహరీల ।
సంచులపై భ్రమబెట్టెను - మంచిసొమ్ములుకొన్ని బెట్టెను ||గు||

ఐదుమూటలు ముళ్లువేసెను - మైముజేసివిప్పివేసెను ॥ఐ॥
ఐదారు పదమూడు - అతిక్రూరమ్మగముల ।
కైదుబో బంధించివేసెను - జ్ఞానభావము పూర్తిజేసెను ॥గు॥
మూడారు వాకిళ్లుమూసెనుము న్నిద్వారపుతలుపుదీసెను॥మూ॥
కోడెత్రాచునుబట్టి - ఆడించిజోడించి ।
గోడపైకి యెక్కరవేసెను - త్రాచుపాముని చెప్పివేసెను ॥గు॥
ఆరుమేడలు జూపసాగెను - అసలుమేడకుపైకి లాగెను ॥ఆ॥
నారీమణీ నీవీ - దారి రమ్మనుచు బం ।
గారు ఉయ్యాలపైకెగెను - చేరివెన్నెలబైట దాగెను ॥గు॥
నాగురుని లీలావిలాసము - నమ్మికమైన కైలాసము ॥నా॥
ఆగమాంతవిచార - ణానందమగున్నడా ।
నాగురుని కేతకుయీవేషము-నమ్మకుండిన గొప్పదోషము ॥గు॥
ఎవరితో నీకేమిపక్షము - వివరమెరుగని వలపక్షము ॥ఎ॥
భువిని శ్రీయినగంటి - పున్నయ్యదాసుని ।
వివరమడిగి తెదొరుకుమోక్షము-వీరగురుకరుణాకటాక్షము॥గు

17. పున్నాగరాగము - ఆటతాళము

ఇలనుమానవజన్మ - మెత్తినందుకుమోక్షఫలముజెందేత్రోవ
సెలవియ్యవయ్యా - పున్నయార్య - పున్నయార్యా -
సన్నుతచర్యా - పున్నయార్యా ॥ఇ॥
కలవంటి పాపిష్టి - కల్లసంసారము । తలవక సద్గురుని ।
దరిజేరవమ్మా - చల్లమాంబ - చల్లమాంబా -
సద్గుణకదంబా - చల్లమాంబ ॥క॥
గురువరుని దరిజేర - దొరికేలాభంబేమో। కరుణించి విరళించి
యెరిగించవయ్యా - పున్నయార్య................ ॥గు॥

పరమార్థమిడి జనన - మరణ చక్రంబుల । తిరిగే భారంబణచి
దరిజేర్చునమ్మా - చల్లమాంబ.................. ॥ప॥
కాయమస్థిరమని - గాంచి సద్గురుజేరి । కారణమందని ।
కర్మమేమయ్యా - పున్నయార్య.................. ॥కా॥
మాయసంసార సంబంధ మమకారము । మరలించుకొనలేని।
మర్మమోయమ్మా చల్లమాంబ.................. ॥మా॥
స్త్రీశూద్రులకు మోక్ష - శ్రీలక్ష్మిలేదనే । చిత్రవాదములవి।
చిత్రమేమయ్యా - పున్నయార్య.................. ॥స్త్రీ॥
ఆశాపిశాచాగ్ని - అధికమైవిరివిగ । కాసులుగడియించే ।
గాథలోయమ్మా - చల్లమాంబ.................. ॥ఆ॥
రాకపోకలులేని - రాజయోగులజూచి । సాకులువెదకెడి ।
సరణియేమయ్యా - పున్నయార్య.................. ॥రా॥
కాకికోకిలతోడ - కలహించి బాధించే । కారణమనిమదిలో।
గమనించవమ్మా - చల్లమాంబ.................. ॥కా॥
భవరహితుడౌ పాటి - బండ్ల వీరయగురుని । భజియించేభక్తుల।
భాగ్యమేమయ్యా - పున్నయార్య.................. ॥భ॥
భవరహితమౌజీవ - బ్రహ్మైక్యవేదాంత । పరమార్థపరిపూర్ణ।
ఫలభాగ్యమమ్మా - చల్లమాంబ.................. ॥భ॥

18. లతాంగిరాగము - ఆదితాళము

అక్కా మనగురుని జూడవె । మనగురునిమీద -
చక్కనిపాట బాడవే ॥అ॥
ఎక్కడజూచిన వేరొక్కడులేడు మనగురు ।
ఒక్కడె పరమాత్ముడు - టక్కరిమాటగాదు ॥అ॥
అందరి కందదోయమ్మా । మనగురునిబోధ ।

అందితే చెందదోయమ్మా ॥అ॥
ఇందుసూర్యులకర - విందసంభవశివకో ।
విందదేవేంద్రులకై - పొందశక్యముగాదు ॥అ॥
కిటుకులమారివాడమ్మా । కలిమాయతంత్ర-
కిటుకులకందబోడమ్మా
ఎటువంటి కొంటెగాండ్రకు - అటువంటి తంటాగాడు ।
కిటుకెరిగి స్మరణజేసితే - చిటికలో జిక్కేవాడు ॥అ॥
వాదభేదాలు వినడమ్మా । ఇతరులువేసె-
వాదులు లెక్కగొనడమ్మా ॥వా॥
ఏదృష్టి చూచేవారికి - ఆదృష్టేదో చేవాడు ।
సాదృశ్యమరయలేని - సత్యసంపన్నుడమ్మా ॥అ॥
గురుసేవ విడువరాదమ్మా । విడచితే ఘోర-
నరకము గడువబోదమ్మా ॥గు॥
ధరణియినగంటి పున్నయ - దాసుని కీలకమెరిగితే ।
వరవీరయార్యుల కృపచే - తరియించి తిరిగిరాము ॥అ॥

19. మధ్యమావతిరాగము-ఆదితాళము (భక్తజన సంకల్పము)

పాదములివ్వవు - వాదమగురుడా । పెద - వాదమగురుడా
ఏదీ మాకికదిక్కు-ఎరిగించుగురుడా । నీ-వెరిగించుగురుడా ॥పా
నీశాంతమదియేమొ -నిజరాజయోగీ । ఓ-నిజరాజయోగీ ।
ఆశాపాశములేని - ఆనందభోగీ । బ్ర - హ్మానందభోగీ ॥పా॥
కామక్రోధములేని _ ఘనరాజయోగీ । చి - ద్ఘనరాజయోగీ ।
నీమనిష్ఠలులేని - నిర్మలభోగీ । కడు - నిర్మలభోగీ ॥పా॥ ।
లోభమోహములేని - లోకవైరాగీ । ఇహ - లోకవైరాగీ
లాభనష్టములేని - లాంఛనభోగీ । వర - లాంఛనభోగీ ॥పా॥

మదమత్సరము లేని-మహానీయమూ_ర్తి।ఓ-మహానీయమూ_ర్తి।
అదరు బెదరులు లేని అతిశాంతమూర్తి।అ-త్యతిశాంతమూ_ర్తి॥పా
వాద భేదము లేని - వరరాజయోగీ । ఓ - వరరాజయోగీ ।
ఖేద మోదము లేని - కీర్తిసంభోగీ । స - త్కీర్తిసంభోగీ ॥పా॥
ఎవరెన్ని వాగిన - యేమోవినబోవు । అవి-యేమోవినబోవు ।
భవనాశములు లేని-ప్రభుడవైనావు । మా-ప్రభుడవైనావు ॥పా॥
చూపు రూపులు లేని-చోటనున్నావు । అ-చ్చోటనున్నావు ।
మా పూర్వపుణ్యాన-మాకందినావు। ఇటు-మాకందినావు॥పా।
భువిని శ్రీయినగంటి-పున్నయ్యగురుడా। ఓ-పున్నయ్యగురుడా।
భవబంధములు ద్రుంచి - పాలించుగురుడా ।
మము - పాలించుగురుడా ॥పా॥
శ్రీ చల్లమాంబామణి - హృదయాబ్జభృంగా ।
స - ద్హృదయాబ్జభృంగా ।
వాచామగోచర - పరమశుభాంగ । స-త్పరమశుభాంగా ।పా॥

20. వరాళిరాగము - ఆదితాళము

ఏమి జన్మమండీ । లాభం । బేమిలేదు పొండీ గురు ।
స్వామినిదలంచండి । మోక్ష - స్థానము జేరండీ ॥ఏ॥
కామము చేతను కన్నగానకయె। జననీజనకులు_పెనుగులాడగను
శుక్లశోణితము - నూటిగగలిసి । నీరుబుగ్గవలె-నిలచినపిమ్మట।
తలయెముకలువిస్తారముగలిగి।సర్వాంగంబులు సమముగ నేర్పడ।
తొమ్మిదితూట్లు - తొలచినపిమ్మట । చిక్కగర్భమున-చీకటి
కోనలో।మలమూత్రంబులు-చెలగిభుజించుచు।తొలిప్రారబ్ధము
దలచికృసించుచు । తొమ్మిది పదినెల - లిమ్ముగ గడువగ
ఇలమీదనుబడి - గిలగిలయేడ్చును ॥ఏ॥

పురిటిమంచమున - పొరలితపించుచు । ఆకలిదప్పుల నలమ
టించుచును । మాటలు దెలియక - మరిమరి గుటకను । పోకిరి
తనమున - పోకబెట్టుచును । తప్పటడుగులిడి - తరచు గూలుచు।
గడపల పైబడి - గాయములొందుచు । అరుగుల పైబడి - బొరు
గులు వేయుచు । రాళ్ల పైబడి - రక్తము గ్రక్కుచు। అల్లిబిల్లి
గల్లంతులు సలుపుచు - చిల్లర మల్లర - చేష్టలు జేయుచు । చిన్న
బిడ్డడు - శ్లేష్మరోగముల । చింపరవందర జెంది-గ్రుంకించుచును ॥ఏ॥
ఐదుస్తంభములు-అచ్చనగాయలు । గుడిగుడికుంచాల్ - కుందు
గుంటులును। చిరుచిరుపట్టెలు-చీట్లపేకలును వామనగుంటలు బలి
చెడుగుళ్లు దాగిలిమూతలు-దండాకోరులు। పిల్లిమొలకలు-బిల్లం
గోళ్లు। కాళ్ళగజ్జలు-కంకణంబులు । వేగుచుక్కలు-వెలగకంట్లు।
మామిడిమొగ్గలు-మల్లెపీరెలు-లింగులిటుకులు-బొంగరంబులు
ఆటలుఆడి - అల్లరిజేసి। తంపులుబెట్టి - తగవులుదెచ్చుచు ॥ఏ॥
అందము చందము - చందన గంధము । సందులగొందుల -
సందడినకలలు । అత్తరుపన్నీ - రగరు దినుసులును । మెత్తని
పరుపులు - మిరి మిరి చూపులు । లోభము మోహాసు -
లాభమునష్టము । రాగము కామము - భోగము ద్వేషము।
ఆరాటంబులు - పోరాటంబులు । పోకులు జోకులు - చీకులు
చింతలు। మదమత్సరములు-మనసునదగిలి । అదరుచు బెదరుచు-
వదరుచు పదరుచు । తిండిదినుటకే- తీరికలేక । బాజాబందీ-
భారంబాను ।ఏ॥
వందలకొలదిగ-వాతరోగములు మెండుగజేరిన మేహారోగములు
భారంబైతగు-పైత్యరోగములు। ఆస్తికిమించిన అప్పులబాధలు।
ఆలిమగని పో-ట్లాటవిరోధాల్ । పిల్లలచావులు-తల్లులదెవహాల్।

కాళ్ళుగదలవు-కనులకు మసక। చేతులుగదలవు-చెవులకు చెవుడు
వళ్లువణంకును - పళ్లూడిపోవును । మలమూత్రంబులు -మంచ
ములో బడు । మతి జెడిలోనికి - మెతుకులు బోవు । మలమల
మాడును - మరణము జెందును ॥ఏ॥
చెలగిఅబద్ధము-జెప్పుటమాని।చోరత్వంబులు-జూచుటమాని।
జారత్వంబులు-సలుపుటమాని।సాధులతోడను-వాదముమాని
తెలిసియు తెలియని-పలుకులుమాని ।
తగవులు బెంచెడు-తర్కముమాని ।
భువియినగంటి-వున్నయదాసుని ।సంగతులడిగి-సందియముడిగి
భాసుర పాటి-బండ్లపీరగురు । మంత్ర రాజమును-స్మరియించండి।
రూఢిగానుపీ-రోజిబుపీశ్వరు । ధ్యానము జేసి-తరియించండి ॥ఏ॥

21. శంకరాభరణము - అటతాళము

ఏయూరమ్మ మీ దేయూరు ।
గురు-రాయునిసన్నిధి మాయూరు ॥ఏ॥
పుట్టుగిట్టుదుమాయూరు ।
పాప-పుణ్యంబులంటదుమాయూరు ॥ఏ॥
రోగాలులేనిదిమాయూరు ।
రాజ-యోగార్థభావంబుమాయూరు ॥ఏ॥
కర్మంబులెరుగదు మాయూరు ।
నిత్య-నిర్మలతేజంబుమాయూరు ॥ఏ॥
మోసంబు జేయదుమాయూరు ।
బంధ-మోక్షములకందదు మాయూరు ॥ఏ॥
కులగోత్రములు లేని మాయూరు ।
భక్త-కోటికి నిలయంబు మాయూరు ॥ఏ॥

జారచోరులులేని మాయూరు ।
నెర-జాణకు కాపురము మాయూరు ॥వ॥
దీనజనపోషణము మాయూరు
సత్య-దివ్యసంభాషణము మాయూరు ॥వ॥
పరపురుషులకుతల్లి మాయూరు ।
చూడ-పరకాంతలకు తండ్రిమాయూరు ॥వ॥
పున్నయ్యదాసునకు మాయూరు ।
పరిపూర్ణ రత్నాకరము మాయూరు ॥వ॥
వెన్నెలను వెలిగించు మాయూరు ।
వర-వీరగురుమందిరము మాయూరు ॥వ॥
వేదాంతపాఠంబు మాయూరు ।
అలరు వీరో జపీఠంబు మాయూరు ॥వ॥
చిదచిద్విలాసంబు మాయూరు ।
జమిలి-క్షేమగురువాసంబు మాయూరు ॥వ॥
సూక్ష్మబిలాంతరము మాయూరు ।
దనరు- లక్ష్మణార్యనిగ్రహము మాయూరు ॥వ॥
లింగాంగభంగంబు మాయూరు ।
చెలగు-రంగరాజాలయము మాయూరు ॥వ॥
ఉపమానరహితంబు మాయూరు ।
వెలయు-ఉపనిషద్బ్రహ్మంబు మాయూరు ॥వ॥
ఆద్యంతభద్రంబు మాయూరు ।
శ్రీ-అప్పికట్లపురంబు మాయూరు ॥వ॥

22. మోహనరాగము - ఆదితాళము

శ్రీగురునాథా-చిన్మయమోదా। ఆగమవాదా-ఆనందబోధా॥శ్రీ॥

ఎల్లలోకంబు-ఇంద్రజాలంబు।కల్లామంత్రంబు-కపటతంత్రంబు॥శ్రీ।
దరిదోచలేదు-దారిగనరాదు ।
మరుగుపీడలేదు-మాయవిడిపోదు ॥శ్రీ॥
సోహంబులన్న-శ్రుతులెన్నివిన్న ।
మోహంబులున్న - మోక్షంబుసున్న ॥శ్రీ॥
భువియినగంటి - పున్నయ్యదాసు ।
వివరించి తెల్పె - వీరగురునాథా ॥శ్రీ॥

23 ఫీలురాగము - అటతాళము

కొమ్మా ముద్దులగుమ్మా - కుందనపుబొమ్మా ।
అమ్మా నీయూరుపేరడిగితినమ్మా ॥కొ॥
నాయూరునాపేరు - నన్నడుగనేల ।
నాయూరునేనెరుగ - నన్ను నేనెరుగ ॥కొ॥
చావుపుటకలులేవు - సౌఖ్యములులేవు ।
భావింపసంసార - బాధలేలేవు ॥కొ॥
కులగోత్రములులేవు - గుణములులేవు ।
కలవరింతలులేవు - మెలకువలెలేవు ॥కొ॥
ఆదిమధ్యములేదు - అంతంబులేదు ।
వాదభేదములేదు - సాధనమెలేదు ॥కొ॥
పంచముద్రలుబట్టె - పట్టునేనెరుగ ।
సంచిత ప్రారబ్ధ - సంచయమెరుగ ॥కొ॥
పంచెవన్నెలచిలుక - పంజరమెరుగ ।
పంచరంగులుగల - పటమునేనెరుగ ॥కొ॥
మూడారువాకిళ్లు - మూసినేనెరుగ ।
జోడుబాయనిహంస - జాడనేనెరుగ ॥కొ॥

అరుమేడలు దిరిగే - వారినేనెఱుగ ।
మేరుశిఖరంబెక్కి - తీరునేనెఱుగ ॥కో॥
భువిని శ్రీ యినగంటి - పున్నయ్యదాసు ।
వివరమందున్నట్టి - వెలదినోయమ్మా ॥కో॥
భవరహితుడౌ వాటి - బండ్లపిరగురు ।
సువిచారమందున్న - సుదతినోయమ్మా ॥కో॥

24. దేవగాంధారిరాగము - జంపెతాళము

సుందరాంగి నీ పొందునాకేల ।
నేను - బంధమోక్షములేని - ప్రభుడనెబాలా ॥సుం॥
రూపురేఖా విలాసములేల ।
నేను - తాపముజెందని - ధన్యుడనెబాలా ॥సుం॥
తళుకు బెళుకులతో కులికెదవేల ।
నేను - వలపువాంఛలులేని - వరదుడనెబాలా ॥సుం॥
నీటువయ్యారముల సొగసులేల ।
నేను - కోటిసూర్యులకాంతి - దాటితినెబాలా ॥సుం॥
నీ చమకు నీ ఝూకులేల ।
నేను - వాచామగోచరని - వాసుడనెబాలా ॥సుం॥
ఆరుమేడలకు బిలచెదవేల ।
నేను - మేరుశిఖరముపైకి - జేరితినెబాలా ॥సుం॥
నీతినిలకడలులేని పనులేల ।
నేను - నిత్యనిర్మలుడనై - నిలచితినెబాలా ॥సుం॥
నన్నునమ్మించి చెరచితివిచాలా
నేను - తిన్నగగురైరిగి - తిరిగితినెబాలా ॥సుం॥
ఏమొయిదివరకు నీ మాయలీల ।

నేను – యికమీదపొరబడను – ఎరుగవెబాలా ॥సుం॥
కనులకన్నీరు గార్చెదవేల ।
ఇన – గంటిపున్నయదాసు – కడతేర్చుబాలా ॥సుం॥
పాపమీరీతి వెదజెందుటేల ।
పాటి – బండ్ల వీరయగురుని – భజియించుబాలా ॥సుం॥
చేతులార జేసికొంటివేల ।
తిరిగి – సేవించుపీరోజి – శ్రీ గురునిబాలా ॥సుం॥

25 శంకరాభరణరాగము – ఆటతాలము

మాయసంసారమునుదాటు ఉ – పాయమేమిర తమ్ముడా
ఏయుపాయముచేతనో నా – కేమిదెలియునె అక్కరో ॥మా॥
తెలియకుండిన జన్మమెత్తిన – ఫలమదేమిరతమ్ముడా ।
ఫలమొగిలమోరెండుదెలియక, బ్రతుకుచుంటినెఅక్కరో॥ మా
కుక్కనక్కలుబ్రతుకలేదా – యెక్కువేమిరతమ్ముడా ।
తక్కువెక్కువలేమిటో అవి – నొక్కిచెప్పవెఅక్కరో ॥మా॥
తిండినిద్రలు భయరతులు ఒక – తీరెగదరా తమ్ముడా ।
ఉండినవి యీనాల్గు అందరి – కొక్కతీరుగ అక్కరో ॥మా॥
జ్ఞానసంపాదనము మానవ – జన్మకెక్కువ తమ్ముడా ।
జ్ఞానమనగానేమిటో నా – కానతివ్వవె అక్కరో ॥మా॥
రాకపోకలులేక జన్మము – రద్దుసేయుటతమ్ముడా ।
రాకపోకలులేని మర్మము – నాకుదెల్పవెఅక్కరో ॥మా॥
తననుతాగుర్తించి మోక్ష – స్థానమందుట తమ్ముడా ।
తననుతాగుర్తించగల సా – ధనమదేమో అక్కరో ॥మా॥
శుద్ధమైనబుద్ధియనెడి – అద్దమేగదతమ్ముడా ।
బుద్ధిశుద్ధముజేయగల్గిన – వద్ధతేమేఅక్కరో ॥మా॥

మదము లెనిమిది అణచివేసే-మార్గమరయరతమ్ముడా ।
మదపుశేనుగగుంపులవియెటు-మరలిపోవునె అక్కరో ॥మా॥
వ్యసనముల నేడింటిగూల్చే-విషయమెరుగర తమ్ముడా ।
అసదృశంబగు జలధులవినా-కలవిగావే అక్కరో ॥మా॥
అరుగురుశత్రువులబట్టీ-హతము జేయరతమ్ముడా ।
ఘోరరాక్షసబృందమదినే-గొట్టజాలనె అక్కరో ॥మా॥
భ్రాంతులైదిటి నణచివేసే-పద్ధతెరుగర తమ్ముడా ।
వింతదూసర తీగెలవి నా-కంతుదెలియవె అక్కరో ॥మా॥
దుఃఖములనాల్గింటిగూల్చే-త్రోవదెలియరతమ్ముడా ।
దుఃఖములగూర్చుటకు నాకెటు-త్రోవదొరుకునెఅక్కరో ॥మా॥
ఈషణంబులుమూడుద్రుంచే-యిరువుదెలియరా తమ్ముడా
ఈషణంబులు ద్రుంచుటకు నే-నెంతవాడనె అక్కరో ॥మా॥
ఎన్ని జెప్పిన తెలియదంటివి-ఏమిసేయుదు తమ్ముడా ।
ఉన్న వాస్తవమేమిదాయక-విన్నవించితి అక్కరో ॥మా॥
నీదుప్రారబ్ధమునకునే-నేమిసేయుదు తమ్ముడా ।
వదిజేసిన నీదెభారము-ఆదరించవె అక్కరో ॥మా॥
అచలపూర్ణ సుబోధయిదిగో-అనుభవించర తమ్ముడా ।
వచనరచనల కందదది నా-వశముగాదె అక్కరో ॥మా॥
సారమౌ అమనస్కమిదిగో-ఆరగించర తమ్ముడా ।
తారుమారుగనున్నదది నా - తరముగాదే అక్కరో ॥మా॥
అలరుసాంఖ్యవిచారమిదిగో-అందుకొనరా తమ్ముడా ।
పలురకంబుల భావమదినా-కలవిగాదే అక్కరో ॥మా॥
తారకామృత సారమిదిగో-జూరుకొనరా తమ్ముడా ।
దారిడొంకలులేనిదదినా-తరముగాదె అక్కరో ॥మా॥

కోరిసద్గురు నాశ్రయించితె దారిచూపుకును తమ్ముడా ।
ఏదినాకటువంటిగురువులు-యెరుకపరచవె అక్కరో ॥మా॥
ధారుణినియినగంటిపున్నయ-దాసునడుగర తమ్ముడా ।
నోరుపాయిలేని నేనెటు - పారినడుగుదు అక్కరో ॥మా॥
వీరగురుని కటాక్షముండిన-వివరమబ్బును తమ్ముడా ।
భారముంచి భజించెదనునా-ప్రాప్తమాపయి అక్కరో॥మా॥

26 సావేరిరాగము - అటతాళము

ఇదియేమి గొప్పతనమండీ !
మదిని-పదిలముగయోచించి-బదులుజెప్పండీ ॥ఇ॥
బదులుజెప్పెదమని - ఎదుగుబొదుగుగదెల్పి ।
అదరించిబెదరించి - వదరకండీ ।
పదిమందిపెద్దలు - భళిరెసెబాసని ।
మదిసంతసింపంగ - మాటలాడండీ ॥ఇ॥
పచ్చివేరుసెనగ - పప్పుభక్షించితె ।
వచ్చేలాభంబేమొ - నచ్చజెప్పండీ ।
హెచ్చుగ పొలములలో - జొచ్చితెగదిన తోక ।
కుచ్చునక్కలకెల్ల - కుదిరినదాబుద్ధి॥ఇ॥
చప్పిడిదిగమ్రింగి - ఉప్పుగారముపులుసు ।
తప్పింపఫలమేమొ - చెప్పరండీ ।
ఉప్పుగారముపులుసు - ఎప్పుడెరుగని అడవి ।
దుప్పులకు కడతేరే - త్రోవదొరికినదా ॥ఇ॥
తెల్లపంచదార - నల్లబర్రెపాలు ।
కొల్లగమ్రింగితె - గుణమేమండీ ।
నల్లగండుచీమ - బొల్లిదున్నకుర్ర ।

మళ్ళి జన్మలు లేని – మార్గమరసినవా ॥శ్రీ॥
అన్నంబువర్జించి – అరటిపండ్లుదింటె ।
ఉన్నలాభంబేమొ – ఉపముజెప్పండీ ।
ఎన్నిపండ్లయినను – యెగురవేసిమ్రింగి !
తన్నుకొనెకోతులకు – ఫరియింపుగలదా ॥శ్రీ॥
ఆరోగ్యమంటెవిని – యూరకుందురుముక్తి ।
దారికంటేపెద్ద – లూరుకొనరు ।
ఈరీతిమనపూర్వు – లెవరైనాజేసిరా ।
నేరుపుతోమనమే యివి _ నేర్చుకొన్నామా ॥శ్రీ॥
భువిని శ్రీ యినగంటి – పున్నయదాసుడు ।
వివరించితెల్పెడి – విధముజెప్పండీ ।
భవరహితుడౌపాటి – బాండ్లవీరయగురుని ।
శివజీవైక్యంబెరిగే – స్థితినిగాంచండీ ॥శ్రీ॥

27 నాదనామక్రియరాగము - అటతాలము

నీవెవరవో నీకు నిజముతెలియకముందే! దేవునిదర్శింతువటరా!
ఓ వెర్రిజీవుడా–సావధానంబుగా!భావించినినునీవుగనరా ॥నీ॥
జననమరణములేని – మనసురూపములేని ।
ఘనుడునీకెటుగానబడురా ।
నినునీవుగనుగొన్న–తనకుతానేవచ్చి ।
కనుపించుయిదినమ్మికొనరా ॥నీ॥
శుకశౌనకవ్యాస–సూతవాల్మీకులే! ప్రకటవికటంబైరిగదరా!
తకతకలగకవికలదర్శ–నంబబ్బునా!తత్వంబుశోధించుకొనరా॥నీ॥
పరమాత్ముడున్నాడో–మరియు లేకున్నాడో ।
యెరుగనేయెరుగవుగదా ।

హరిహరీ పాపపు-ణ్యములు రెండెరుగని।అర్థంబువ్యర్థమే గదరా॥సీ
నరజన్మమికనీకు-దొరుకునో దొరుకదో ।
త్వరజేసికొనిమేలుకొనరా ।
పరమగోప్యంబైన-పరమాత్మతత్వంబు ।
పరమహంసలవలనగనరా ॥సీ॥
భువినిశ్రీయినగంటి-వున్నయ్యదాసుని-వివరమడిగితెలిసికొనరా
వివరమడిగితెలిసి-వీరగురుమహిమచే ।
భవహరునిదర్శించుకొనరా ॥సీ॥

## 28 కందార్థములు - పంచరత్నములు

1 నరులారవినుడివినుడీ।నరజన్మము లెత్తిమనమునారాయణుడౌ।పరమాత్మునరయనేరక।పరిపరిదుఃఖములమునిగిబాధపడు టేలా మోక్షముజెందేబాటగనమేల। హరిహరబ్రంహేంద్ర-సురసిద్ధ సాధ్యకి।న్నరయక్షగంధర్వ వరలకందగరాని । పరమపదమిది తెలియుటకు మన ।తరముగాదిక గురునిజేరక ।శరణు శరణని-గురునిసన్నిధి । మరుగుజొచ్చి తరించలేక । బాధపడుటేలా-మోక్షముజెందే-బాటగనమేలా ॥

2 గురుడనగాబ్రంహ్మసుమీ। గురుడనగావిష్ణుమూర్తి-గురుడు శివుండున్ । గురుడు పరబ్రంహ్మము మరి ।గురునకు సాటెవరు లేరు-గురినిల్పిచూడ । సామాన్యులు-యెరుగరీజాడ।పరమార్థ మదియెంతో-పరమ రహస్యము।దొరుకదు కనలేని - నరులకు నిజముగ। పరమపావనమైన సద్గురు । కరుణకై పడిపంచగాచి । నిరతమునుగురుసేవజేసే।నరులకనుభవమౌనుసుమ్మీ।గురినిల్పి చూడ-సామాన్యులు-యెరుగరీజాడ॥

3. మనకంటె ముందు వారలు । చనిపోయిరి కోట్లకొలది-జనులు ధరిత్రిన్ । మనయెదుటనెంద రెందరో । చనిపోవుచున్నమాట-సత్యమేగాదా । మనకునుచావు-నిత్యమేగాదా । కనుక నే కుక్క-న-క్కల చందమునమనము।తినితిరిగి నిద్రించి-దినములు గడుపక । మునుపు యెచ్చట నున్నవారమో ॥ పుడమికెందుకు వచ్చినారమో। యెనసిముందెటుబోవువారమో । యెరుగకుండిన వ్యర్థమాట । సత్యమేగాదా-మనకునుచావు-నిత్యమేగాదా॥

4. దేవుడు కనబడకుండెను । గావుననున్నాడో లేడో-కనుగొనవలెనా । దేవుడు లేకుండినచో । ఏవిధమున జగములెల్ల -సృష్టిగాబడెను । స్త్రీపురుషుల వ్యష్టిగాబడెను । దేవాది దేవుడే-దేవుడు నిర్గుణుడు । గావున కనబడడు - కర్మజీవులకెపుడు - ఏవిధంబున జూడవలెనో । యెటుల ధ్యానము జేయవలెనో । సావధానముగాగలదు గురు సార్వభౌముని మహిమచేత । సృష్టిగాబడెను-స్త్రీపురుషుల-వ్యష్టిగాబడెను॥

5. గురుసంప్రదాయకుండై -గురుపీఠాధ్యక్షుడైన-కోవిధవరుడౌ గురువరునిసహజకీలక । మెరిగిన సద్భక్తులకును-యిక జన్మలేదు । అటుగాకున్న-నిదియులవిగాదు - వరలెడు శ్రీపాటి-బండ్ల వీరయ గురుని।చరణారవిందసంజనితామృతముగ్రోలి।ధరణిశ్రీయినగంటి పున్నయ । దాసుడొసగిన పంచరత్నము । లెరుక మరుపులు లేని చెరగున - స్థిరముగా ముడివేసికొన్న। యిక జన్మలేదు_అటుగాకున్న - నిదియులవిగాదు॥

## 29. కందార్థములు - నవరత్నములు

1. జనులార మీరు దేవుని । గనజాలక లేడటంచు-కర్మకులో నై అనుమానించెద రేటికి। వినుడిక దెల్పెదను మీకు-విశదంబుగాను

దేవునిజూడ-వివరింతునేను। కనకంబుతోజేయు-కంకెలుకాసులు
ఘనమైన ఒడ్డాణాల్ గాజులుగొలుసులు ।
మనమునను యోచించి పూర్వపు
కనకమునుమరచినవిధంబున । తనవిలాసంబౌప్రపంచము
గనుచుదేవునిమరచినారు । విశదంబుగాను-
దేవునిజూడ వివరింతునేను॥
2. ఏడీదేవుడగన్పడ । డేడీచూపింపుడనిన-నెటుజూపనగున్
చూడదలంచినవారలు।గాఢంబౌయుక్తిచేత-గమనించవలెను
పరిశోధనము-గావించవలెను।చూడనేరకయున్న లేడేమొగానిఆ
జాడదెలిసితెయున్న - వాడుసర్వమునిండె ।
గూఢమైయున్నందునను యే
నాడుగూడ నిజస్వరూపము।చూడకయె గ్రహణంపుచంద్రుని
జూచిరాహువునెరిగినట్లు_గమనించవలెను॥
పరిశోధనము-గావించవలెను॥
3. తనకై తానెప్రపంచము।
జనియించినదేమొయనుచు _ సకలవిధములన్
మనసారగయోచించిన।తనకైతావచ్చునట్టి-ధర్మంబులేదు
గారడివానిమర్మంబుగాదు ।
కనుగొన్నమన్ను ని-ళ్లునునిప్పుమారుతము
ఘనమాయాకాశము.క్రమముగజనియించె ।
వినగనాకసమునగశబ్దం
బనియునిశ్శబ్దబుబ్రహ్మం।బనియు వేదముదెల్పశబ్దము
తనకుతానైవచ్చునట్టిధర్మంబులేదు-గారడివాని-మర్మంబుగాదు
4. ఎన్నియుగంబులకైనను।కనులకగపడడదేమి-కారణమనినన్

కన్నులకగపడుసర్వము ।
సున్నగనశియించుచుండు-చూచుచుండగనే
స్థిరమైనట్లుతోచుచుండగనే ।
ఎన్నడైననుమలిన-మున్నఅద్దమునందు
తిన్నగముఖకాంతి-దెలియశక్యంబౌనె।ఉన్నదుర్గుణజాలములువి
చ్ఛిన్నమైవైరాగ్యయుతమై।తిన్ననైనసుబుద్ధివలన ప్ర
సన్నమౌ పరమాత్మరూపము ।
చూచుచుండగనే-స్థిరమైనట్లు-తోచుచుండగనే॥
5. ఎప్పుడు దేవుడుగలడని।చెప్పినవాక్యంబెగాక_చెప్పిరివిబుధుల్
ఎప్పుడొపవేళనో।తప్పక తానుండడనిరి-ధర్మబోధనచే
హాస్యాస్పదమౌ_కర్మసాధనచే। ఎప్పుడఖండమై-ఏకమైనిత్యమై
గొప్పకొంచములనక-గుణవిలక్షణుడగుచు ।
ఒప్పుచున్నపరాత్పరుని తా
మెప్పటికి గనలేక లేడని-చెప్పుచుండెడిమందమతులకు ।
తప్పకయె తానుండడనిరి ।
ధర్మబోధనచే-హాస్యాస్పదమౌ-కర్మసాధనచే॥
6. కనులకుగనపడుబాహ్యము।
గనినంతపరాత్పరుండు-గానంబడునా
కనబడడుజ్ఞానమనియెడి ఘనమగుసాధనము లేక -కల్ల మాటలకు
అల్లీబిల్లీ-పిల్లలాటలకు।మనసున వెలలేని-మంత్రాలు తంత్రాలు
గొణుగుచుయెదురుగ-గూర్చుండిచూచిన ।
అణగినువ్వుల-యందు నూనెయు
పెనగిచెరకున పంచదారయు।మునిగిపాలను నెయ్యివచ్చునె
ముఖ్యమౌ సాధనము లేక।కల్ల మాటలకు-అల్లిబిల్లి-పిల్లలాటలకు॥

7 దేవుడు లేడనిమీరలు।గావింపగబోవునట్టి-ఘనశౌర్యబున్
భావంబలరగ దెల్పిన।ఆవిధమునుజూచిఆర్యు-లానందించెదరు
కావలెనన్న-అభినందించెదరు।
ఏవిధంబుననైన-యీప్రపంచమునుండి
సావధానంబుగ-సాగిపోవుటకొరకే।జీవులందరు వేచియుండిరి
గావునను తరియించుటెట్లో।ఆ విధంబును జూపనేరక-
దేవుడే లేడనినయెడ।
ట్లానందించెదరు-కావలెనన్న-అభినందించెదరు॥

8. కష్టము నిష్ఠురము మీయిష్టమెగానిందు దేవు-డే లేకున్నన్
సృష్టికి మూలముజెప్పుడి। స్పష్టంబుగ జెప్పలేరు-సందేహమేలా
పనిలేదా మీ కెందుకీ గోలా।
ఇష్టాగోష్ఠిగమీకై - యింకొక్క విధముగ
దృష్టాంతమొసగిసందేహంబుదీర్చెద।సృష్టితనకై తానెవచ్చె యి
కెవ్వడా దేవుండటన్నను। స్పష్టముగ వేదాంతశాస్త్రము
సకల జగము పరాత్పరుండనె।
సందేహమేలా-పనిలేదా మీ-కెందుకీగోలా॥

9. పరమాత్ముండు లేడనియెడి।కొరతనుదీర్చితిని గాన-గురుజన
హితులై।సురుచిరమతులై స్థిరముగ।తరించెడి కవచమిదిగో-
ధరియించుకొనుడీ।పలుమారిదియే-స్మరియించుకొనుడీ।వరలెడు
శ్రీపాటి-బండ్ల వీరయగురుని।చరణారవింద సం-జనితామృతము
గ్రోలి। ధరణి శ్రీ యినగంటి పున్నయ। దాసు డనుభవమెరిగి
కూర్చిన। సరసమౌ నవరత్నమాల।దొరికెనని శృంగారముగను।
ధరియించుకొనుడి-పలుమారిదియే-స్మరియించుకొనుడి॥

30. వరాళిరాగము-అటతాళము

రాజ యోగానంద భోగీ ।
మోక్ష - రాజ్యాధికార సంతోషసంభోగీ ॥రా॥
వేద వేదాంతంబులో యీా ।
నీకు - విహితగురుబోధ సిద్ధాంతంబులోయీా ॥రా॥
మఠములు మందిరములోయీా ।
నీకు - మాయలంటని హృదయమందిరములోయీా ॥రా॥
కాషాయ వస్త్రంబులోయీా ।
నీకు - గాఢనిద్రను దెలిపే శస్త్రంబులోయీా ॥రా॥
వెలిబూది ధారణమోయీా ।
నీకు - వెలుగులను వెలిగించే కారణమోయీా ॥రా॥
రుద్రాక్ష మాలికలోయీా ।
నీకు - క్షుద్రవిషయములణచే మూలికలోయీా ॥రా॥
దండ కమండలములోయీా ।
నీకు - దండి సూర్యాగ్ని శశిమండలములోయీా ॥రా॥
యోగదండ విశేషమోయీా ।
నీకు - రోగములంటని గురుశేషమోయీా । ॥రా॥
మరిజింక చర్మంబులోయీా ।
నీకు - పరమార్థమునుదెల్పే మర్మంబులోయీా ॥రా॥
సిద్ధపద్మాసనము లోయీా ।
నీకు - బుద్ధి చెదరని ఘోర శాసనములోయీా ॥రా॥
పత్ర పుష్పాక్షతలోయీా ।
నీకు - పాపపుణ్యముల వివక్షతలోయీా ॥రా॥
కర్పూరాగరుగంధమోయీా ।

నీకు - కామక్రోధలోభ నిర్బంధమోయీ ॥రా॥
ధూపదీపాంబరములోయీ ।
నీకు - ఓపికగల నిరాడంబరములోయీ ॥రా॥
నారికేళ ఫలాబులోయీ ।
నీకు - కోరికలీడేరే సఫలంబులోయీ
తాంబూల దక్షిణలోయీ ।
నీకు - ధైర్యసాహసశాంత రక్షణలోయీ ॥రా॥
నిత్యనివేదనలోయీ । నీకు-సత్యజ్ఞానాంతసాధనలోయీ ॥రా॥
మంత్రపుష్ప నియోగమోయీ ।
నీకు - మన్మథబాధా పరిత్యాగమోయీ ॥రా॥
హారతీ మంగళములోయీ ।
నీకు - అండపిండాజాండాద్యంగుళములోయీ ॥రా॥
ఘంటాపాత్రోద్ధరణలోయీ ।
నీకు - ఒంటరిగ చరియించే ఆచరణలోయీ ॥రా॥
తీర్థప్రసాదంబులోయీ ।
నీకు - సార్థకమైన గురుపాదంబులోయీ ॥రా॥
పంచాక్షరీమంత్రమోయీ ।
నీకు - సంచితకర్మభంజన యంత్రమోయీ । ॥రా॥
అష్టాక్షరీ జపములోయీ ।
నీకు - కష్టసుఖములకోర్వగల ఉపములోయీ ॥రా॥
హంసరహస్యార్థమోయీ ।
నీకు - సంసారబంధ సంహారార్థమోయీ ॥రా॥
ఖేచరభూచరములోయీ ।
నీకు - సూచకవాచామగోచరములోయీ ॥రా॥

షణ్ముఖమధ్యంబులోయీ ।
నీకు - సచ్చిదానందసారధ్యంబులోయీ ॥రా॥
శాంభవీచిన్ముద్రలోయీ ।
నీకు - శంభువిష్ణు బ్రహ్మాస్తవనిద్రలోయీ ॥రా॥
భూమిమధ్యస్థలవాసమోయీ ।
నీకు - పూర్వకర్మ విమోచనాభాసమోయీ ॥రా॥
దశవిధనాదంబులోయీ ।
నీకు - తత్వశోధక తర్కవాదంబులోయీ ॥రా॥
నాదబిందుకళలోయీ ।
నీకు వాదభేదములేని సాధుకళలోయీ ॥రా॥
కోటిసూర్యవిలాసమోయీ ।
నీకు సాటిలేని జితేంద్రియాభ్యాసమోయీ ॥రా॥
ప్రాణాయామ విధానమోయీ ।
నీకు - బ్రహ్మసాక్షాత్కార ప్రజ్ఞానమోయీ ॥రా॥
కుండలీగమనంబులోయీ ।
నీకు - ఎండమావులభ్రాంతి శమనంబులోయీ ॥రా॥
లంబికాబంధనములోయీ ।
నీకు - అంబరాంతర్గతస్యందనములోయీ ।రా॥
పూరకరేచకములోయీ ।
నీకు - మేరుగిరిసంచార శోచకములోయీ ॥రా॥
లోవెలికుంభకములోయీ ।
నీకు - లోకాతీతసుదర్శనాంబకములోయీ ॥రా॥
ఇడాపింగళదంద్వమోయీ ।
నీకు - ఇహచింతవిడుశాశ్వతానందమోయీ ॥రా॥

అలరుసుషుమ్న బిలమోయీ ।
నీకు - కలమెలుకువలులేని జ్ఞానబలమోయీ ॥రా॥
షట్చక్ర వివరంబులోయీ ।
నీకు - సకలభూత దయార్ద్రి సారంబులోయీ ॥రా॥
కమలాంతరాంకురములోయీ ।
నీకు జ్ఞానవిజ్ఞానస్ఫురాంకురములోయీ ॥రా॥
అంతరకర్ణికలోయీ ।
నీకు _ అచలబ్రహ్మధ్యాన చూర్ణికలోయీ ॥రా॥
ఘనసహస్రారాంతమోయీ ।
నీకు - అనుమానరహిత నిశ్చలస్వాంతమోయీ ॥రా॥
ఛాయాపురుషవిధానమోయీ ।
నీకు చావుపుట్టుక లెరిగే సుజ్ఞానమోయీ ॥రా॥
స్వరశాస్త్రసంబంధమోయీ।
నీకు - సకలంబుగుర్తెరిగె అనుబంధమోయీ ॥రా॥
పంచభూత విభాగమోయీ ।
నీకు - ప్రారబ్ధకర్మనాశనభోగమోయీ ॥రా॥
లింగాంగస్థానంబులోయీ ।
నీకు - సంగవర్జిత పరధ్యానంబులోయీ ॥రా॥
శక్తిముక్తి బ్రహ్మలోయీ ।
నీకు - సర్వసమానజీవ బ్రహ్మలోయీ ॥రా॥
త్రిపుటిరహస్యార్థమోయీ ।
నీకు - కపటనాటక సూత్రగాత్రిహ్యార్థమోయీ ॥రా॥
వరమహావాక్యఫలమోయీ ।
నీకు - ఎరుక మరువులు లేని అమృతజలమోయీ ॥రా॥

వాచ్యలక్ష్యాంతరములోయీా ।
నీకు – వరసమాధికి నిరభ్యంతరములోయీా ॥రా॥
పండువెన్నెల బయలోయీా ।
నీకు – బయలులో బయలెరిగే బట్టబయలోయీా ॥రా॥
పరిపూర్ణమైన బయలోయీా ।
నీకు – మరలతిరిగిరాని మంచిహాయలోయీా ॥రా॥
ఘనయోగనిష్ఠారతుడోయీా ।
నీకు – ఇనగంటి పున్నయ్యదాసుహితుడోయీా ॥రా॥
పరతత్వదేశవిభుడోయీా ।
నీకు – పాటిబండ్ల వీరగురుడే ప్రభుడోయీా ॥రా॥
దూరముజూచుకొనవోయీా ।
నీకు – వీరోజిఋషిసాక్షి చూచుకొనవోయీా ॥రా॥
శిష్యులు తరించుటలోయీా ।
నీకు – శేషగురుమంత్రము స్మరించుటలోయీా ॥రా॥
గురువులు చరించుటలోయీా ।
నీకు – వరలక్ష్మణార్యు నర్చించుటలోయీా ॥రా॥
ఏబదియేడింతవరకోయీా ।
నీకు – ఇలరంగరాజగురుడెంతవరకోయీా ॥రా॥
ఆనందమానందమోయీా ।
నీకు – ఆనందోపనిషద్బ్రహ్మానందమోయీా ॥రా॥

31. కాంభోజిరాగము - అటతాళము-కృతి

కనుగొంటిని–శ్రీవీరగురుని । మనసార నా–కనులకరువుదీర ॥క॥
జననమరణములను–తొలగద్రోసి మోక్ష ।
ధనమొసంగుపూర్ణ–తత్వవేదవిదుని ॥క॥

కోటిసూర్య కాం-తులనుమించిన।వాటమైన-సహస్రార వీ
సూటిగా యినగంటి-పున్నయదాసునేలే ।
పాటిబండ్ల వంశ-వార్ధిచంద్రుని ॥౪॥

32. శ్రీరాగము - అటతాళము

ఓచెలియ నాగురుడు - ఉపదేశమిడెనే
ఉపదేశమిడినన్ను - జపియించుమనెనే
జపియించిపరమాత్మ - జాడగనుమనెనే
జాడగని ఐక్యమై - సాగిపొమ్మనెనే
సాగియిక జన్మలకు - రాగూడదనెనే
రాగూడదనేమాట - రాద్ధాంతమనెనే
రాద్ధాంతమద్వైత - సిద్ధాంతమనెనే
సిద్ధాంతభావార్థ - సిద్ధిగనుమనెనే
ప్రజ్ఞానం బ్రహ్మయని - పలుకుకొమ్మనెనే
పలుకుకొమ్మనెనేనను - కులుకుకొమ్మనెనే
అహంబ్రహ్మాస్మియని - అరచుకొమ్మనెనే
అరచుకొమ్మనెనేనను - తరచుకొమ్మనెనే
తత్వమసియనుమాట - దాచుకొమ్మనెనే
దాచుకొమ్మనెనేనను - జూచుకొమ్మనెనే
అయమాత్మాబ్రహ్మయని - ఆడుకొమ్మనెనే
ఆడుకొమ్మనెనేనను - పాడుకొమ్మనెనే
నామరూపక్రియా - నటనలేదనెనే
నియమనిష్ఠలు మొదలె - నిర్మూలమనెనే
ఏమేమొఅనెనే యిం - కేమేమోయనెనే
నీమాటనామాట - నిజములేదనెనే

ఎరుక మరుపులు రెండు - యేమిలేవనెనే
పరిపూర్ణమైనట్టి - బట్టబయలనెనే
పున్నయ్యదాసుని - బోధవినుమనెనే
చెన్నలర వీరగురు - సిద్ధిగనుమనెనే
పదిరెండు చరణాల - పరమార్థమనెనే
సదయుడౌ పీరోజి - సామ్రాజ్యమనెనే ॥ఓ॥

33. శంకరాభరణరాగము - ఆదితాళము

ఏమిసుందరమో - యీమోహజగము ।
ఏమిసంబరమో । యీమాయసుఖము ॥ఏ।
కామబంధముల - కార్చిచ్చుకణము ।
ప్రేమబంధముల - పెనుబాముఫణము ॥ఏ॥
చిటుకునపొటుకున - సిరిసంపదలు ।
పుటుకునయేడ్చుచు-పొరలెడువెతలు ॥చి॥
పటుతరమైతగు - బల యౌవ ।
నములు । కుటిలవిషయసం - ఘటితరోగములు ॥ఏ॥
మతముల కలతలు - మదమత్సరములు ।
బ్రతికెడిజీవుల-బరిమార్చుటలు ॥మ॥
సతతదురాగత - సంపాదనలు ।
అతుకులమారి మ - హాద్భుతకథలు ॥ఏ॥
దిక్కుదిక్కులనుండి-దీనార్తనాదము ।
చక్కబరచలేని - సంసార ఖేదము ॥ది।
చెక్కుచెదరని - జిగియింద్రజాలము ।
చిక్కుతీగెలవంటి - టక్కుటమారము ॥ఏ॥
భువిని శ్రీయినగంటి - పున్నయ్య గురువరు ।

సువిచారవేదాంత - సూత్రంబెరింగి ॥భు॥
అవనిలో శ్రీ చల్ల - మాంబ బోధించిన ।
వివరమెరింగిన - భవబంధములులేవు ॥ప॥

34. ఆనందభైరవి రాగము- ఆదితాళము (భక్తజనసంకల్పము)

ఆదిమధ్యాంతములులేని - ఆత్మమూలకారణా
సాధువర్తనానుకూల - సత్యవాక్యపోషణా
వాదభేదరహితముక్తి - భామినీమనోహరా
బోధజేయుపుణ్యమూర్తి - పున్నయార్య గురువరా ॥ఆ॥
వేదశాస్త్రసుప్రమాణ - వాదమంజుభాషణా
క్రోధమేమిలేని శాంత-గుణవికాసభూషణా
నాదబిందుకళా విలక్ష - ణత్రికూటభాసురా
బోధజేయుపుణ్యమూర్తి - పున్నయార్యగురువరా ॥వే॥
సాధనప్రపూర్ణహృదయ - సర్వదోషసంహారా
నీమహిమ దెలియతరము - గాదు సుగుణసాగరా
బాధామోదసమవిచార - పరమహంసశేఖరా
బోధజేయు పుణ్యమూర్తి - పున్నయార్యగురువరా ॥సా॥
అక్షయప్రబోధితాంత - రార్థతత్వశోధనా
పక్షపాతమేమిలేని - భక్తలోకపాలనా
శిక్షరక్షధీరయార్య - శిష్యజనసుధాకరా
మోక్షమిచ్చి రక్షజేయు - పున్నయార్యగురువరా ॥అ॥
మన్నునీళ్లు నిప్పుగాలి - మిన్ను యీప్రపంచము
ఎన్నటికిని నమ్మరాని - యింద్రజాలచిత్రము
ఉన్ననిజమదేమొదెల్పి - ఉద్ధరించవేమిరా
నిన్నెనమ్మినాముతండ్రి-పున్నయార్యగురువరా ॥మ॥

35. భూపాలరాగము - అటతాళము

రామనామము కల్పవృక్షము-రామనామమునిత్య మోక్షము ।
రామనామముదీక్షబూనిన-రాదుయికజన్మం ॥శ్రీరామనామం॥
హరిహర బ్రహ్మలకుసైతము-అలవిగాని రహస్యనామము।
గురుకటాక్షముగల్గుభక్తుల-పరముయీనామం॥శ్రీరామనామం
కారణాచార్యులనుమరచిన-ఘోరనరకంబైననామము।
మేరుశిఖరముపైనవెలిగే-సారమీనామం ॥శ్రీరామనామం॥
గురునియాజ్ఞనుమీరిపోయిన-పరమదురితంబైననామము
ఎరుకమరుపులమరుగుదెలిసిన-గురుతుయీనామం ॥శ్రీరామనా॥
మతవిభేదపుతగవులాటల-మాటలకు గనరానినామము।
మతములన్నిటియందుగల స-మ్మతముయీనామం శ్రీరామనా॥
వేదశాస్త్రపుకవెలకట్టలు-విప్పిననుగనరానినామము।
వేదవేదాంతార్థములలో-వివరమీనామం ॥శ్రీరామనామం॥
పండితులమని శ్రమలుజేసిన_ఫలితమేమియు లేనినామము।
కుండలిని పెకలించినడిపెడి-గోప్యమీనామం ॥శ్రీరామనామం॥
యజ్ఞములుయాగములు జేసిన-అంతుదెలియగ రానినామము
ప్రజ్ఞగలిగిన బ్రహ్మవేత్తల-భావమీనామం ॥శ్రీరామనామం॥
నాదబిందుకళావిశేషని-నాదమైదనరారునామము
వాదభేదవివాదబాధని-వారణమీనామం ॥శ్రీరామనామం॥
సూదిమోపను సందుదొరుకక - సూక్ష్మమైనయనంతనామము
సాధనంబులు నాల్గునేర్చిన-శక్తియీనామం ॥శ్రీరామనామం॥
ఆదిమధ్యాంతములులేని-మహాప్రసాదంబైననామము ।
సాధుసజ్జన మానసాంబుజ సారమీనామం ॥శ్రీరామనామం॥
ఎన్నిబుట్టిన నెన్నిగిట్టిన - ఎన్నటికి చెడకున్న నామము ।

మిన్నుమన్నుజలానలానిల – మిళితమిానామం శ్రీరామనామం
ధరణిశ్రీయినగంటి పున్నయ–దాస హృదయవిహారనామము।
వరలువీరయ గురువరేణ్యుని–వాక్యమిానామం శ్రీరామనామం
వాసిగాభద్రాచలాగ్ర వి–లాస భాసంబైననామము ।
భాసురంబుగ అప్పికట్ల ని–వాస మిానామం శ్రీరామనామం

36. అసావేరిరాగము – అటతాళము

మాయమాటలుగావురా – మరలజన్మకురావురా।
మరలజన్మకురావురా – తిరిగిజన్మకుబోవురా ।
రేయిబవలును విసుగులేకయె – శ్రీగురుని సేవించరా ॥మా॥
వాదభేదమువద్దురా – వచ్చినది పొరుగూరురా ।
సాధుసజ్జన వర్తనంబున – జరుగుకాలము గడుపరా ॥మా॥
ఎరుకమరువులు విడువరా – పరమపథమున నడువరా ।
ఇరువుతెరవులు రెండుదెలియని–గురువులతోపనియేమిరా మా॥
అందరెరుగనివట్టురా – కొందరెరిగినగుట్టురా।
సందుగొందుల కపటభక్తుల – సంతతికి కనికట్టురా ॥మా॥
పెక్కుమాటలేలరా – ఒక్కమాటేచాలురా ।
కుక్కవలెతిరుగాడుమనసును–నొక్కిచక్కగబట్టరా ॥మా॥
కొంటెచేష్టలు మానరా – ఒంటరిగ చరియించరా ।
అంటుబాసిగంటగంటకు – జంటస్వరములు బాడరా ॥మా॥
మూడుకోవలపుట్టరా – కోడెత్రాచులగుట్టరా ।
మోడివేసిన కోడెత్రాచులు – మూడుపడిగెలువిప్పురా ॥మా॥
కుండలిని పెకలించిరా – కొండపై కెక్కించరా ।
పండువెన్నెల బయలులోపల–బట్టబయలును గాంచరా ॥మా॥
కీలకము గుర్తించరా – మేలుకొని జీవించరా ।

నీలతోయదమధ్యనిలచిన – బాలికతో భాషించరా ॥మా॥
మొట్టమొదలేలేదురా – చిట్టచివరయుగాదురా ।
మెట్టవేదాంతములు నేర్చిన – గట్టిగా భ్రమబోదురా ॥మా॥
నీకునీవే దిక్కురా – లోకమెల్ల టక్కురా ।
రాకపోకలులేని బయలున – నీకుగూడచిక్కురా ॥మా॥
స్వానుభవమునుదెల్పరా – శాస్త్రవాక్యమునిల్పరా ।
మానితంబుగ గురునిమంత్రము-మాటికినిజపియించరా ॥మా॥
కోరికలు విడనాడరా – తీరికలు సరిజూడరా ।
ధారుణిని యినగంటివున్నయ – దాసుపాటలు పాడరా ।
మూటిమూటినిదాటరా – మేటిశిఖరపు బాటరా ।
పాటిబండ్ల వీరగురుని – భజనబంగరుమూటరా ॥మా॥
కర్మబంధముద్రుంచరా – మర్మబంధము ద్రెంచరా ।
ధర్మముగ వీరోజిఋషిగురు – ధర్మమును జరిగించరా ॥మా॥

37. మోహనరాగము - ఆదితాళము

శరదిందువదనా వినవే ।
కలికీచిలకలుకొలికీ – అరవిందనయనా గనవే ॥శ॥
ధరణినే జననమొంది – తరచుగా భ్రమలుజెంది ।
పరమార్థ మనగనేమో – గురుతే దెలియనినన్ను ।
కరుణామయుడగునాగురు ।
వరు – డొకతరుణంబందున యిటురమ్మనినా ।
శిరమందునతనదక్షిణకరమిడి-తరియించెదవని ఉపదేశించెను ॥శ॥
కరిరాజగమనా వినవే ।
కొమ్మాఅవరంజిబొమ్మా – వరకుందరదనా గనవే ॥క॥
హరిహర బ్రహ్మేంద్ర – సురసిద్ధసాధ్యకే ।

న్నర యక్షగంధర్వ - వరులకందగరాని ।
పరమరహస్యార్థముసీకొసగితి-స్మరియింపుముప్రతినిమిషంబంమున
గురుమంత్రంబునునిర్లక్ష్యముతో-
మరచితివానీకర్మముహొమ్మనె ॥శ॥
కులుకుమిటారీవినవే ॥
చెలియరానవమోహనాంగీ - తళుకువయ్యారీగనవే ॥కు॥
తొలకరి మెరుపువంటి - కలిమాయసంసారమును ।
తలచకెన్నడుమదిలో - తెలివిబ్రహ్మముసీవె ।
పలుగాకులు గూసెడిగూతలతో-పనియేమియులేదనితనసన్నిధి
గలసాంఖ్యము తారకమమనస్క-ము-
దెలిపెదననిసకలంబెరింగించెను ॥శ॥
మధురభాషిణీవినవే ఇంతీగుణములబంతీ-
మదనమోహినీగనవే ॥మ॥
సదమలమైన పూర్ణ - పదవి నాకొసతిచ్చి ।
చదువుసంధ్యలునేర్చి-పదరేమెరుకను మార్చి ।
పదహారింటికి యిరువెరిగించి-పదిహేనింటికి తెరవెరగించి
పదిరెండింటికి మరుగెరిగించి-కదలకు మెదలకుమనిబోధించెను॥శ॥
వరనీలవేణివినవే।రమణీముద్దులగుమ్మా-సరసీజపాణీగనవే ॥వ॥
వరవీరదేశికేంద్రు-కరుణాకటాక్షమొంది ।
ధరణి యినగంటి పున్నయ-దాసు దెల్పినబోధ ।
దురితవిదారము దుఃఖవిదూరము ।
నిరుపమసారము నిగమవిచారము ।
సరసవిహారము జన్మనివారము-
దొరికెను నీకుఅదృష్టముహొమ్మనె ॥శ॥

### 38. ఆనందభైరవిరాగము-ఆటతాళము.

పరిపూర్ణాచలపరబ్రహ్మసాక్షాత్కార।పరమార్థసామ్రాజ్యము।శా
శ్వతానందస్థిరతరసౌభాగ్యము।యోగాతీతపరమరహస్యార్థము।
సద్గురుపాద।సరసిజామృతతీర్థము।సత్యార్థమును సుచిర శతకోటి
సూర్యప్రకాశము।నిరుపమానవిలాస-పరమకైలాసము।ఎరుగ
జాలక-మోహజలధిలో తిరిగితిరిగి పొరలనేరక। మురిగిమురిగి
మరలమరలపుట్టి చచ్చెద రేమిభాగ్యము ॥ప॥
నీలతోయదమధ్య - నీవారశూకాభ। లీలావిద్యుద్భాసము।
చిత్కళాకాశ - ఫాలభాగవిశేషము। దశవిధనాద-జాలభేదసు
ఘోషము।శ్రీగురునాథ-లీలామానుషవేషము।గతదోషము
కాలజ్ఞానవిచార-గంభీరభాషము। భూలోకపరలోక -భోగార్థ
ద్వేషము।గతదోషము మేలుగాగనలేకముక్తి-బాలికామణి
పొందుదెలియక। బేలలై పసలేని యింద్రియ - లోలురయ్యెద
రేమిభాగ్యము ॥ప॥
పారమార్థికజీవ - బ్రహ్మైక్య వేదాంత।సారార్థ సువిచారము
మాయామోహ-ఘోరారణ్యకుఠారముసంసారమహాఘోరగం
భ్రమయూరము।సహస్రార -సారసాంతవిహారము।అవికారము।
క్రూరతన్మాత్రసం-చారభవదూరము। దారాధనతనయ మమ
కారసంహారము-నేరుపునగమనించలేక వి - చారమానసులై
కృశించుచు దారిదెలియక చిక్కులోబడి - తన్నుగానిరెద
రేమిభాగ్యము ॥ప॥
విమలశోభితగంగా।యమునా సరస్వతీ। సమరస సంధానము।
తన్మయానంద-కమనీయమృదుగానము।నిర్మలభావశమదమను
విధానము వరగురుచరణ-కమలయుగళ ధ్యానము।సుజ్ఞానము।

సమహితపరతత్వశాస్త్రప్రమాణము।అమితవిస్తీర్ణపర-మాత్మ
పరిమాణము।క్రమముగా గుర్తింపజాలక -కాకికొంగల చంద
మున నే।శ్రమలు జేసిపొట్టబూడ్చి-సంతసించెద రేమిభాగ్యము ॥వ॥
వరతత్వమసి వాక్య-పరమరహస్య సం ।భరిత పూర్ణానందము
వాచ్యార్థసం-భరితసదానందము।లక్ష్యార్థసంభరితచిదానందము।
అనుభవసంభరిత మహదానందము।ఆనందము।పరమార్థతత్వ।త
త్వరసహజానందము। దురిత విదూరభాసుర బ్రహ్మానందము ॥
ధరణి శ్రీ యినగంటి పున్నయ-దాసపోషక వీరదేశిక । వసు
కటాక్షానందమునుగొని- వరలుభాగ్యమె పరమభాగ్యము ॥వ॥

39 ముఖారి రాగము - అటతాళము (భక్తజనసంకల్పము)

గురువర్య సెలవిమ్ము-శరణుజొచ్చెదము ।
త్వరలోనె సన్నిధికి-తిరిగివచ్చెదము ॥గు॥
నిమిషమైనను గురుస - న్నిధి విడువరాదు ।
మముబట్టియున్న క - ర్మలు దొలగలేదు ॥గు॥
మాయకాపురములకు - పోయివచ్చెదము ।
పోయివచ్చి మీకు - పూజజేసెదము ॥గు॥
ఇంటిపై భ్రమగలిగె - కొంటెమనసులకు ।
వింటె చిత్రంబా మీ - వంటి పెద్దలకు ॥గు॥
చిన్నవారము మేము - శ్రీగురువరేణ్య ।
మన్నించి దీవించు - మాగురువరేణ్య ॥గు॥
దాసోహమండి మా - తప్పుదిద్దండి ।
చేసినపాపములు - చెప్పెదమండీ ॥గు॥
భువిని శ్రీ యినగంటి - పున్నయ్యగురుడు ।
వివరించు సద్బోధ - విడువడేనరుడు ॥గు॥

వరవీరయార్య స - ద్గురుస్వామితోడు ।
గురుసార్వభౌమ నిను - మరువమేనాడు ॥గు॥

40. వరాళిరాగము - ఆదితాళము

గురుఉపదేశంబందవోయ్ చిన్నవాడా ।
పరమపదంబును జెందవోయ్ చిన్నవాడా ॥గు॥
ఒంటరిదానిని విడువవోయ్ చిన్నవాడా ।
ఒంటరివానిని బిలువవోయ్ చిన్నవాడా ॥గు॥
రెంటిక్రిందికి దూకవోయ్ చిన్నవాడా ।
రెంటమీదికి బ్రాకవోయ్ చిన్నవాడా ॥గు॥
మూడువాళ్ళ బంచవోయ్ చిన్నవాడా !
మూడుపుత్త్రాళ్ళ పెంచవోయ్ చిన్నవాడా ॥గు॥
నాల్గుకోటలు విడువవోయ్ చిన్నవాడా ।
నాల్గుబాటలు నడువవోయ్ చిన్నవాడా ॥గు॥
ఐదుమూటలు విప్పవోయ్ చిన్నవాడా ।
ఐదుమాటలు జెప్పవోయ్ చిన్నవాడా ॥గు॥
ఆరులంగులు గట్టవోయ్ చిన్నవాడా ।
ఆరుమొగ్గులు బెట్టవోయ్ చిన్నవాడా ॥గు॥
ఏడుమెట్లు నొక్కవోయ్ చిన్నవాడా ।
ఏడుచెట్లు యెక్కవోయ్ చిన్నవాడా ॥గు॥
ఎనిమిదిమడుపులు మడువవోయ్ చిన్నవాడా ।
ఎనిమిది తుడుపులు దుడువవోయ్ చిన్నవాడా ॥గు॥
తొమ్మిదిమలుపులు మలుపవోయ్ చిన్నవాడా ।
తొమ్మిదినిలుపులు నిలుపవోయ్ చిన్నవాడా ॥గు॥
పదిగుర్రంబుల బట్టవోయ్ చిన్నవాడా ।

పదికళ్లెంబులు బెట్టవోయ్ చిన్నవాడా ॥గు॥
పూలరథముదోలవోయ్ చిన్నవాడా ।
మోక్షరాజ్య మేలవోయ్ చిన్నవాడా ॥గు॥
భూచరిపట్టు బట్టవోయ్ చిన్నవాడా ॥
ఖేచరికట్టు గట్టవోయ్ చిన్నవాడా ॥గు॥
షణ్ముఖితట్టు దట్టవోయ్ చిన్నవాడా ।
శాంభవిమొట్టు మొట్టవోయ్ చిన్నవాడా ॥గు॥
మధ్యమగుట్టుజూడవోయ్ చిన్నవాడా ।
మమకారంబులు వీడవోయ్ చిన్నవాడా ॥గు॥
ఎరుపు తెలుపు గలుపవోయ్ చిన్నవాడా ।
తిరిగి నలుపు గలపవోయ్ చిన్నవాడా ॥గు॥
నలుపులో నలుపు గలుపవోయ్ చిన్నవాడా ।
బిలమువాకిట నిలుపవోయ్ చిన్నవాడా ॥గు॥
వెన్నెల బిందువులానవోయ్ చిన్నవాడా ।
పున్నమచంద్రుని గానవోయ్ చిన్నవాడా ॥గు॥
హంసనుమార్చి కొట్టవోయ్ చిన్నవాడా ।
హంసనుజేర్చి పట్టవోయ్ చిన్నవాడా ॥గు॥
కుంభకమొత్తి గుంజవోయ్ చిన్నవాడా ।
లంబికనొత్తి లాగవోయ్ చిన్నవాడా ॥గు॥
కుండలినంటి లేపవోయ్ చిన్నవాడా ।
మండలమంటి చూడవోయ్ చిన్నవాడా ॥గు॥
సన్నపుబిలమున జరుగవోయ్ చిన్నవాడా ।
వెన్నెలబయట దిరుగవోయ్ చిన్నవాడా ॥గు॥
అంబరమంత ఆడవోయ్ చిన్నవాడా ।

సంబరమంత జూడవోయ్ చిన్నవాడా ॥గు॥
పదిహేన్ పదహార్ దెల్పవోయ్ చిన్నవాడా ।
పదిరెండంతట నిల్పవోయ్ చిన్నవాడా ॥గు॥
ఏమున్నదో-ఏమోనోయ్ చిన్నవాడా ।
ఏమిలేదో ఏమోనోయ్ చిన్నవాడా ॥గు॥
అడుగుటకు నీవెవ్వడవోయ్ చిన్నవాడా ।
నుడువుటకు నేనెవ్వతెనోయ్ చిన్నవాడా ॥గు॥
పున్నయదాసు నడుగవోయ్ చిన్నవాడా ।
నిన్ను నన్ను గల్పునోయ్ చిన్నవాడా ॥గు॥
వీరయగురువరు మాటేనోయ్ చిన్నవాడా ।
వీరోజీఋషి బాటేనోయ్ చిన్నవాడా ॥గు॥

41 శంకరాభరణరాగము - అటతాళము

వేదశాస్త్రపురాణ - గాథల కందని । ద్వాదశాక్షరి దెల్పనే
వాదభేదవినోద - సాధన షోడశి । లేదులేదని దెల్పనే ॥వే॥
పుట్టుగిట్టులులేని-గుట్టుమట్టులుగాని । బట్టబయలును దెల్పనే
మొట్టమొదటను నడుమ - చిట్టచివరను జగము ।
పుట్టి లేదని దెల్పనే ॥వే॥
పలుకు కులుకులులేని - వలపు తలపులుగాని ।
తెలివిబ్రహ్మము దెల్పనే
కలలోనదోచిన-కలిమివిధమునభ్రాంతి ।కలిగి లేదని దెల్పనే ॥వే॥
వారవంకలుబోని - దారిడొంకలులేని।పరిపూర్ణమును దెల్పనే
నారికేళములోనినీరుతెరగున మాయ-జేరిలేదని దెల్పనే ॥వే॥
అండదండయులేని - ఖండాఖండముగాని । దండిదేవుని దెల్పనే
ఎండమావులవలెయుండే ప్రపంచము ।ఉండిలేదని దెల్పనే ॥వే॥

మురియుచు యినగంటి - పున్నయ్యదాసుడు ।
పూర్ణభావము దెల్పెనే
వరవీరయార్యస-ద్గురుస్వామినెన్నడు మరువలేదని దెల్పెనే॥వే॥

42. శంకరాభరణరాగము - ఏకతాళము

చెప్పుటకేమండోయ్ వినగా - సిగ్గౌతుందండోయ్
తప్పునువొప్పుగ - వొప్పునుతప్పుగ । జెప్పుటతప్పండోయ్॥చె॥
గురువులబోధండోయ్ శిష్యులు - తరియించుటకండోయ్
పరమార్థంబులు - చరమార్థంబులు । ఎరుకలో పేర్లండోయ్॥చె॥
అసలది ఏమండోయ్ అనుభవ-మదియెట్లానండోయ్
గుసగుసలాడుచు - గోణిగెడి మంత్రపు - పసయేమానండోయ్
ముద్రలుజూడండోయ్ చూపులు - భద్రముజెయ్యండోయ్
నిద్రనుదెలిపే - నిద్రనుదెలిసితె - ముద్రలెలేవండోయ్ ॥చె॥
జపములుజెయ్యండోయ్ చేసితె - ఉపములు బోనండోయ్
అపరిమితంబగు - అజపముదెలిసితె।జపములె లేవండోయ్ ॥చె॥
యోగములాగండోయ్ మానస - భోగము వీడండోయ్
శ్రీగురుసేవలో - చిత్రము దెలిసితె। యోగములేదండోయ్ ॥చె॥
ఏమోగాదండోయ్ పేరొక - సామెతగలదండోయ్
ఏమియు గానిది - నామములేనిది । ఏమోగలదండోయ్ ॥చె॥
అవసరమేనండోయ్ కీలక - మదియొకటుందండోయ్ ॥చె॥
భువి యినగంటి - పున్నయదాసుని । వివరంబడుగండోయ్॥ చె॥
మాటలు నమ్మండోయ్ జన్మకు - మరి రాబోరండోయ్
మేటివీరగురు - బాటలో యేపార । పాటులు లేవండోయ్ ॥చె॥
ఓరువుజూపండోయ్ కోపము - దూరముజేయండోయ్
వీరోజీఋషి - వేదాంతసుధా । సారముగ్రోలండోయ్ ॥చె॥

యిదుగో చూడండోయ్ మరి న - న్నే మనబోకండోయ్
కదలితే శేషయ - ఘనగురుశాపము గలదని నమ్మండోయ్ ॥చె॥

43. శంకరాభరణరాగము - ఆటతాళము

ఆపందన్నా - దాపందన్నా । చూపందన్నా - మోపందన్నా ॥ఆ
ఆపంది దాపంది చూపంది - మోపంది । ఊపంది యేపంది -
లేపంది మాపంది ॥ఆ॥

తరుగందన్నా పెరుగందన్నా - విరుగందన్నా కరుగందన్నా ॥త
తరుగంది పెరుగంది - విరుగంది కరుగంది । అరుగంది ఒరుగంది -
తిరుగంది జరుగంది ॥ఆ॥

పిలువందన్నా తలువందన్నా - నిలువందన్నా మొలువందన్నా ॥పి॥
పిలువంది తలువంది - నిలువంది మొలువంది । అలువంది కొలువంది -
బలువంది గెలువంది ॥ఆ॥

అదరందన్నా బెదరందన్నా - కుదరందన్నా చెదరందన్నా ॥ఆ॥
అదరంది బెదరింది - కుదరంది చెదరంది । వదరంది పదరంది -
ముదరంది మదరంది ॥ఆ॥

ఆడందన్నా పాడందన్నా - చూడందన్నా వీడందన్నా ॥ఆ॥
ఆడంది పాడంది - చూడంది వేడంది । ఊడంది ఓడంది -
వాడంది మాడంది ॥ఆ॥

ఆరందన్నా కారందన్నా - కోరందన్నా చేరందన్నా ॥ఆ॥
ఆరంది కారంది - కోరంది చేరంది ఊరంది మారంది -
తీరంది మీరంది ॥ఆ॥

ఆనందన్నా పూనందన్నా - కానందన్నా మానందన్నా ॥ఆ॥
ఆనంది పూనంది - కానంది మానంది । ఊనంది యీనంది -
నానంది పేనంది ॥ఆ॥

ఎరుగందన్నా మరువందన్నా-ధరణిఅప్పికట్ల-పురమందన్నా ||ఎ||
మరియుచుయినగంటి పున్నయ్యదాసన్న |స్మరియించుమీరగురు -
పరిపూర్ణఫలమన్నా ||ఆ||

44. సావేరి రాగము - అట తాళము

అనరాని వినరాని బయలు |ఊర
కనుగంటిమనుటేమి హాయలు ||అ||
అనరానివినరాని యీబయలు | కనుగొంటిమనుమాట -
కల్లగారడిమాట ||అ||
ఉన్నదంటే వెర్రితనము | లే-కున్నదంటే పల్చదనము ||ఉ||
ఉన్నదిగాదు లేకున్నదిగాదు రెం | డన్నమాటలు బండి -
సున్నలైయున్నవి ||ఆ||
అనుభవమున కందిరాదు | కాచి - కనిపెట్టగా సంపులేదు||ఆ||
అనుభవించినవారు - అటుయిటు కదలరు -అనుభవమనభుక్తి-
కనుభవమానేమో ||ఆ||
అచలమనగానేమిమాట - దాన్నివచియింపజాలమీనోట||అ||
ఆచలసిద్ధాంతము - అసలెరాద్ధాంతము - అచలమనగా వెంక-
టాచలమానేమో ||ఆ||
పూర్ణమొకగుదుమనే కథలు | మొదలె -
పూర్ణము దెలియని వెతలు ||పూ||
పూర్ణములానేమొ ||ఆ||
ఎరుకదెలిసితె ఎంతోమేలు | యిదియె -
గురువరేణ్యుని గొప్పకీలు ||ఎ||
ఎరుకదెలిసినవారు - మరిమరితిరుగరు ఎరుకనగా కొల్లావురి -

యెరుక దెలిసిన దేమొ ॥అ॥
మరుపు మరచితే పెద్దతనమె । చూడ-
గురు సేవకిది మూలధనమె ॥మ॥
మరుపు చురచినవాకు-మరలమాట్లాడరు।మరువనగా కని మేలు-
మరచిపోవుట యేమొ ॥త॥
ఎందుకు యీావట్టి భ్రమలు । లేవు-
ముందుగా మేలొ౯ంటె శ్రమలు ॥ఎం॥
పొందుగా యినగంటి - పున్న మూర్యగురుని।సందర్భమడిగి తే-
సందేహములు దీర్చు ॥అ॥
వీరగురు పరమార్థబాట । మంచి వేదాంత రత్నాలమూట ॥వీ॥
తారక సాంఖ్యవిస్తారా మనస్క ప్ర । సారార్థపరిపూర్ణ-
సారముగలమాట ॥అ॥

45. నాదనామక్రియరాగము - అటతాళము సూర్యహారము

హరిహర బ్రహ్మేంద్ర - సురసిద్ధసాధ్య కి ।
న్నరులెరుంగరు బట్టబయలు ।
పరమార్థతత్వ సం - భరితదీక్షానంద ।
గురుడెరుంగును ఎరుక హాాయలు ॥హా॥
వేదశాస్త్రపురాణ - గాథావినోదార్థ ।
వాదమెరుగదు బట్టబయలు ।
వేదాంతసారప్ర - భావాచలానంద ।
బోధమెరుగును యెరుక హాాయలు ॥హా॥
జననమరణవికార - సాకారమచుకార ।
సగుణమెరుగదు బట్టబయలు ।
అనుపమానవిశేష - గుణరూపరహిత ని ।

ర్గుణమెఱుంగును యెఱుక హాయిఁయలు ॥హా॥
అందునిందనరాక - యెందెందుజూచిన ।
సందుదోఁచకదు బట్టబయలు ।
అందిందు సందించి - యిందందు బంధించి ।
మందగించును యెఱుక హాయిఁయలు ॥హా॥
తొల్లిజన్మములనే - మల్లిజన్మములనే ।
కల్లలెఱుగదు బట్టబయలు ।
పిల్లికొమ్ములబట్టి - విఱవలేమనిచెప్పు ।
బెడదచందము యెఱుక హాయిఁయలు ॥హా॥
వాడుపీడనుచు మిా - వాడు మావాడనుచు ।
గోడుజెందదు బట్టబయలు ।
త్రాడుచేతనుబట్టి - కోడెత్రాచనిచెప్పి ।
ఆడించబడుయెఱుక హాయిఁయలు ॥హా॥
అండపిండాండ బ్ర - హ్మాండభాండంబనే ।
అండజేరదు బట్టబయలు ।
ఎండమావులనీటి - నుండి దాహముదీర్చు
మందువేసవియెఱుక హాయిఁయలు ॥హా॥
చిమ్మచీకట్లనే - జిలుగువెన్నెలలనే ।
చిత్రమెఱుగదు బట్టబయలు ।
తుమ్మ మొద్దునుజూపి - దొంగవాడనిచెప్పి ।
నమ్మించబడుయెఱుక హాయిఁయలు ॥హా॥
జగముమిధ్యయటంచు - సత్తుబ్రహ్మమటంచు ।
చాటదెన్నడు బట్టబయలు ।
పగటినిద్రనుత్రుళ్ళి - పడి ప్రొద్దుపోడుపని ।

జగడమాడును యెరుక - హాయాయలు ॥హా॥
దవ్వుదాపుల జేరి - దారిడొంక లుదూరి ।
నివ్వటిల్లను బట్టబయలు ।
గవ్వపెంకున సూర్య - కాంతి రజతంబని ।
కవ్వించబడు యెరుక - హాయాయలు ॥హా॥
అవనిలో శ్రీ చల్లమాంబ జన్మవిలాస ।
మరయగోరదు బట్టబయలు ।
భువిని శ్రీయినగంటి - పున్నయ్యగురుమంత్ర ।
మున హరించును యెరుక హాయాయలు ॥హా॥
అరయగల్గెద రేని - అప్పికట్లపురంబు ।
నందు గన్పడు - బట్టబయలు ।
అరసిద్వాదశసూర్య - హారమిది ధరియింప ।
అంతరించును యెరుక - హాయాయలు ॥హా॥

46. కీరవాణిరాగము-అటతాళము (చంద్రహారము)

ఏమిజెప్పుదు ఏమిజూపుదు - స్వామిసద్గురురూపము
నామరూపక్రియలులేని ని - రామయంబగుదీపము ॥ఏ॥
కపటనాటకసూత్రధారణ - గానిదివ్యవికాసము
అపరిమిత దేదీప్యమాన మ - హాప్రకాశవిలాసము ॥ఏ॥
కోటిసూర్యవిలాసకాంతిని - గోటమీటిన తేజము
సూటిగా భ్రూమిమధ్యమందున - చూడరాని మహీజము ॥ఏ॥
లలితశోభితమాయిడా పిం - గళల కందనిస్థానము
అలరుచున్న సుషుమ్నబిలమున - కందరానివిధానము ॥ఏ॥
చెలగిప్రాణాయామముల శ్రమ - జేసికాంచనిచోద్యము
మెలగి దశవిధనాదములలో - మేళగించనివాద్యము ॥ఏ॥

పంచముద్రల పట్టులకు గమ - నించజాలని చిత్రము
పంచభూతవిభాగముల భా - గించనేరని క్షేత్రము ॥ఏ॥
ఆరుచక్రములందుదిరిగెడి - హంసలేకుగనిద్వీపము
మేరుశిఖరంబెక్కెనను పొలి - మేరగానని స్థాపము ॥ఏ॥
మండలత్రయభాగమున నిలు - చుండగోరని రమ్యము
కుండలీస్థానంబునను గూ - ర్చుండబోని యగమ్యము ॥ఏ॥
యోగవిద్యలకందరాని అ - యోమయంబగు దుర్గము
ఆగమాంతర తర్కవాక్యము - లరయజాలని మార్గము ॥ఏ॥
సర్వవేదాంతార్థములలో - స్వారిజేయు విహారము
పూర్వజన్మములందు జేసిన - పుణ్యముల పరిహారము ॥ఏ॥
నీవునేనను నేనునీవను - భావములకు అతీతము
భావమలరగజేయు - సద్గురునేవకే నిర్ణీతము ॥ఏ॥
ఎరుకయెరుగని ఎరుకనెరుగని - ఎరిగి యెరుగనిమర్మము
ఎరుకయెరుకై ఎరుకతానై - ఎరుకవీడిన ధర్మము ॥ఏ॥
నేనుగలనని నేనులేనని - తానెరుంగని స్వప్నము
తానుగలడని తానులేడని - నేనెరుంగనిగోప్యము ॥ఏ॥
నిర్వికారనిరంజనంబై - నిర్మలఃబాతత్వము
సర్వసచరాచరవిలక్షణ - స్వస్వతంత్రప్రభుత్వము ॥ఏ॥
ధరణి శ్రీయినగంటి పున్నయ - గురుడొసంగినపూర్ణము
సురుచిరంబుగ చల్లమాంబకు - సూత్రమైన సువర్ణము ॥ఏ॥
అరయగా శ్రీ అప్పికట్ల పురాంతరస్థ విభూషము
సరసషోడశపూర్ణసుకళా - చంద్రహారవిశేషము ॥ఏ॥

47. శంకరాభరణరాగము - ఆదితాళము (నక్షత్రహారము)

వీరగురుండిటు రమ్మని దయతో - వినిపించిన ఉపదేశమిది

సారతరంబగు పీఠోజీఋషి - కారణశుభసందేశమిది ॥పీ॥
హరిహరబ్రహ్మేంద్రాదుల కందని పరఫలభోగవిరాగమిది
అరయఁగ శ్రీశివరామదీక్షితుల-అచలాంతరసంయోగమిది ॥పీ॥
పుట్టుగిట్టువుల రట్టులెరుంగని - పూజితమౌ పరతత్వమిది
పట్టువిడుపులనెబాధలుజెందక-బయలైయున్న ప్రభుత్వమిది ॥పీ॥
అటుయిటుకదలని గోటుమిటులాడని - పటుతరమైనవిధానమిది
కిటుకులమారి విలాసవుకెరుకకు కీలకమొసగని స్థానమిది ॥పీ॥
ఔనని కాదని కలహములాడెడి - మానవులకు అనుమానమిది
పూనికతో నిశ్చలసుజ్ఞానము - బొందినతుదితీర్మానమిది ॥పీ॥
మతములగాథల వ్యతిరేకంబుల - గతిగని విస్మయమందదిది
సతతముసమ్మతమై యతులితమై - సర్వసమత్వంబైనదిది ॥పీ॥
ఇమ్ముగవర్ణాశ్రమధర్మంబుల - కెన్నఁడుదొరుకని సదనమిది
కొమ్ములుదిరిగినపండితులెందరో-దిమ్మరబోయినకదనమిది ॥పీ॥
సూటిగగన్గొన రెప్పపాటులో - నీటుగగన్పడు చోద్యమిది
కోటివిద్యలవి కూటికొరకెయని-ధాటిగచాటినవాద్యమిది ॥పీ॥
పూర్వజన్మకర్మంబులలోబడి - పౌరలెడికథలకుదూరమిది
సర్వవేదవేదాంతంబులలో-సారంబైన విచారమిది ॥పీ॥
జపములు తపములు వ్రతములు క్రతువులు-
సంధ్యలు స్నానము లరయదిది
ఉపములు నెపములు విఫలసఫలములు-
ఓర్పులునేర్పులు మురియదిది ॥పీ॥
కన్నులప్రక్కను వ్రేళ్ళిడి బొమముడి - వెన్నెలలోగనరానిదిది
వెన్నెలవెలుగున వెలగపండుపలె - వెదకుట దుర్లభమైనది ॥పీ॥
కోహంక స్త్వంద్వయ మేకంబని - కూతలుగూసిన రానిదిది

నాహం దేహో హనేంద్రియతతియని-ఊహలు జేసిన పోనిదిది ॥వీ॥
ఘోరభయంకరమారిపిశాచము-నోరిడి క్రింగరానిదిది
నారదరుక్మాంగద మహనీయులు నతులొనరింపగలేనిదిది ॥వీ॥
తొలకరిమెఱుపుల సంపదలనుగని-కులికెదరేమని అడుగదిది
కలిమియులేమియు కావడికుండల-వలెచలనములనిను డువదిది॥వీ॥
కలకాలంబీజన్మము లెత్తెడి - కష్టపరంపర లరయదిది
తొలినే జేసిన ప్రారబ్ధంబని - కలవరపడిచింతించదిది ॥వీ॥
తరుగని పెరుగని విరుగనికరుగని-ఎరుగనిజరుగని పూర్ణమిది
ఇరుగనిఒరుగనిమరుగని మొరుగని-అరుగనిదివ్యసువర్ణమిది ॥వీ॥
పాపపుణ్యములు బంధమోక్షములు-పరువుప్రతిష్ఠలుగోరదిది
చూపులురూపులుప్రాపులుదాపులు - రేపులుమాపులు జేరదిది॥
సత్తుచిత్తుఆనందామృతములు - జడదుఃఖంబులు బొందదిది
చిత్తవికారదురాలోచనలకు - చిక్కులపాలై చెందదిది ॥వీ॥
తానే నేనని నేనేతానని - తానే తానని తెలియదిది
లేనిదిపోనిదిరానిదికానిది - నేనన వీలే లేనిదిది ।వీ॥
ఎరుకతో వచ్చినగారడిజగమీ - యెరుకతోబోనని తెలియదిది
పరిపరివిధముల బడిప్రార్థించిన-ప్రత్యక్షముగాబోనిదిది ॥వీ॥
లేనియెరుక తనలోనజనించుట - లేనేలేదని తెలుపదిది
మానితముగ యిదిబట్టబయలయె యను ।
మాటనుసైతము నిలుపదిది ॥వీ॥
మంత్రత్రయగోప్యార్థంబులలో - మర్మంబైన అభేద్యమిది
యంత్రతంత్రములకందనిగురుచర-ణాంబుజసేవకుసాధ్యమిది ॥వీ॥
కలలోదోచిన దేహపుచందమె - ఇలలోగన్పడు చిత్రమిది
చెలువుగపంచదశాక్షరములలో-చేరి చరించెడి సూత్రమిది ॥వీ॥

ఎరిగెడిమూలములేని శరీరం - బేమిటికను ప్రశ్నార్థమిది
తరుచుగషోడశపరిశోధించిన - తాత్పర్యపు పరమార్థమిది ॥వీ॥
ఏదియుగాదిది తెలియగవశమా_ఏమోహామ్మనుసాజ్ఞయిది
వాద భేదములకందనిద్వాదశి-భావములోగలప్రజ్ఞయిది ॥వీ॥
ధర యినగంటి పున్నయదాసుడు - తరచితరించినజ్ఞానమిది
మరువక నిత్యముచల్లమాంబతన-మదిస్మరియించెడిధ్యానమిది॥వీ॥
అరమరలేకయె అప్పికట్లపుర - మందునదొరకెడి రత్నమిది
పరిపూర్ణాచల తారావళియిది-పరమపవిత్రంబైనదిది ॥వీ॥

48. కీరవాణిరాగము - అటతాళము

పరగ రజ్జుసర్పభ్రాంతి ప్ర-పంచమెల్ల నబద్ధము
మరు మరీచిక భ్రాంతిగా సం-సారమెల్ల నబద్ధము ॥ప॥
స్థాణుపురుషభ్రాంతిగా యీ - జగములెల్ల నబద్ధము
కాన నిద్ర దివంపుభ్రాంతిగ-కర్మలెల్ల నబద్ధము ॥ప॥
శుక్తిరజతభ్రాంతిగా యీ - చూపులెల్ల నబద్ధము
ముక్తిజూపగలేనిశాస్త్రపు - సూక్తులెల్ల నబద్ధము ॥ప॥
ధరణి శ్రీయినగంటిపున్నయ - దాసుబుట్టుటబద్ధము
వరలు పాటిబండ్ల వీరయ - గురుడుగిట్టుటబద్ధము
అరయగా వీరోజిగురుడు - తరలిపోవుటబద్ధము
తరముగాదిక తెల్పుటకు యీ - తత్వమెల్ల నబద్ధము ॥ప॥

49. శంకరాభరణరాగము - అటతాళము

ఆనందమానంద - మానందమాయె
ఆనందపూర్ణబ్ర - హ్మానందమాయె ॥ఆ॥
వేదశాస్త్రంబుల - విధులువిడిపోయె ।
వాదభేదంబులు - వర్జంబులాయె ॥ఆ॥

స్నానసంధ్యాద్యను - ష్ఠానాలు లేవాయె ।
దానధర్మము లంత - ర్థానంబులాయె ॥ఆ॥
తారకసాంఖ్యాలు - తారుమారైపోయె ।
కోరి అమనస్కాలు - దూరంబులాయె ॥ఆ॥
ఎరుక మరుపులు రెండు - యేమిలేవాయె ।
పరిపూర్ణమే పట్టి - బట్టబయలాయె ॥ఆ॥
ఏమేమొ ఆయె నిం - కేమేమొ ఆయె ।
ఆమాటవచియింప - అతిగోప్యమాయె ॥ఆ॥
పున్నయ్యదాసుని - బోధవినుటాయె ।
చెన్నలరు వీరగురు - సిద్ధాంతమాయె ॥ఆ॥
పదహారువాక్యాల - పరతత్వమాయె ।
సదయుఁడా వీరోజి - సామ్రాజ్యమాయె ॥ఆ॥

50. హిందోళరాగము - చాపుతాళము (భక్తజనసంకల్పము)

పూలు వేసెదము। పున్నయ్యగురుని-పూజచేసెదము ॥మల్లెపూ॥
నాలుగువేదాల - మూలముజగమింద్ర । జాలమని తెల్పె -
జాడదెలిసి
మేలైనచేమంతి - పూలు సన్నజాజి। పూలు పచ్చగులాబి -
పున్నాగ సంపెంగ ॥పూలు॥
ధరణిలోజనులకు-గురుడేదైవంబని । పరమప్రమాణంబు -
గురుతుబెట్టి
వరకుందమందార - వకుళాబ్జజంబీర । కరవీరనారంగ -
సురపొన్నచెంగల్వ పూలు ॥మొల్లపూలు॥
కులగోత్రములగాధ-తలపెట్టి చెడగొట్టె । కలహావాదంబుల -
కట్టుకథలు

కలనైన దలచక - కలిమాయ సంసార జలనిధి దాటించె -
జన్మరాహిత్యునకు ॥పూలు తుమ్మిపూలు॥
తంటాకోరులుగూసె - కొంటెకూతలతోడ । అంటుసొంటులేక-
కంటులేక
అంటశక్యముగాని-మింటికవ్వలను ము । క్కంటినిగనుకొన్న -
ఘనరాజయోగికి ॥పూలు జాజిపూలు॥
ఆధారస్వాధిష్టా - నాది కమలంబుల । శోధించి సాంఖ్యార్థ -
సూత్రములను
బోధించి దశవిధ - నాదబ్రహ్మానంద । సౌధంబునకు జేర్చె -
శాశ్వతానందునకు ॥పూలు పొన్నపూలు॥
ఆషాఢిగా గంగా - యమునా సరస్వతీ ।
తీరముల్ దాటించి - తెరవు మార్చి ।
కోరికతో ముక్తి - ద్వారమునకు మంచి ।
దారి జూపించిన - తారక బ్రహ్మకు ॥పూలు పొగడపూలు॥
వరతత్వ మసివాక్య - పరమ రహస్య సం ।
భరిత జీవబ్రహ్మ - భావ మరసి ।
కరుణించి భక్తులను - గాంచి ఆమనస్కార్థ ।
సరణిదెల్పెడిమోక్ష-సామ్రాజ్యమూర్తికి॥పూలు మొగలిపూలు
వచియింపరానట్టి - వాచామ గోచర ।
సుచరిత్ర గోప్యార్థ - సూత్రములను ।
వచియించి బయలులో - బయలు నిర్భయమైన ।
అచల పరిపూర్ణ బ్ర - హ్మానంద భోగికి ॥పూలు బంతిపూలు॥
వీరోజి గురువరుని - జేరి ఐక్యంబైన ।
వీర గురువర్యుని - ప్రియ శిష్యుడై ।

కారణుడై అప్పి - కట్ల పురంబున ।
జేరి భక్తుల బ్రోచె-శ్రీ పరమహంసకు ॥ పూలు రత్నాలపూలు॥
అవనిలో శ్రీ చల్ల - మాంబా హృదయేశుడై ।
భవబంధములు ద్రుంచె - పరమగురుడై ।
వివరించి శిష్యులకు - విరివిగ పరమార్థ ।
వివరము లందించె-వేదాంత వేద్యునకు ॥పూలు అపరంజిపూలు॥

51. జంఝూటి రాగము - ఏకతాళము

హారతిదిగో గురువరా - సూరిజన సుధాకర।మంగళారతిదిగో గురువరా॥ రారామము బ్రోవగురు-రాజశేఖరా । ఘోరకలుష విదార - కారుణ్యసాగర ॥హా॥
వేదశాస్త్ర విచారణా-విమల దివ్య కారణా-చతుర్వేదశాస్త్ర విచారణా॥వాదా మామీదదయ-రాద దేమిరా।సాధుహృదయ విహార - సకలలోకాధార ॥హా॥
నిను భజించుచుంటిమి । నిన్నె నమ్ముకొంటిమి - మది - నిను భజించుచుంటిమి॥ వినవూ మామనవి కా-రణమ దేమిరా।ముని జనపోషణ - మోక్ష సంభాషణ ॥హా॥
చెంత జేరినాముర । చింతలణచ వేమిర - నీ చెంత జేరినామురా॥ ఇంతబలవంతమగు - పంత మేలరా । శాంతసద్గుణశీల - సద్భక్త పరిపాల ॥హా॥
దివిజసన్నుతవర్తనా । దివ్యమంగళ కీర్తన - వర - దివిజసన్నుత వర్తనా॥ అవని యినగంటి వు - న్నయ్యదాసుని।భవబంధమణచిన - వరవీరయార్యేంద్ర ॥హా॥

52. మధ్యమావతి రాగము - అటతాళము

హారతిదుగో గురువరా।కర్పూర మంగళ-హారతిదుగో గురువరా॥

హారతిదుగో గురువరా ఆ – ధారసరసీరుహాము మొదలుగ
మేరుశిఖరమువరకుదిరిగే – తీరుగల వరహారమంగళ ॥హా॥
పంచరంగులమేడలో ని – ర్మించియున్న గవాక్షమందున
మించిగన్పడుచుండుజ్యోతిని_గాంచగలమోహారిలమంగళ ॥హా॥
దండిగా పదిరెండురేకుల – పుండరీకమునందువెలువడు
చుండుదశవిధనాదపులువిను_చుండగలముత్యాలమంగళ ॥హా॥
మండలత్రయభాగమున మా_ర్తాండపావకచంద్రకాంతుల
మెండుగా వెలిగింపగలచిద _ ఖండమారత్నాలమంగళ ॥హా॥
పంచభూతంబులను సమముగ – పంచబడినప్రపంచచిత్రము
చంచలంబనియెరుకమరుపుల – త్రుంచగలవజ్రాలమంగళ ॥హా॥
ధరణి శ్రీ యినగంటిపున్నయ-దాసునేలిన వీరగురువరు
పరమగోప్య స్వానుభవ సం – భరితమా పరిపూర్ణ మంగళ ॥హా॥

53. ఆనందభైరవి రాగముఅటతాళము

శ్రీవిష్ణుశ్రీసూర్య – శ్రీయాజ్ఞవల్క్యార్యా ।శ్రీజనకరాజేంద్ర-
శ్రీశుకులకు ॥ సేవించి సాందీప – శ్రీకృష్ణ పరమాత్మ ।శ్రీయుద్ధ
నోద్ధవ-శ్రీవేమనలకు॥
పరిపూర్ణ జయమంగళంసదా – పరతత్వశుభమంగళం ॥శ్రీ॥
రాజిల్లు శ్రీధర – ప్రభువర్యులకు పూర్ణ ।
తేజుడౌశివరామ – దీక్షితులకు ।
రాజతానాగేశ్వ – రాచార్యవర్యులకు ।
రాజశేఖరులకు – రామజోగులకు ।ప॥
రామకృష్ణార్యులకు – రంగరాజార్యులకు ।
లలిత చిట్టెంశెట్టి - లక్ష్మణులకు ।
శ్రీమాన్యుడౌ జమిలి – శేషయాచార్యులకు ।

ప్రేమించు పులహారి - పీర్దేశికులకు ॥ప॥
వరపాటిబండ్ల స - ద్వంశీయుడై వెలయు ।
వరవీరయార్యేంద్ర - స్వాములకును ॥
ధరణి శ్రీయినగంటి - వరపున్నయార్యేంద్ర ।
వరచల్లమాంబ స - ద్గురుదంపతులకు ॥ప॥
కమనీయమగా అప్పి - కట్లపుర వరములో
విమలవరిపూర్ణ గురు - పీఠమునకు ।
అమితాచలానంద - సమితిసద్భక్తులకు ।
అఖిలప్రపంచప్రజా - నీకమునకు ॥ప॥

54. శ్రీరాగము - చాపుతాళము

తలుపుదీయవె భామామణిరో ।
తలవాకిట నేను - నిలువజాలనె రమణీమణిరో ।
తలుపుదీయుటకొరకు - పలుసార్లుబిలచినను ।
పలుకనేపలుకవైతివి - కలికీచిలుకలకొలికి ॥త॥
తలుపుదీయను చిన్నవాడా ।
నీతోడనాకు-పలుమాటలేల వన్నెగాడ ।
పిలిచినంతనె నీతో - పలికి పనిబూనిలేచి
తలుపుదీయుటకేమి - వలపు బయ్యారిగాడా ॥తలు॥
ఆరుమేడలుదాటి - అపరంజిమేడదాటి ।
మేరుగిరి గుహాకునిన్ను - జేరశ్రమజేసివచ్చితి ॥త॥
జారచోరులవంటి - క్రూరుడవేమొ నీవు ।
మేరుగిరిగుహాకువచ్చిన - తీరుదెల్పకయున్న ॥తలు॥
పడియున్నకోడెత్రాచు - పడిగెపై గొట్టిలేపి ।
వడివడిగ దాని వెంట - నడచివచ్చితిత్వరగా ॥త॥

గడమీాదగారడివాని - గతి యింద్రజాలుడవేమొ ।
వడిత్రాచుబాముసుజూచిన - వార్త దెల్పకయున్న ॥తలు॥
మూడుపేటలబంగరు - త్రాడుపైకెక్కి దుమికి ।
ఏడైదుమూలల బావిలో - కోడె త్రాచునుగంటి ॥త॥
మోడివేసెడి పాముల - వాడవై యుంటివేమొ ।
త్రాడుపైకెక్కగలిగిన - జాడ దెల్పకయున్న ॥తలు॥
ముందుగ మనసు దృష్టి - బంధించి బీజాక్షరములు ।
సంధించి త్రాడుబట్టి - జరిగి పైకెక్కి వచ్చితి ॥త॥
గ్రంథాలుజూచి చెప్పే - కపటవేదాంతివేమొ ।
సంధించినబీజాక్షరముల - సరణిదెల్పకయున్న ॥త॥
గురుపాద సేవజేసి - గురుని యుపదేశమంది ।
పరమరహస్య మంత్రము - స్మరియించి సిద్ధి బొందితి ॥త॥
గురువాజ్ఞలేక శిష్యుల - గూర్చిన శుంఠవేమొ ।
పరమరహస్యమంత్ర - పద్ధతి దెల్పకయున్న ॥తలు॥
పరమచండాలునివలె - గురువాజ్ఞ మీారలేదు।
పరమరహస్య మంత్రము-భద్రముగ దాచుకొంటి ॥త॥
గురు సంప్రదాయము లేని - కొంటె గురుశిష్యుడవేమొ ।
గురుపీఠాధ్యక్షుడైన - గురునిదెల్పకయున్న ॥తలు॥
గురుసంప్రదాయము గల్గి - గురు పీఠాధ్యక్షుడైన ।
ధరణి యినగంటి వున్నయ - గురుని ప్రియశిష్యుడను ॥త॥
వర పాటిబండ్ల వీరయ - గురుసార్వభౌమేంద్రుని ।
కరుణచే నీపైనాకు స్థిరమైనప్రేమ గలిగె ।
తలుపుదీసితి చిన్నవాడా । భయమేమిలేదు ।
తలపేమొ దెల్పు వన్నెగాడా॥

### 55. భూపాలరాగము - అటతాళము

మేలుకో యిదివరకే - కాలమెల్లను గడచె ।
కీలకము గుర్తించి మేలుకో ।
ఫాల నేత్రముదెరచి - పాపిష్టి జన్మకు ।
మూలములేదని మేలుకో - మనసా మేలుకో ॥మే॥
రాగాంధకారంబు - బోగొట్టు జ్ఞానంపు ।
వేగుచుక్క బొడిచె మేలుకో ।
బాగుగ తెలవారి - ప్రణవ నాదంబనే ।
జేగకోడి గూసె మేలుకో - మనసా మేలుకో ॥మే॥
ఆధారస్వాధిష్టా - నాది కమలంబుల ।
సాధించి పెకలించి మేలుకో ।
శోధించి దశవిధ - నాదబ్రహ్మానంద ।
సౌధమున నివసించి మేలుకో మనసా మేలుకో ॥మే॥
దండి త్రికూటాద్రి - నిండు పున్నమనాటి ।
పండువెన్నెల జూచి మేలుకో ।
ఎండమావులవలె - యుండే ప్రపంచము ।
ఉండిలేదని తెలిసి మేలుకో మనసా మేలుకో ॥మే॥
అండపిండాండ బ్ర - హ్మాండ భాండంబుల ।
నిండు బయలునుజూచి మేలుకో ।
ఖండాఖండములుగ - గనుపించే మెరుకను ।
ఖండించి విడనాడి మేలుకో మనసా మేలుకో ॥మే॥
తరుగు పెరుగులుగల - ఎరుక మార్గంబులో ।
మరల జన్మము గలదు మేలుకో ।
తరుగు పెరుగులులేని - పరిపూర్ణ మార్గములో ।

తిరిగి జన్మము లేదు మేలుకో మనసా మేలుకో ॥మే॥
భువిని శ్రీ యినగంటి - పున్నయ్యాదాసుని ।
సువిచారార్థము దెలిసి మేలుకో ।
భవరహితుడౌ పాటి - బండ్ల వీరయగురుని ।
శివజీవైక్యం బెరిగి మేలుకో మనసా మేలుకో ॥మే॥

మత్తకోకిల : చంద్రసారతుషారశారద-చంద్రికాఘనసార దే ।
వేంద్రఘోటకకల్పభూజమ-హేశశైలపటీర నా ।
గేంద్రరాజమరాళహీరసు-రేభసన్నిభసద్యశ ।
స్సాంద్రశోభితచెంచురామయ-చౌదరీంద్రసుధీమణీ.

సంపూర్ణము

—(౦)—

# గురుస్తవము

శ్లో॥ విష్ణుం శూర్యం యాజ్ఞవల్క్యం । జనకత్స్యాపతింశుకం । సాందీప నింకృష్ణమూర్తిం । అర్జునోద్ధవవేమనాన్। శ్రీధరం శివరామార్యం । నాగేశ్వరగురూత్తమం। శ్రీరాజశేఖరాచార్యం । రామజోగీంద్ర దేశికం । రామకృష్ణ సదాచార్యం । రంగరాజార్య సద్గురుం । లక్ష్మణార్య సదాచార్యం । శేషయాచార్య సద్గురుం । శ్రీపీరోజిఋషి శ్రేష్ఠం । వీరయార్యేంద్ర సద్గురుం । పున్నయార్య సదాచార్యం । పూజయామి నిరంతరమ్॥

# గురుపీఠస్తవము

శ్రీ సచ్చిదానంద పూర్ణస్వరూపం - నిరాకారదీపం । మిథ్యా ప్రపంచాతిరిక్తం-నిరంతాస్తి భాతిప్రియత్వం । మాయాశబలిత ప్రభాసం - సదాభాసకూటస్థవాసం । సర్వమత సమ్మతార్థ ప్రభావం - నిరాకాశపరిపూర్ణభావం । సహజామనస్కానుభవ సూత్ర తాత్పర్యలక్ష్యం - సదాచార సౌభాగ్య దీక్షం । వర సాంఖ్యయోగార్థ భావప్రదానం - త్రిలోకప్రధానం । తారకానందవాచ్యార్థ లక్ష్యార్థ దీక్షావిశేషం - చతుర్వేద శాస్త్రాంతరార్థ ప్రభూషం । ఖేచరీ భూచరీ షణ్ముఖీ శాంభవీ మధ్యముద్రావలోకం - సదాచార సంచార వరశిష్యలోకం । కుండలీ మండితాఖండ తేజః ప్రదేశం - మహాకోటి సూర్యప్రకాశం । లంబికాబంధనోపేత పద్మాసనాసీన చిన్ముద్రలీలా వినోదాంతకాళం - దయాసత్య శౌచాలవాలం । నియమాసన ధ్యాన యమధారణ సమాధిముఖదివ్య యోగాష్టకాం ×

ప్రకాశం - నభస్థాన పూర్ణప్రవేశం। శాశ్వతాశాశ్వత పదార్థ పరిశోధన సుతర్కవాదం - మనోన్మన్యనంత ప్రమోదం। ఇహలోక పరలోక ఫలభోగవైరాగ్యశీలం - జగత్సృష్టి పరిపోషణలయార్థ ఖేలం। శ్రద్ధాసమాధాన శమదమతితీక్షోపరతి షట్కసంపద్వికాసం - చిదాభాస భ్రూమధ్య లీలావిలాసం। మోక్షేప్సితాలోచనార్థ ప్రకీర్ణం - నిరాలంబ నిర్నిద్రపూర్ణం। స్వరశాస్త్ర పరిశీలనాధార మహిమా విశేష ప్రభావోక్త సత్కాలదుష్కాల ఫలనిర్ణయానందఘోషం - గురోర్వాక్య శాస్త్ర ప్రమాణానుభవ చిత్రవేషం। ఛాయా పురుషలక్షణ విశేషసుజ్ఞాన మహిమాసహిత మృత్యుకాలప్రబోధం - దురాలోచనాసక్త మానసనిరోధం। దూరశ్రవణ దూరదర్శన జలస్తంభనాకాశగమనాన్య కాయప్రవేశాద్య దృశ్యప్రయోగానుభవ యోగసూత్రం - పరబ్రహ్మజీవైక్య సుజ్ఞాననేత్రం।దోషద్వయ గుణత్రయ చతుర్విధవిదుఃఖ పంచభ్రమవికార షట్కవ్యసన సప్తకసమూల హరణం - మహాఘోర సంసారవారాశి తరణం। త్రిపుటిత్రయ రహస్య సమ్మేళనానంద పరమార్థ సామ్రాజ్య పట్టాభిషేకం - దివాకర శశాంకాగ్ని మండల విలోకం। షట్చక్ర మధ్యస్థితాధ్యక్షకానంద సాన్నిధ్యపూజా విధాన ప్రయోజక మహాయోగ సాధకసమర్థ ప్రభుత్వం- పరాత్పరసుదర్శనఘనత్వం। విలసత్సహస్రార సరసీరుహాంతస్థ వర సూక్ష్మరంధ్ర పరిస్థాన సచ్చంద్రికాబాహ్య మధ్యస్థిత వ్యర్థ బాహ్యప్రకాశార్థ సందర్శనానంద మోక్షం - మహాభక్తసంరక్షపక్షం। నిర్లేపనిస్సంగ నిర్మోహనిష్కామ నిష్కంపనీరంధ్ర నిర్భంగ నిర్భిన్నగాత్రం - సుషుప్త్యంతర సుషుప్తి చిత్రం।అష్టా

క్షరీప్రణవపంచాక్షరీ యోగబీజాక్షరీవాక్య పూర్ణాక్షరీ ద్వాదశీ షోడశీ పంచదశ్యాదిపూర్ణ ప్రబోధోప దేశాధికారం – పునర్జన్మరాహిత్య యుక్తిప్రచారం । సత్సంప్రదాయాధికారార్థ శ్రీవిష్ణు శ్రీసూర్య శ్రీయాజ్ఞవల్క్యార్య శ్రీజనకరాజేంద్ర శుకయోగి సాందీపనిమహాత్మశ్రీకృష్ణమూర్త్యర్జునోద్ధవ సదాచార్య వేమన మహాయోగిశ్రీధరగురుశ్రేష్ఠ శివరామగురు దేవనాగేశ్వరాచార్య – శ్రీరాజశేఖర సదాచార్య శ్రీరామజోగీంద్ర – శ్రీరామకృష్ణార్య శ్రీరంగరాజార్య శ్రీలక్ష్మణాచార్య శ్రీశేషయాచార్య పీరోజిఋషివర్య శ్రీవీరయార్యేంద్ర కారుణ్యవిస్తార వేదాంత గోప్యార్థభావప్రపారం-సదానంద ఇనగంటి పున్నయ్యా గురుసార్వభౌమేంద్రపీఠం । భజేహమ్ భజేహమ్ భజేహమ్.

అప్పికట్ల
బాపట్లతాలూకా,
గుంటూరు జిల్లా.

ఇట్లు
శ్రీమతి ఇనగంటి చల్లమాంబ

శ్రీమాన్ ఇనగంటి పున్నయార్యగురువరేణ్యులవారి ధర్మపత్ని.

ఓమ్.

శ్రీ సద్గురు పరబ్రహ్మణే నమః

శ్రీ మదఖండ సచ్చిదానంద స్వరూపులైన శ్రీ ఫీరోజి ఋషీశ్వరులవారి పీఠస్థులగు శ్రీ సంకా ఉపేంద్రరావు గురువర్యులవారు నాకొసంగిన శ్రీ సద్గురు పీఠాధికారమును, శ్రీ శివరామ దీక్షితులవారి పీఠస్థులైన శ్రీ సచ్చిదానంద వెంకటేశ్వరస్వామివారు నా కొసంగిన పరిపూర్ణబోధాధికారమును శ్రీ పాటిబండ్ల వీరయార్యగురువరేణ్యులవారి సుసంకల్పముగా భావించి నేను స్వీకరించియున్నాను.

ఇట్లు

అప్పికట్ల ఇనగంటి పున్నయ్య చౌదరి

# గురుపరంపర

శ్రీమదఖండ సచ్చిదానంద పరిపూర్ణ పరబ్రహ్మ
స్వరూపులైన
ఉపనిషద్బ్రహ్మ
సనక సనందనులు
శ్రీ సాందీపులవారు
శ్రీ కృష్ణభగవానులు
శ్రీ ధరస్వాములు

| | |
|---|---|
| 1 శ్రీ రంగరాజాచార్యులవారు | 2 శ్రీ॥ శి॥ రా॥ దీ |
| శ్రీ చిట్టింసెట్టి లక్ష్మణార్యులు | శ్రీ॥ కం॥ అ॥ రా॥ |
| శ్రీ జమిలి శేషయ దేశికేంద్రులు | శ్రీ॥ ప॥ సీ॥ స్వా॥ |
| శ్రీ పులహారి పీకోజి ఋషివర్యులు | శ్రీ॥ భా॥ కృ దా॥ |
| శ్రీ పాటిబండ్ల వీరయార్యగురువర్యులు | శ్రీ॥ వీ॥ ల॥ దే॥ |
| శ్రీ ఇనగంటి పున్నయ్య గురువరేణ్యులు | శ్రీ॥ స॥ వెం॥ స్వా॥ |

ఇట్లు
ఇనగంటి చల్లమాంబ
(పున్నయ్య గురువరేణ్యులవారి సతీతిలకము)
అప్పికట్ల

# ముక్తికాంతావిలాసము

తత్వములు



గ్రంథకర్త:

శ్రీమాన్ ఇనగంటి పున్నయ్యాచౌదరి,

అప్పికట్ల.

# కృతిసమర్పణము

---

సీ॥ ద్వయదోష రహితమై ద్వైతమద్వైత వి
శిష్టంబులిమిడిన చిత్రపథము ।
సకల వేదాంతవి స్తారసారార్థ తా
త్పర్య సంయుతమైన తత్వపథము ।
నిఖిల చరాచరా నీకోద్భవస్థితి
లయములజేరని నియమపథము ।
నిరోక నిర్లేప నిష్కామ నిష్కంప
నిర్భంగమైనట్టి — నిత్యపథము

గీ॥ మీకడను వీరగురుడెరిగి నాకొసంగి
యుండెగావున పరమగు రుండవైన ।
తమకొసంగితి ముక్తికాం తావిలాస ।
కృతిని పులహారి పీరోజి ఋషివరేణ్యా॥

ఇట్లు

అప్పికట్ల. ఇనగంటి పున్నయ్య చౌదరి

•

# విజ్ఞప్తి

ఆర్యులారా !

శ్రీ రంగరాజాచార్యులవారి పీఠస్థులును శ్రీశివరామదీక్షితులవారి మార్గస్థులైన శ్రీ పీరోజి ఋషివర్యులవారి మఠాధిపతులగు ఫులహారి పీరోజిబాబు గురువర్యులవారొసంగిన గురూపదేశాధికారమును శ్రీ వారి పీఠస్థులగు శ్రీ సంకా ఉపేంద్రరావు గురువర్యులవారొసంగిన సద్గురు పీఠాధికారమును శ్రీ శివరామదీక్షితులవారి పీఠస్థులును శ్రీ రంగరాజాచార్యులవారి మార్గస్థులగు శ్రీ సచ్చిదానంద వెంకటేశ్వరస్వామివారొసంగిన పరిపూర్ణ బోధాధికారమును నేను మదీయ దేశికేంద్రులైన శ్రీ పాటిబండ్ల వీరయార్యగురువరేణ్యులవారి సుసంకల్పముగా భావించి అతిభక్తితో స్వీకరించి యున్నాడను. మరికొందఱు సనాతన సాంప్రదాయ సద్గురు పీఠస్థులగు అవధూతలును పరమహంసలు మున్నగువారు నాకొసంగిన జ్ఞానాధికారపత్రిక లనేకము లున్నను గ్రంథ విస్తరభీతిచే అట్టి పత్రికలిందు ప్రకటింప జాలనయితిని.

ఇట్లు

అప్పికట్ల          శ్రీమాన్ ఇనగంటి పున్నయ్యా చౌదరి

# తొలి పలుకు

మహాశయులారా!

నేనీ ముక్తికాంతావిలాసమను గ్రంథము నచ్చొత్తించుటకై కొందరు భక్తాగ్రేసరులు నన్ను త్వరపెట్టుటచే తిరిగి సవరణ జేసికొనుటకు సావకాశము లేనివాడనైతిని. యీ గ్రంథమును వ్రాయుటలో వ్యాకరణము ననుసరించి మార్పు జేయకుండుటయే గాక కొన్ని కొన్ని స్థలములందు సంధులను విడదీయుట కల్పుట మున్నగు సందర్భములలో పండితులకే గాక పామరులకు సైత మర్థమగునట్లు మామూలుగా వ్యవహారంబుననున్న పద్ధతి ననుసరించితిని. అంతియేగాని వ్యాకరణమును జవదాటినవాడనని భావింపవలదు. మరియు నేనీ గ్రంథమునందెచ్చటను ఒకమతమును, ఒకసంఘమును, ఒకవ్యక్తిని గురించి యేవిధమైన నిందారోపణము జేసియుండలేదు. కాబట్టి కవి యభిప్రాయము మరుగైయుండుటవలనగాని, సామాన్యదృష్టితో జూచుటవలనగాని, మరి యేవిధముననైనగాని, యట్టి భావ మేమహనీయులకైన స్ఫురించెనేని వారికొఱకు నేనిదే క్షమాపణము గోరుచున్నాడను.

ఇట్లు

అప్పికట్ల — శ్రీమాన్ ఇనగంటి పున్నయ్యా చౌదరి

శ్రీ పున్నయ్య గురుస్వాముల శిష్యులు



శ్రీ ఇనగంటి పిచ్చయ్య చౌదరిగారు

అప్పికట్ల

ఓమ్

శ్రీ రామచంద్రా నుగ్రహా శ్రీ వీరగురు పరబ్రహ్మణేనమః

# ముక్తికాంతా విలాసము

---

**౧. కీరవాణి రాగము - ఆటతాళము**

జిలుగుబంగరు పువ్వులద్దిన – జీరగట్టిన చిన్నది ।
తళుకు బెళుకు పురాణిపైటను–దాల్చి మెరయుచునున్నది ॥జి॥
రత్నములు ముత్యములు గూర్చిన –రవికె దొడగిన చిన్నది ।
రత్నమయ సింహాసనంబున – రాజ్యమేలుచు నున్నది ॥జి॥
అందచందము లందుతానే - అతిశయంబగు చిన్నది
మందమతులగు మానవులతో – మాటలాడక యున్నది ॥జి॥
జగములెల్ల నశించిపోయిన - శాశ్వతంబగు చిన్నది ।
తగినపురుషుడు లేకతనలో – తాను చింతిలుచున్నది ॥జి॥
వేదశాస్త్ర పురాణగాథల - వివరమెరిగిన చిన్నది ।
వాదభేదము లాడుచుండెడి - పండితులగన నన్నది ॥జి॥
స్నానములు సంధ్యలును తపములు–జపములెరిగిన చిన్నది ।
మానసంబున శుద్ధిలేని _ మాటలను విన నన్నది ॥జ॥
దానధర్మ పరోపకార వి-ధాన మెరిగిన చిన్నది ।
జ్ఞానహీనుల కర్మమార్గము – కంటకంబను చున్నది ॥జి॥

హెచ్చుగా యోగములు ముద్రలు - మచ్చులెరిగిన చిన్నది
సచ్చిదానందం బెరుంగని - స్వాములను గన నన్నది ॥
తీర్థయాత్రలు తిరిగి తిరిగి - భ్రిమ్మదిరిగిన చిన్నది।
సార్థకంబగు గురునిపాదమె - తీర్థమని కూర్చున్నది॥
శాస్త్ర మనుభవ మెరుగకుండిన - సరకుజేయని చిన్నది ।
శాస్త్రదృష్టము గురునివాక్యము -స్వానుభవమై యున్నది ॥
ధరణి శ్రీ యినగంటి పున్నయ - దాసు జేరెద నన్నది ।
వరలుపాటి బండ్లవీరయ - గురుని తోడనుచున్నది ॥జిలుగు॥

౨. నాదనామక్రియ రాగము - అటతాళము

మల్లె మొగ్గల చీరెగట్టి - తెల్లజాజిపూలుజుట్టి - చల్లని పన్నీరుచేపట్టి । ఓ హొయలుమీరిన చిన్నదానా । వల్లభుని పేరు దెల్పవే ॥మ॥

తెల్లపట్టు తలకుజుట్టి - నల్లకస్తురి బొట్టు బెట్టి - అల్లిబిల్లిగ ఉంగరాల్ బెట్టి।ఓ సొగసుదీరిన చిన్నవాడా - పెల్లిగాని కన్నె పడుచునురా ॥తె॥

నిన్నుగన్న తల్లియెవతె - నిన్నుగన్న తండ్రియెవడు- తిన్నగాయోచించి చెప్పవే - ఓ హొయలుమీరిన చిన్నదానా - ఉన్నది యున్నట్లుబల్కవే ॥మ॥

నన్నుగన్న తల్లిలేదు - నన్నుగన్న తండ్రిలేడు _ నన్నునేనే కన్నదాననురా। ఓ సొగసుదీరిన చిన్నవాడా । ఉన్నమాట విన్నవించితిరా ॥తె॥

కులమదేదో గోత్రమేదో - పిలువదగిన పేరుయేదో-నిలచి యుండే కాపురంబేదో । ఓ హొయలు మీరిన చిన్నదానా! చలముమాని తెలియపరచవే ॥మ॥

కులముగోత్రము లేమిలేవు - పిలువదగిన పేరులేదు-నిలచి యుండే కాపురములేదు । ఓ సొగసుదీరిన చిన్నవాడా ।స్థలము గాని స్థలము మాయూరు ॥తె॥

వింత వింతలమారిదానా - సంతసంబు కోలుపోయి - చింత జెందే కారణంబేమే। ఓ హొయలుమీరిన చిన్నదానా। పంత గించక అంతుదెల్పవే ॥మ॥

అంతులేదు పొంతులేదు - చెంతజేరే వాడులేక - అంతు లేని చింతగల్గెనురా। ఓ సొగసుదీరిన చిన్నవాడా। యింతకన్న వేరులేదురా ॥తె॥

కొమ్మరో నే నిన్నుజేర - తొమ్మిది కిటికీలమేడ - సొమ్ము బెట్టి కట్టి యుంటినిగా। ఓ హొయలు మీరిన చిన్నదానా। అమ్మవేసే విధము దెలియదుగా ॥మ॥

కుమ్మరి వారిండ్లకేగి - క్రొత్తకుండ యొకటిదెచ్చి - గుమ్మ మునకు గుర్తుబెట్టుమురా। ఓ సొగసుదీరిన చిన్నవాడా। అమ్మ వేసే విధము దెలియునురా ॥తె॥

పంచవన్నెల రామచిలుకను - పంజరంబులోననుంచి - పెంచి ముద్దు లాడుచుంటినిగా। ఓ హొయలు మీరిన చిన్న దానా। మించినభ్రమ వీడకుంటినిగా ॥మ॥

మంచి మల్లెపూలతోట - నుంచివచ్చే చల్లగాలి - కొంచె మాఘ్రాణించి రావోయి । ఓ సొగసుదీరినచిన్నవాడా। మించిన భ్రమ వీడిపోనోయి ॥తె॥

మూడుకాల్వల నీటిలోన - మునిగిమునిగి తేలితేలి - క్రీడ లాడే జాడగంటిని గా । ఓ హాయలుమీరిన చిన్నదానా । జోడువిడచే బాటదెలియదుగా ॥మ॥

మేడిచెట్టుపైనయూగు - లాడుచుండే పండుటాకు - జాడ జూచి విడచిరావోయి । ఓ సొగసుదీరిన చిన్నవాడా। మూడు కాల్వలు దాటగలవోయి ॥తె॥

వరలు పాటి బండ్లవీరయ - గురువరేణ్యుని సాక్షిగా నీ - తెరవుజేర దలచియున్నానే । ఓ హాయలు మీరిన చిన్న దానా । విరివిగానే మరులుగొన్నానే ॥మ॥

ధరణి (శ్రీ) యినగంటి పున్నయ-దాసుని యుపదేశమంది- తిరిగివచ్చి నన్నుజేరుమురా । ఓ సొగసుదీరిన చిన్నవాడా। స్థిర ముగా వరియించు కొందుమురా ॥తె॥

3. బేగడ రాగము - అటతాళము

హంస నడకలునడచు చిన్నది । అపరంజిబంగరు । హంస లను ముద్దాడుచున్నది॥

హంసనడకలు నడచుచిన్నది-హంసలను ముద్దాడుచున్నది। హంసలను చేపట్టకుండిన - హింసలొందుట సత్యమన్నది ॥హం॥

మెరుపుతీగెల వంటి చిన్నది । సొగసైనతొలకరి । మెరుపులను దిలకించుచున్నది॥

మెరుపుతీగెల వంటి చిన్నది-మెరుపులను దిలకించుచున్నది-మెరుపులను గమనించకుండిన-పరితపించుట సత్యమన్నది ॥హాం॥

రాగమాలిక దీయుచున్నది । పడిగలను విప్పిన । నాగుబాముల బట్టుచున్నది ॥

రాగమాలిక దీయు చిన్నది-నాగుబాముల బట్టుచున్నది । నాగుబాముల గొట్టకుండిన – నాశనంబే సత్యమన్నది ॥హాం॥

ఆరుమేడలుగనిన చిన్నది । పదినూర్ల పలకల । మేరుశిఖరం బెక్కుచున్నది ॥

ఆరు మేడలు గనిన చిన్నది – మేరుశిఖరంబెక్కుచున్నది । మేరు శిఖరం బెక్కకుండిన – ఘోరనరకమె సత్యమన్నది ॥హాం॥

ఈడుజోడై యున్న చిన్నది । జలకంబులాడే । మూడుకాల్వల నీదుచున్నది ॥

ఈడుజోడై యున్న చిన్నది-మూడుకాల్వల నీదుచున్నది। మూడుకాల్వలు దాటకుండిన-ముప్పుజెందుట సత్యమన్నది॥హా॥

భాసురంబై యున్న చిన్నది। యినగంటి వున్నది । దాసువాక్యము నమ్మికొన్నది ॥

భాసురంబైయున్న చిన్నది-దాసువాక్యము నమ్మికొన్నది। దాసువాక్యము నమ్మకుండిన-దోసమొందుటసత్యమన్నది॥హా॥

సారవంతంబైన చిన్నది । శ్రీ పాటిబండ్ల । వీరగురుని జేర నున్నది ॥

సారవంతంబైన చిన్నది । వీరగురుని జేరనున్నది।వీరగురుని జేరకుండిన – వెతలుబొందుట సత్యమన్నది ॥హం॥

4. శంకరాభరణ రాగము - జుల్వ తాళము

ఎంత చిత్ర మెంత చిత్రము – నాగురునిబోధ – ఎంతచిత్ర – మెంత చిత్రము ॥ఎం॥

ఎంత చిత్ర మెంత చిత్రము – అంతులేని మహా విచిత్రము ।
అంతరంగము నందుగల – చింతలణచిన మూలసూత్రము ॥ఎం॥

ఒంటి స్తంభము బెట్టికట్టిన – యింటి లోపల నన్ను జేర్చి ।
కొంటె మేకముల భయము మాన్పి – తంటాదీర్చిన మూల సూత్రము ॥ఎం॥

రెండుకొండలపైన మెరయు – చుండే సన్నని బిలములోన ।
పండువెన్నెలగాయుచుండే-నిండుచంద్రునిజూపినసూత్రము ॥ఎం॥

మూడుకోవల పుట్టనుండి – దాడివెడలి కరువవచ్చే ।
కోడెత్రాచు పడిగమీద – కొట్టిచంపిన మూలసూత్రము ॥ఎం॥

నాల్గుత్రోవల రాజమార్గము –నడచేవిధము దెల్పి గుహలో।
వెల్గుచుండేజ్యోతిజూపి– వెతలుబాపిన మూలసూత్రము ॥ఎం॥

ఐదుమూటలు విప్పియిరవై – యైదుమూటలు గట్టిమొత్తము ।
మైదుజేసి మంత్రముచేత – మర్మము విడదీసిన సూత్రము ॥ఎం॥

ఆరుమేడలు దాటి పై బం - గారు మేడలోనవున్న ।
నారీమణితో క్రీడలాడే - దారిజూపిన మూలసూత్రము ॥ఎం॥

ధరణి శ్రీ యినగంటి వున్నయ - దాసుజెప్పిన తత్వమందు ।
మరుగువిప్పి వీరగురుని-మహిమజూపిన మూలసూత్రము ॥ఎం॥

౫. నాదనామక్రియరాగము - ఆదితాళము

ఏ మండీ ఓ పండితులారా - ఏమి జెప్పెదరు ॥ఏ॥

మోమోటము లేక జెప్పిన - ముక్తిబొందెదరు
తామసించి చెప్పిన బల్ - తంటాల్ జెందెదరు ॥ఏ॥

వేదశాస్త్రము దేవుడే విని - పించె ననియెదరు ।
వేదములందరు జదువరాదని - విసుగుజెందెదరు ॥ఏ॥

సర్వవ్యాపకో హరియని - శాస్త్రాలనియెదరు ।
ఉర్విగట్టిన గుళ్ళలోహరి - ఉన్నాడనియెదరు ॥ఏ॥

విశ్వం నారాయణోయని - విధులుజెప్పెదరు ।
అశ్వముబట్టి యజ్ఞములోన - హాతముజేసెదరు ।ఏ॥

పంచవింశతి తత్వముల ప్ర - పంచ మనియెదరు ।
పంచములంచు కొందఱుమనుజుల - వంచనజేసెదరు ॥ఏ॥

ఒక్కడే దేవుడటంచు - బుక్కులు జెప్పెదరు ।
ఎక్కడెక్కడ పోలేరమ్మల - నెత్తుకొనియెదరు ॥ఏ॥

అజమంత్ర గాయత్రీయని - అర్థాల్ జెప్పెదరు ।
భుజముపైన నూలుజందెపు - పోగులువేసెదరు ॥ఏ॥

రానుపోను రైలుచార్జి - నేనే బెట్టెదను ।
జ్ఞానానంద మయుడగు హరిని – గాంచివచ్చెదము ॥ఏ॥
ధరణిలో యినగంటి వున్నయ - దాసునని యెదరు ।
వరలు పాటిబండ్ల వీరయ – గురునే మనియెదరు ॥ఏ॥

౬. నాదనామక్రియరాగము - అటతాళము

నరుడవై జన్మించి నావా। ఓరీ। గురువరునిసన్నిధి – మరచియున్నావా ॥న॥

దరిలేని జననంబు – మరణంబు జెందుచు ।పరిపరి విధముల– బాధపడుచున్నావా ॥న॥

ఎరుకలోపల బుట్టి – ఎరుకలోపల బెరిగి । ఎరుకలోపల జచ్చి - యెరుగకున్నావా । ఇరవు తెరవులరెంటి - నరయకున్నావా । పరులసంపదకొరకు భ్రమయుచున్నావా । వరభోగ భాగ్యముల -- వాంఛగొన్నావా । తరుణీమణులవలలో- దగులుకొన్నావా॥ మెరువుతీగెలవలె – మెరసి చిత్రంబైన । స్థిరములేని సుఖము – మరగియున్నావా ॥న॥

మూడారువాకిళ్ళు–మూసినిద్రించిన । కోడెత్రాసును లేపి – యాడించలేవా । క్రీడలాడేహంస - జోడువిడలేవా । మేడలాకిటిపైన - మేడగన లేవా । యేడుకోటల బాట - యెగిరిపోలేవా । చూడరాని స్థలము – శోధించలేవా ॥ మూడుకాల్వల యందు - మునుగుచు తేలుచు । వాడువీడను మాట వర్జించలేవా ।న॥

పదియారువన్నియు - బంగారమైనను। పదవడిమన్నులో-వల బుట్టెగదరా । అదియెరిగి తనువులో - ఆత్మ గనవలెరా । యెదిరించి విషయములు - నదలించ వలెరా । కుదురుపరచి మనసు - కూర్చుండవలెరా । పదిలంబుగా జ్యోతి - పరికించ వలెరా ॥ మదమత్సరంబుల - మటుమాయ మొనరించి కద లని మెదలని - గతినుండవలెరా ॥న॥

ఐ దారు పదునాల్గు - లైనతత్వంబుల । సాధించి దేవుని - శోధించవలెరా । కాదన్న వారిని - కాదన వలెరా । నీదినాది యనుట-లేదనవలెరా। వాదభేదంబులు - వదలుకొనవలెరా । సాధులస్నేహము సలుపగవలెరా॥ వేదవేదాంతసం - వేద్యులైన గురు । బోధలేనిదె ముక్తి లేదనవలెరా ॥న॥

వడిగా గడియకు మూడు - వందల అరువది। గడచిరాను న్నట్టి - గడువు గనవలెరా । నడినాళమున జేర్చి - నడిపించ వలెరా। జడకుచ్చులనుదాటి - సాగిపోవలెరా। ఎడలేకవీరోజి-ఋషినిగన వలెరా । తడయక వీరగురు - దరిజేరవలెరా పుడమి (శ్రీ) యినగంటి - పున్నయ్య దాసుని।నుడువులు నీవు - కడతేరవలెరా ॥న॥

## ౭. లతాంగి రాగము - అటతాళము

గురువరుని పూజించరే - పరమాత్ముడని । గురినిల్పి తరి యించరే ॥గు॥

భరియింపరానట్టి-భవసీరధిలోజిక్కి-।పరితాపమునుబొందక। మరి మరి పుట్టుచు-మరి మరి గిట్టుచు। దరిలేని వెతజెందక ॥గు॥

పంచ భూతంబులను – పంచి తత్వంబుల । పంచవింశతి బెం
చిన । పంచశక్తులనెంచి – పంచ ముక్తులగాంచి । పంచకర్తల
మించిన ॥గు॥

ఆధారస్వాధిష్టా - నాదికమలంబుల । శోధించేవిధి దెల్పిన।
శోధించి రేచక - పూరకకుంభక । సాధనములు నిల్పిన ॥గు॥

ప్రజ్ఞానం బ్రహ్మంబని – పరమవాక్యము దెల్పి । అజ్ఞానము
ను ద్రుంచిన । జిజ్ఞాసులను గూర్చి - జీవు డీశ్వరుడగు । ప్రజ్ఞ
ప్రసాదించిన ॥గు॥

తరుగక పెరుగక - విరుగక కరుగక । తిరుగని సిరిజూపిన ।
తరుగుచు పెరుగుచు - విరుగుచు కరుగుచు । తిరిగే లేమిని
బాపిన ॥గు॥

మందార పున్నాగ - మాలతీచంపక । కుందార విందము
లచే । చందనాగరు ఘన - సారగంధంబుల । సుందరాంబర
ములచే ॥గు॥

భువిని శ్రీ యినగంటి - పున్నయ్యదాసుని । కవనధారలు
జల్లుచు । భవరహితుడౌ పాటి - బండ్ల వీరయగురుని।భావంబు
వెదజల్లుచు ॥గు॥

౫. కాంభోజరాగము - జంపెతాళము

ధరణిని నాగురు – వరుడేనా దైవము ॥ధ॥
పరులమాట వినుటవలన – ఫలములేదు సరిగదా ।
తరుగు పెరుగు సంగతుల - తగవులాటలౌ గదా ॥ధ॥

ఎన్నియోగశాస్త్రములెరింగిన - నన్ను నేనుచూడగలనా ।
సన్నపుబిలమందువెలుగు - స్వామిని నే విడువగలనా ॥ధ॥
జిలుగురాళ్ళ పూజజేసి - చేసి చేతులుకడిగికొని ।
తెలివిలోపలనున్నబ్రహ్మము - దెలిసికొంటినమ్మికొని ॥ధ॥
కారణాచార్యులసన్నిధి - కారణమునందుకొని ।
దూరదూరముగనుదిరుగు - వారితోనాకేమిపని ॥ధ॥
గురునియాజ్ఞ మించిపోయిన - నరునికి నరకముగదా ।
పరమపావనమైనగురుని - పాదమేమోక్షముగదా ॥ధ॥
ధరణిశ్రీయినగంటిపున్నయ - దాసువాక్యమునమ్మికొంటి ।
వరలు పాటిబండ్లపీరయ - గురునిదీవనలందుకొంటి ॥ధ॥

౯. కాంభోజిరాగము - అటతాళము

వందారు సచ్చిదా - నందపరబ్రహ్మ । నందములేకభవ - బంధమువిడునా ॥వం॥

కుందారవిందమక - రందసుగంధాఢ్యా । నందాభ్యాసము నొంది - యిందుముఖులపొందే । అందమనుచును - చందమనుచును । గంధసింధుర - మొందుగతిమద - మంది యింద్రియ బృందమునుగెలు । పొందలేని - మందమతులకు ॥వం॥

జ్ఞానానుసంధాన - మానసాంతర్గతా - ధీననిశ్చయసంవి - ధానధ్యానమున ॥జ్ఞా॥

మానావమానవి - హీననిత్యనిధాన । మానితానూనని - స్త్రాణనిరవధాన - మైనసౌఖ్యముగానకసుభ్రమ - బూనిమేను

నుతానసుచు - సంతానసంపద జిక్కువడి కను-గానలేని దీన జనులకు ॥వం॥

అండపిండాండ బ్ర - హ్మాండభాండావృత । భండనభీమప్ర - చండదోర్దండమై ॥అం॥

మండితాకృతి జిత । మండలత్రయమై మా । ర్తాండకోటి ప్రభా - చండప్రపూర్ణమై । యుండుతావును గాన లేకను - యెండమావుల తండములవలె । నుండుధన రాసుల దగుల్కొని - మొండితనమున నుండు జనులకు ॥వం॥

పంచవింశతితత్వ - బావైశ్యాద్వయ తాత్ప । ర్యాంచిత సారాంశ - మై పరాత్పరమై ॥పం॥

పంచశక్తిబ్రహ్మ-పంచకాతీతమై । పంచముక్తివిలసి - తాంచితబ్రహ్మమై । మించుస్థానము జేరలేకను - సంచితము గడియించుకొని గ । ర్వించి తాపత్రయములను వద - లించుకొనక త - పించు జనులకు ॥పం॥

వరయోగి జనహృదయ - సరసిజషట్పద । పరమార్థతత్వ సంభరితసాగరమై ॥వ॥

నిరుపమానవిలాస - నిర్వికారవిశేష - నిరత మహోల్లాస - నిగమాంతవేద్యమా । ధరణి (శ్రీ) యినగంటిపున్నయ దాసునేలిన వీరగురువరు। తెరవెరుంగక నైహికంబే । స్థిరమటంచును - దిరుగుజనులకు ॥పం॥

## ౧౧. సావేరి రాగము - అటతాళము

అంతుదెలియని భగ - వంతుని రూపము । యెంతో వింతగ నున్నది ॥

నిరా । ద్యంత విస్తీర్ణ ది - గంత పరిపూర్ణప । ర్యంతానంతంబైనది ॥అం॥

సంతతము వే - దాంత విద్యా । వంతమై య - త్యంతమై యా । వంతయేని కొఱంతలేక ని - రంతరము దనరారుచున్నది ॥అం॥

వరయోగి జన హృదయ _ సరసిజ భృంగమై। పరమానంద త - రంగమై ॥వ॥

నిరుపమానమై - నిర్మలతేజమై । సురుచిరభ్రూమధ్యాం - తర చిద్విలాసమై । గిరులకును ఝురులకును తరులకు - శరులకును హరులకును నరులకును । సురులకును ఖేచరులకును కిన్నర వరుల కాధారమైనది ॥అం॥

ఇందిరారమణార-విందసంభవశివ । బృందారకాతీతమై ॥ ఇందుసూర్యాగ్ని కళా - మందిరాధారమై । సందళితాసుర - బృందవిశాలమై । అందచందము లందుగలభ్రమ - నొందకను కందకను కుందక । అందకను పొందకను చెందక _ సందులేకను నిండియున్నది ॥అం॥

వీః సితలక్ష్యార్థ - ఫలితవిలక్షణమై । కలమెలుకువలు శూన్యమై ॥వి॥

కులము స్థలములేక - గోత్రసూత్రము గాక । వెలుగుల కెల్లను వెలుగై యున్నది । పలుకరించిన పలుకకున్నది - తల చినను మదిదగులకున్నది । చలికి వణకక నిలచియున్నది - జల మునకు తడియకనెయున్నది ॥అం॥

ఘోరకలుష విదార - సూరిజనోద్ధార । పారావారవిహా రమై ॥ఘో॥

దూరాదూరార్ధ వి - స్తార చారిత్రమై । పూరిత కరుణార్ద్ర - సారపవిత్రమై । ధారుణిని యినగంటి పున్నయ - దాసపోషిత వీరగురు సువి - చారమైరసపూరమై గంభీరమై యలరారుచున్నది ॥అం॥

౧౧. శంకరాభరణ రాగము - ఆదితాళము

పరాత్పరుండెటు-భరియించెనోయీ।ప్రపంచమంతయు గురువరా
ధరాతలంబీ- సరోవరంబుల । భరియించినటువలె శిష్యుడా ॥ప॥
అరూపకుండో-స్వరూపకుండో।యెరుంగ బల్కుము గురువరా।
అరూపకత్వము-స్వరూపకత్వము।ధరించియుండెను శిష్యుడా ॥ప॥
భరింపజాలని- భవాబ్ధిదాటు వి । వరంబదేదో గురువరా ।
చిరాననినుసీ - వెరింగిసద్గురు । వరుణ్ స్మరింపుము శిష్యుడా ॥ప॥
నరుండుతను తా - నెరుంగకనుభువి । జరింపనేమగు గురువరా ।
జరామరణజన - నరాజిని విప । త్పరంపరలజెటు శిష్యుడా ॥ప॥
పురందరముఖా - మరానీకమెటు । తరించగలరో గురువరా ।
ధరణ్ జనించియు-నరత్వమునగురు। వరుణ్ భజంచియే శిష్యుడా॥

రవిజ్వలనసో - మవాయ్వంబరనిల । దివంబురేమో గురువరా ।
అవిచ్ఛిన్నమం-దనాదిప్రకృతి। ప్రవృత్తిచిత్రము శిష్యుడా ॥ప॥
శివుండెవడు మా-ధవుండెవండబ్జ । భవుండెవండో గురువరా ।
శివబ్రహ్మవి-ష్ణువుల్ గుణత్రయ। ము జా స్తవంబుగ శిష్యుడా ॥ప॥
భువిన్ శ్రీయినగంటి – పున్నయ్యదాస్ యను । భవంబదేమో
గురువరా ।
భవంబులేకు – న్న వీరగురు స। త్ప్రభావఫలమే శిష్యుడా ॥ప॥

౧౨. బంగాళా తోడిరాగము - అటతాళము

గురుబోధ విని నట్టి - గుణవంతులారా । మరలజన్మము లేని - మార్గమేదండీ। తిరిగిజన్మము రాని - తెరవుయేదండీ ॥గు॥

గురుసేవజేయని - కుటిలమతులారా - గురునియాజ్ఞలేక - యెరిగించమండీ । గురునియాజ్ఞనుమీరి – చరియించమండీ ॥గు॥

మాయందు దయయుంచి – మమ్మాదరించి - సాయంబు జేయండి – సన్నుతించెదము । ఉ । పాయంబుజెప్పండి - ప్రస్తుతించెదము ॥

వేయినూరులలక్షల్ – వేలొసంగినను । న్యాయం బుగాదండి – సాయంబు జేయ । ఉ పాయంబు లేదండి - భావంబుదీయ ॥గు॥

మామీద దయలేక – తామసించినను । మేమెట్లు తరియించి – మేలొంద గలము । మేమెట్లు కడతేరి – మిము జేర గలము ॥గు॥

మామాటవినిమీరు - మాగురునిజేరి । పామరత్వ
ముమాని ఫలముగాంచండీ । స్వామివారిని జేరే - జాడదెలి
యండీ ॥గు॥

మీమార్గముననిష్ట - లేమేమిగలవు । ఆ మాటలైనను -
అంతు జెప్పండీ । మోమాటమును లేక - ముచ్చటించండీ ॥
తామసగుణములు - తగవిడువవలెను । ప్రేమ గుణంబులు -
పెంచగావలెను । కామగుణాంబులు - ఖండించవలెను ॥గు॥

విరళించి చెప్పండీ - వినకోర్కెగలై । అరమరలేక మే -
మాలకించెదము । పరమపావనమని పఠనజేసెదము ॥
పరపురుషునకు తండ్రిభావమందించి । పరకాంతతల్లిగా భావించ
వలెను పరధనమువిషముగా - పరికించవలెను ॥గు॥

మరియేమిగలవోమీ - మార్గంబునందు । సరసమతులై
పట్టి సాధుజనులారా ! పరమాత్మ జెరెడి భక్తవరులారా॥గు॥

పరులదూషించెడి - పనిమానవలెను । పరులకుపకారంబు-
జూపగవలెను । కరుణించిదీనుల - కాపాడవలెను ॥గు॥

అవనిలోయీబోధ - నందించునట్టి । శివగురుడు మీకె
వడో చెప్పరేమండీ । భవసాగరములోన - బడియుంటిమండీ॥

భువిని శ్రీయినగంటి - పున్నయ్యదాసు - వివరమెరిగించిన-
శివగురుడుమాకు । భవసాగరముదాటే-ఫలమిదునుమీకు ॥గు॥

పున్నయగురువరుని - సన్నిధిజేర్చి । తిన్నగ మమ్ములదీవిం
చరండీ । కన్నులపండుగ గావించరండీ ॥

చెన్నలకు వీరగురుశిష్యవరుడైన- వున్నయ్యగురువరుని సన్నిధియిదుగో । కన్నులపండుగగానున్నదదిగో ॥గు॥

౧౩. మధ్యమావతిరాగము - అటతాళము

వినరమ్మ చెలులార - వినరమ్మమీరు ॥ మనగురునిపూజించుమార్గమెట్లనిన ॥

రత్నమణిమయపీఠ - రాజంబుదెచ్చి । రత్నకంబళిగప్పి - రమ్యమొనరించి ।

గురువరేణ్యునికోరి - కూర్చుండబెట్టి । పరమాత్ముడనుచు స - ద్భక్తిసమకట్టి ।

కనకంపుపళ్ళెరంబును దెచ్చిపెట్టి । ఘనగురువరుని పాద- కమలంబుబెట్టి ।

పదియారువన్నియ - బంగారురేకు - పొదిగియుండినవెండి- బుంగ చేపట్టి ।

కావేరికృష్ణగో-దావరీసింధు । పావనంబౌ సర - స్వతిగంగయమున ।

రంగుమీరినభీమ - రథితామ్రపర్ణి । తుంగభద్రా సరయు - దోషరహితంబౌ ।

నర్మదాజలము వి - స్నానముగవంచి - ధర్మంబుగా నడుగు - దమ్ములనుగడిగి ।

తడియొత్తిపట్టువ - స్త్రముగట్టబెట్టి। తడయకనుతాంబూల దక్షిణలుంబెట్టి।

పునుగుజవ్వాజి క-ర్పూరంబలంది।ఘనముగా చందనా-గరు గంధమద్ది ।

నుదుటకస్తురిబొట్టు - కుదురుగాబెట్టి ।పదిలపరచిన మంచి పన్నీరుజల్లి ।

ఇందీవరంబులర - విందబృందములు। మందారములు బంతి మల్లె చేమంతి ।

కరవీర పున్నాగ - సురపొన్నపొగడ । విరజాజిసంపెంగ - విరులువెదజల్లి ।

అలరారు కుంకుమం - బక్షతలనుంచి - చెలగుమారేడు తుల - సీదళములుంచి ।

హృత్ప్రాణ లక్ష్యంబు - లేకంబుజేసి। తత్పదంబుననుంచి- తాల్మివహియించి ।

వగమాని సద్బుద్ధి - పాత్రగావించి । తగపుణ్యపాపముల తైలమందుంచి ।

ఊనిచిన్మోదసు - జ్యోతి ముట్టించి । ఆనందనైవేద్య మర్పించిమించి ।

మొనసికామక్రోధ - మోహాలోభములు । దునిమిమద మాత్సర్య - ధూపంబువేసి ।

నిర్వికల్పసమాధి నిలచియున్నట్టి । సర్వజ్ఞుడౌగురు-స్వామి సన్నిధిని ।

తల్లిపిల్లలమీద - ధ్యాసలనుమాని । అల్లుండ్లకోడండ్ల - యాశలనుమాని ।

అన్నదమ్ములమీద-నున్నభ్రమమాని । పిన్నమ్మపెద్దమ్మ-ప్రేమలనుమాని ।

బావమరదులమీద-భ్రాంతులనుమాని । ఆవరించినమిత్ర - భావంబుమాని ।

ధనధాన్యములజోలి - తలపెట్టవలదు । ఘన గృహంబుల వాంఛ - లను బూనవలదు ।

పొలములపైకోర్కె - బోసీయవలదు - బలరూపయౌవనం - బుల దలచవలదు ।

కులగోత్రములమీద - గురిబెట్ట వలదు । కలహాకారుల మీద - కసిబట్టవలదు ।

ఊరుపల్లెలతీరు - నూహించవలదు । దారిపొంకలసౌరు - దలపగావలదు ।

రాళ్ళపూజలుజేయు-రగడమనకేల । గుళ్ళచుట్టునుదిరుగు-గోలమనకేల ।

తులసిచెట్లకుమ్రొక్కు - త్రోవమనకేల । జలములోపల మునుగు - జాడమనకేల ।

వరగురుని సాష్టాంగ - వందనంబులతో ।నిరుపమానవిలాస-నియతిసేవించి ।

భువిని(శ్రీ)యినగంటి-పున్నయ్యదాసు । కవనమల్లినతత్వ-గానంబుబాడి ।

భవరహితుడౌ పాటి-బండ్ల వీరగురు । సువిచార వేదాంత-సూత్రంబెరుంగ ।

వరలువీరోజిఋషి-వరుపాదమాన । తిరిగియిక రాబోరు - మరలజన్మలకు ।

యీతత్వరాజంబు - నెవరుజదివినను । పాతకంబులు దొలగి - ఫలము సమకూరు ।

ఇదిసత్యమిది సత్యమిది సత్యమమ్మ । పదిలంబుగా దాచి పఠియించరమ్మ.

౧౪. లతాంగి రాగము - ఆదితాళము

జనులార యే మండయా । మనపూరుజేర । అనుమాన మేమండయా ॥

పనిబూని మీరిటకు-వచ్చినదెందుకు ।తినితిరుగుచున్నారు-కనుగానకున్నారు ॥జ॥

పడవెళ్ళిపోతుందయా । యికతిరిగిరాదు । తడవేల యెక్కుండయా ।

వడిగా గడియకు మూడు - వంద లరవైమైళ్లు। గడువుగ పోతుంది - గడబిడ జేస్తుంది ।జ॥

యిది యేమి చిత్రంబయా । చెప్పినవినరు ॥ న ది యె ట్లు దాటేరయా ।

విధిగా యిరవైయొక్క - వెయ్యారునూరైన్నెళ్ళు-పదిలంబు గారోజు - పడవా నడిపించాల ॥జ॥

మరి మనమందరము । ఒకయూరినుండి। తరలివచ్చినారము। తరచి తరచి మిమ్ము - త్వరపెట్టుచున్నాము । పొరుగూరు వారిని - తరుచుగ బిలవాము ॥జ॥

మాదేమి బోయింది లే । మీ వారితోటి । మాకేమి రాబోదులే ।

రావలచితే రండి । లేదా మరి చెప్పండి । మీదారి మీ దేను । మాదారి మా దేను ॥జ॥

ధ ర వీ ర గు రు వాజ్ఞ ను । యినగంటి వున్నయ । దాసు విన్నందునను ।

మరిమరి మిమ్ముల । మర్యాదజేస్తిమి । తరువాతపైమాట దైవానికే యెరుక ॥జ॥

౧౫. బిలహరిరాగము - అటతాళము

ఏమిజెప్పుదు శిష్యుడా । నిర్గుణబ్రహ్మం । బిదుగో చూడుము శిష్యుడా ।

తామరసగర్భత్రివిక్రమ ।వామదేవుల కందరాకను । నామ రూపములొందక పరం –ధామమై నిష్కామమైనది ॥ఏ॥

గర్వాగర్వములేనిది । సర్వముతానై । నిర్వాణపారంబైనది నిర్వికార నిరావరణమై – నిర్విశేష నిరంజనంబై । నిర్వివాదనిరామయంబై । నిర్విచార నిరీహమైనది ॥ఏ॥

గ మ నా గ మ న ము లే ని ది । నిత్యమై వర్ణా । శ్రమ ధర్మములుగానిది ।

అమలమై యపరోక్షమై యా । ద్యంతర హితంబై యమితమై । అమృతమై పరిపూర్ణమై యే । శ్రమ లెరుంగక నిలచి యున్నది ॥ఏ॥

వింతచింతలు లేనిది । సంతతమై య ।త్యంతానంతంబైనది । వంత లెన్న । డెరుంగకే యా – వంతయేని కొంతగాక ని । రంతరము విశ్రాంతిలేక న – భోంతరాళము నిండియున్నది ।ఏ॥

అందచందము లేనిది । శాశ్వతమగుచు । బంధమోక్షము గానిది ।

యెందరెందరో యెన్నివిధముల । నెందుజూచిన నందుతానై అందకను పొందకను చెందక – సందులేక వసించియున్నది ॥ఏ॥
ఎరుకమరుపులు లేనిది । పీరోజిఋషీ । శ్వరుని భావంబైనది । ధరణి శ్రీయినగంటివున్నయ–దాసపోషిత పీరగురు హృ । త్సరసిజాంతర నిలయమైనవి – స్సార వేదాంతార్థమైనది ॥ఏ॥

౧౮. వరాళిరాగము - ఆదితాళము

వేదముజదివిన పండితులారా।వాదము జేయుచు కాలముగడుపక।
వేదాంతార్థం బేమోదీనికి । వివరము జెప్పండీ ॥వే॥
అరవై రెండ్లు నూటముప్పై । ఆరు తొమ్ముదు లేబదియారు।
అరవై సార్లు లెక్కవేసి । గురుతుజెప్పండీ ॥వే॥
పేరులేని యూరిలోన । వేరులేని చెట్టుమీద ॥
నోరులేని చిలుకజేరిన । తీరు జెప్పండీ ॥వే॥
భర్తలేని చిన్నదానికి । ప్రాణములేని బిడ్డబుట్టి ।
కర్తయై భూమండలమేలిన । గతము జెప్పండీ ॥వే॥
తల్లిదండ్రి లేనిపిల్ల । తావులేని చోటబుట్టి।
పిల్లిగొమ్ము చేతబట్టిన । విధము జెప్పండీ ॥వే॥
మట్టిలేని భూమిలోన । పుట్టని పెరుగని పురుషుడొకడు ।
దిట్టముగను దాగియున్న । గుట్టు జెప్పండీ ॥వే॥
ఏవిధముననో సారముదీసి । యేడునెలలకు భావముజెప్పి ।
భావముజెప్పిన యేడేండ్లకు తా । త్పర్యము జెప్పండీ ॥వే॥
తరచితరచి పరిశోధించి । మరుగుబయలు పడకయున్న ।
ధరణి శ్రీ యినగంటి పున్నయ । దాసు నడుగండీ ॥వే॥
పాటిబండ్ల వీరగురుడు । భావము విడదీసితెల్పిన ।
సూటియౌ పీరోజి ఋషివరు । సూత్రమౌనండీ ॥వే॥

౧౯. సింహేంద్రమధ్యమ రాగము - అటతాళము

ఏలమీ మానవజన్మమెత్తినందుకు మోక్ష । ఫలముజెందేడి
దారి జూడండయా ॥

తోలకరి మెరుపుల - వలె నమ్మకము లేని । కలిమిపై గల
భ్రాంతి - వీడండయా ॥ఎ॥

ఉర్వి మతముల పేర-యొకరితో వేరొకరు । యూరక వాదించ -
ఫలమేమయా ।

సర్వమతములలోన - సారంబు దీసిన।స్వామియొక డున్నాడు-
తెలియండయా ॥ఎ॥

కుల గోత్రముల నెంచి- కలహించు చుందురు - ఫలితమే ము
న్నదో తెలుపండయా ॥

ఇల జనులందరు - తలిదండ్రి వలపున - గలిగిన వారని
తెలియండయా ॥ఎ॥

తరుచుగ వ్యాకరణ - తర్క శాస్త్రంబులు । తరచి చదివిన
లాభ - మే మండయా ।

మరణము జెందెడి - తరుణము గుర్తించు । మర్మ మెరిగిన
చదువు - జదువండయా ॥ఎ॥

భువిని (శ్రీ) యినగంటి - పున్నయ్య దాసుని - బోధారసంబు
గ్రో - హించండయా ।

భవ రహితుడౌ పాటి - బండ్ల వీరయగురుని - భావంబు
దెలిసి తరించండయా ॥ఎ॥

వీరోజి గురువరుని - జేరి షోడశిమంత్ర - సారార్థమును గమ
నించండయా ।

శౌరి శేషయగురుని - జేరి ద్వాదశిమంత్ర । సారంబుచే ముక్తి
గాంచండయా॥

రహితలక్ష్మణాచార్య – రంగరాజాచార్య – రాజమార్గంబున నడువండయా ॥

సహజ పరిపూర్ణ వి – స్తార సారోప ని । షద్బ్రహ్మ పథమున నిలువండయా ॥వి॥

౧౮. జంఝూటి రాగము - అటతాళము

ఎంతో బ్రహ్మానందము - నా గురుబోధ । ఎంతో బ్రహ్మానందము ॥ఎం॥

అంతరంగమునందు – చింతలణంచిన । సంతసామృత భాండము । నా గురుబోధ । ఎంతో బ్రహ్మానందము ॥ఎం॥

పంచాక్షరిని ప్రసా – దించి భవబంధము । ద్రుంచిన వర మార్గము । నాగురుబోధ । ఎంతో బ్రహ్మానందము ॥ఎం॥

తారకబ్రహ్మ సం - దర్శనమిడి పరి । తాపమార్చిన సారము । నా గురుబోధ । ఎంతో బ్రహ్మానందము ॥ఎం॥

వరమహావాక్యార్థ – సరణి దెల్పియు పరా । త్పరుని జూపిన సూత్రము । నా గురుబోధ । ఎంతో బ్రహ్మానందము ॥ఎం॥

పరిపూర్ణభావాను – భవ నిశ్చయముగల । తిరిగిరాని విచిత్రము । నా గురుబోధ । ఎంతో బ్రహ్మానందము ॥ఎం॥

భువిని శ్రీ యినగంటి పున్నయ్య దాసుని । శివజీవైక్య విలాసము । నా గురుబోధ । ఎంతో బ్రహ్మానందము ॥ఎం॥

రహి పాటిబండ్ల వీరయ దేశికేంద్రుని । సహజ బ్రహ్మా
నందము । నా గురుబోధ । ఎంతో బ్రహ్మానందము ॥ఎం॥

౧౯. ముఖారి రాగము - ఆదితాళము

గురుడే బ్రహ్మ - గురుడే విష్ణు । గురుడే మహేశ్వరుడు
మరియు - గురుడే సాక్షాత్పరబ్రహ్మ ॥గురు॥

గురునికంటే దైవము వే - రరయగా నెచ్చటను లేడు ।
నిరుపమాన నిర్వికార నిర్విచారంబై వెలింగిన ॥గు॥

జ్ఞానానంద మయమునందు - లేనిపోని భ్రాంతి గలిగి । తానే
జీవత్వంబు వహియించి । పలుమారు బహుళం । బైన యోనుల
యందు జన్మించి । అతిశయసంచిత । మైనకర్మజాలము గడించి।
ప్రారబ్ధసంయుత । మైన దుఃఖంబులను గృశియించి । దరిగాన
లేక । దీనులై యత్యంధకార - మైన సంసారమున నున్న ।
మానవానీకమునకు జ్ఞాన - మార్గమిడి తరియింప జేసిన ॥గు॥

తారకసాంఖ్య మనస్క । సారము వెదజల్లి రేచక।పూరక
కుంభకములొదిగించి అరిషడ్వర్గముల । వేరుతో మొదలంట
బెకలించి । సప్త వ్యసనముల । దూరమేగునట్లు విదళించి ।
అష్టమదములను । పేరులేనితీరునను ద్రుంచి । వరయోగి హృ
దయ । సారసదళాంతర వి - హారమై భవబందక ని । వారమై
యలరారు జగదా - ధారమును కను - లార జూపిన ॥గు॥

కుదురుగా గూర్చుండబెట్టి । ఇదమిద్ధంబని శ్రుతివాక్యముల।
జదివి సిద్ధాంతములు గావించి । త్రిగుణముల వివరము । విదిత
ముగ చర్చించి బోధించి।సాధన చతుష్టయ । విధిని విపులముగా
ప్రసాదించి । పంచకోశముల । పదిలముగ విభజించి చూపించి ।

మమకారమణచి । సదమల పరిపూర్ణమైన - స్వప్రకాశానంద మయమహా । పదవి నందజేసి మోక్ష-పథ మలంకరింపజేసిన ॥గు॥

ధరజీవనపావకసమీరాం । బరము లిరువదియైదువిధముల । తిరిగిమరలినసందియముదీర్చి । ఊర్ధ్వకుండలిని।జరిపెడియోగము నకడ తేర్చి । భ్రూమధ్యస్థలాం। తరవిలాసాద్భుతము సమకూర్చి సహస్ర దళయుత । సరసిజాంతర్బిలమునకుదూర్చి । బయలందు జేర్చి । ధరణి శ్రీయినగంటి పున్నయ । దాసమానసరాజవీధిని। స్థిరముగానివసించి వీరయ । దేశికేంద్రుండై చెలంగిన ॥గు॥

౨౦. భైరవిరాగము-అటతాళము

గురురాయ నిను నేను - కోరి భజింపక ॥గు॥

తిరుగ ఫలిత మేమి - దొరుకదు సత్యము ॥గు॥

దీనులబోషింప - దిక్కెవ్వరున్నారు। ఆనందమయుడవై - అలరు నీవేగాక ।

జ్ఞానా జ్ఞాన విధాన - మైన ధర్మముదెల్పి । మానసాంత ర్గత - మైన చింతలుదీర్చే ॥గు॥

వరమహావాక్యార్థములను - తరచి తరచి బోధజేసి ।
నిరుపమానంబైన పరా - త్పరము జూపించి ।
మరల జన్మంబునకు రాని - మరుగుదెల్పి తరింపజేసి ।
ధరణి శ్రీయినగంటిపున్నయ దాసునేలిన వీరయార్యా ॥గు॥

౨౧. మధ్యమావతిరాగము - ఆదితాళము

గురునిస్నానము దీర్చిరమ్మ । పూబోణులారా । నరుల కందరికి దొరుకదమ్మా ॥గు॥

కరముల కంకణములు - ఘల్లు ఘల్లున మ్రోయగ ।

వరుసగ బారులుదీరిన – వరనారీమణులుకొందరు ॥గు॥

చెంగావిరంగు చీరలుగట్టి । జలతారుమొగ్గలు । రంగారు పట్టు రవికెలుదొడిగి । వంగపండునుమించిన–వన్నెపైటలువేసి॥
సింగారములుమీరిన – అంగనామణులు కొందరు ॥గు॥

సిందూరతిలకములనుబెట్టి । పుష్యరాగములుజేర్చిన కెంపుల కమ్మలుబెట్టి ।
పొందుగ కుందనంపు । మొలనూళ్లు బిగియగట్టి ।
అందచందములు మించిన । సుందరీమణులు కొందరు ॥గు॥

మెరుగుబంగారు పువ్వులుగూర్చి । తళతళలాడి । మెరయు రత్నాలపీఠము జేర్చి ।
గురుసార్వభౌమేంద్రుని । కోరి కూర్చుండబెట్టి ॥
కురులు ముడివీడజేసి । పరమానందము జెంది ॥గు॥

పగడంపు వెండిగిన్నెలలోన । యున్న గులాబీ । అగరు సంపెంగ తైలములను ।
సొగసుగా శిరమున కద్ది । చోద్యమలరగ రుద్ది ।
మగువలందరు వరుసగ । మార్పులు జేసికొనుచు ॥గు॥

ఘనమగు ముత్యాలుదాపియున్న । నిగనిగలాడు । గాజు పళ్ళెరములలోనున్న ।
అనువొందు రకరకముల । దనరారు పిండిదినుసులు ।
పునుగు జవ్వాజి యొంటికి । బూసి నలుగులుబెట్టి ॥గు॥

గంగభీమ రథితామ్రపర్ణి । సరస్వతి యమున । కావేరి కృష్ణ సింధు సరయు ।
తుంగభద్ర గోదావరి । గంగ లమరిన బంగరు।

గంగాళముల నీరు । పొంగి పొరలగబోసి ॥గు॥

తడియార్చి నూతన వస్త్రముదెచ్చి । అదికట్టబెట్టి । కడు వేడ్క పట్టునేల్వ గప్పి ।

ముడిగొన్న కురులచిక్కు । విడిగ విడిగదీసి ।

తడయక తాంబూలములు । దక్షిణలర్పణజేసి ॥గు॥

సదమలమైన పూలచెండ్లు । మెడనిండవేసి । సుదతులందరు సంతసించి ।

నుదుట కస్తురిచుక్క । కుదురుగదిద్ది అగరు ।

చిదిపిధూపమువేసి చెలొందు హారతులిచ్చి ॥గు॥

ధరణి యినగంటి పున్నయదాసు । తత్వములు జదివి । వర పాటిబండ్ల వీరగురుని

స్మరియించి గురువరునకు । సాష్టాంగ వందనములు । పరమ భక్తితో జేసి । తరియించే ఫలముగాంచి ॥గు॥

౨౨. లతాంగిరాగము - ఆదితాళము

మంగళం జ్ఞానానంద – మయుడౌ పరబ్రహ్మమునకు
మంగళం కోటిసూర్య స - మాన తేజునకు ॥మం॥
నాల్గు వర్ణములు గల్గిన – నాల్గు రేకుల కమలమందు ।
వెల్గుచున్న గణపతికెని - విభవ మంగళం ॥మం॥
ఆరువర్ణములు గల్గిన – ఆరు రేకుల కమలమందు ।
ధీరుడై నిలచిన బ్రహ్మకు - దివ్యమంగళం ॥మం॥
పదివర్ణములు గల్గియుండిన – పది రేకుల కమలమందు ।
సదయుడైన విష్ణుమూర్తికి – సౌఖ్య మంగళం ॥మం॥
ద్వాదశ వర్ణములు గల్గిన – ద్వాదశ దళకమలమందు ।

ఆధారుండై యున్న శివునకు - అక్షయ మంగళం ॥మం॥
షోడశ వర్ణములు గల్గిన - షోడశ దళ కమలమందు ।
ఆడుచున్న జీవునకును - పూర్ణ మంగళం ॥మం॥
రెండు వర్ణములు గల్గిన - రెండు రేకుల కమలమందు ।
దండిగా వెలుగొందు ఆత్మకు - ధన్య మంగళం ॥మం॥
శ్రీయుతంబై యలరుచున్న - వేయిరేకుల కమలమందు ।
స్థాయిగా నెలకొన్న గురునకు - జయమంగళం ॥మం॥
ధరణి శ్రీ యినగంటి పున్నయ - దాసమానసరాజవీధిని ।
స్థిరుడై యున్న వీరగురునకు - దివ్యమంగళం ॥మం॥
భాసురంబుగ వీరోజిఋషీ - శ్వరుని హృదయ పద్మాంతరని ।
వాసుడైన శేషగురునకు - భవ్యమంగళం ॥మం॥
వరలు లక్ష్మణార్యగురుని - గురుడౌ రంగరాజ గురుని ।
గురుడౌ ఉపనిషద్బ్రహ్మకును - కుశల మంగళం ॥మం॥

౨౩. బారువ రాగము - జుల్వతాళము

మేలుకొనవేమే । ఓ మనసా । మేలుకొనవేమే॥
మేలుకొనవే క్రూరవిషయ - లోలతను విడచి । శుభముగా ॥మే॥
శుక్తిరజత భ్రాంతియారతి సుఖములను విడచి । శుభముగా ॥మే॥
స్థాణుపురుష భ్రాంతియా సం-తానమును విడచి । శుభముగా ॥మే॥
రజ్జుసర్పభ్రాంతియా ధన-రాసులను విడచి । శుభముగా ॥మే॥
నిద్రదివవిభ్రాంతియా పర - నిందలను విడచి । శుభముగా ॥మే॥
మరుమరీచిక భ్రాంతియాదు-ర్మదములను విడచి । శుభముగా ॥మే॥
ధరణిశ్రీ యినగంటి పున్నయ-దాసు బోధవిని । శుభముగా ॥మే॥
వరలు పాటిబండ్ల వీరయ - గురుని భజియించి । శుభముగా ॥మే॥

సంపూర్ణము.

ఉ॥ బాలరసాలసాల నవ,పల్లవకోమల కావ్యకన్యకన్
గూళలకీయనంచు మును,కోవిదవర్యుఁడు పోతరాజు పే
రోలగమందుజాటిన మ,హోక్తినవారిత భక్తితోడనేఁ
దాలిచిమస్తకాన కయి,తంబులునీవయిఁగూర్తు మాధవా॥

ఉ॥ చేతిని దాళమూని యొక, చేతను దంబురఁబట్టి భక్తితోఁ
బాతరలాఁచున్ గులుకు, పాటలఁబాడుచుసొక్కఁజేయఁగా
నాతరమా యతీంద్రుఁడగు నారదమౌనికిఁ జెల్లు నేనయో
పాతకుఁడన్ విమూఢుఁడను, పామరుఁడన్ గరుణించు మాధవా।

ఉ॥ చుక్కలుచందమామరవి, శూలిపితామహుఁ డాకసంబు పెం
పెక్కఁజలించువాయువుమ, హీస్థలినీరమువీతిహోత్రుఁడున్
రక్కసి మూఁకలున్ విబుధ, రాజనగంబులు లేనినాఁడు నీ
వొక్కఁడవెట్టులుంటివో మ, హోజ్జ్వలరూపుఁడవైర మాధవా॥

ఉ॥ ఓపురుషాగ్రణీ! విలసి,తోరగరాజశయాన శౌరి స
ర్వాపదరాతిమానివ్రాద, యాంబుజభృంగశుభాంగభక్తసం
తాపవినాశ దుర్మతవి,దార కరీంద్రవిచార కాననో
ద్దీపిత వీతిహోత్ర నగ,ధీర పవిత్రచరిత్ర మాధవా॥ ౩౨

ఉ॥ వారినివల్వలన్ విడచి, వారిజనేత్రలు హేమసుందరా
కారిణు లందగత్తెలు వి,కాసముఖుల్ గజగాములోయనన్
గేరెడి గొల్లజవ్వనలు, క్రీడలు సల్పుచునుండఁ గట్టుపైఁ
జీరెలు దొంగలించిన వి,శేషమదేమొయెఱుంగ మాధవా॥

ఉ॥ సారవిహీనమైన భవ,సాగరమందు మునింగి తేలఁగా
నేరుపులేక మానసము,నీరసమై గృశియించుచుండె వి
స్తార యశోవిలాస వరి,తాపము మాన్పెడి వాఁడవీవెగా
కేరుగలారునాకు తెర,వెయ్యది శీఘ్రమె ప్రోవు మాధవా॥

ఉ॥ సమ్మతిలేనివారు పలు,శాస్త్రములన్ దిలకించి వానిసా
రమ్ముఁ గనంగలేక తమ,ప్రజ్ఞలె ముఖ్యముగాఁగనెంచి భే
దమ్ములఁ జెప్పఁజేసెడి మ,తమ్ముల చర్చలుసల్పి నీదుపా
దమ్ములఁగొల్వనేర్చెడి వి,ధమ్ముగ్రహించరు శ్రీరమాధవా॥

ఉ॥ సౌరము వీర శైవమును,శైవము ద్వైతము సాంఖ్య భావమున్
భైరవ వల్లభాద్వయిత,వార్తిక తార్కిక బౌద్ధజైనముల్
సారము గ్రోలువారలకు,చాటుచు నుండును నీదుపాదమం
దారమరందపానము వి,నా గతిలేదని శ్రీరమాధవా॥ 38

ఉ॥ లాలనుబోసి తల్లి కను,లన్ నును కాటుకదిద్ది ప్రేమతో
పాలనొసంగి జోలయని,పాటల పాడుచు చందనంబుతో
ఫాలమలంకరించి యొక,పక్కనమర్చి పసందుమీర ను
య్యాలలనూఁపు బాల్యమక,టానినుగొల్వదు శ్రీరమాధవా॥

ఉ॥ కూరిమితోడ కుఱ్ఱలను,గూడి చరించుచుఁ జీట్లపేకలున్
బారులు బంతు లీతలును,వామనగుంటలుగోలుగాయలున్
ధారుణికుందుగుంటులును,దాగిలిమూతల నాడుచుండు కౌ
మారమునీదుధ్యానమును,మాత్రము సేయదు శ్రీరమాధవా॥

ఉ॥ చందనగంధమున్ పునుగు,సన్నజాజులు మల్లెమొగ్గలున్
పందిరిమంచముల్ తళుకు,బంగరుసొమ్ములుపట్టుచేల్వలున్
సుందరమందగామినుల,చుట్టరికంబులు గోరిమోహముల్
జెందెదవా యౌవనంబు నిను,జేరగనీదుగద రామాధవా॥ ౩౯

ఉ॥ కోడలు గొట్టఁగూతురతి,కోపముఁ జెందఁగుమారుఁడేవ పో
రాడగభార్యక్రూరవృత్తి,యన్ గృశియించుచునుండిలోకమున్
జూడగగన్నులేక చెవి,జొచ్చకమాటలుదంతమూడ న
ల్లాడెదువృద్ధకాలమక,టా నిను గొల్వగనీదు మాధవా॥ ౪౦

ఉ॥ చీరెలులేవు కట్టుకొనఁ,జెంబులులేవు కుమార్తెకీయ సం
బారములేదు కూరలకు,బంగరుగాజులులేవు చేతులన్
బోని లాభమేమిఁకను,బోయెద నాతండ్రియింటికం
చారడిఁబెట్టుభార్య యవు,రా నిను వేడఁగనీదుమాధవా॥ ౪౧

ఉ॥ కోడెలు గేదెలావులును, గొఱ్ఱెలుచేలు మెఱుంగునీకు మా
రాడకమార్చిపంచుమన,యమ్మకు నాలుగు రోజులెక్కువే
కూడిడినాము నీదు సతి,కొంచెముమాస్థలమూడ్చెనంచు బో
రాడెడిసోదరుల్ తమ పదాబ్జములన్ గననీరు మాధవా॥ ౪౨

ఉ॥ నీటురుమాలలున్ పసిడి,నీటి నలందిన కుచ్చుటోపి బల్
ధాటిఁజెలంగుచేల్వలు క,శావరు యుంగరముల్ బనార్సులాం
కోటులొసంగలేదనుచు,గొన్గడి యల్కలమారి యల్లుఁడే
నాఁటికిఁగూడ నిన్ను శర,ణంబననీఁడుగద రామాధవా॥ ౪౩

ఉ॥ చల్ల పెరుంగుపాలు తరి,సన్ననిబియ్యము పైడితీగె
నల్లిననాను కంటె కడి,యంబులు కాసులు దోచికన్న వా
రిల్లు నుగుల్లజేసి తన,కేమియులేదని వీధివారితో
నల్లరిఁజేయు చెల్లె లవు,రా నినువేడఁగనీదు మాధవా॥ ౪౪

ఉ॥ బొమ్మలు కాగితంబులును,పుస్తకముల్ బలపాలుపల్కలుఁ
సొమ్ములుకానులడ్డములు,సూదులు సబ్బులు జీడిపప్పు పా
కమ్ములుగాక వెన్నెలను,గాయుచునుండెడి చందమామ నే
డెమ్మని పోరుబిడ్డలు మ,దిన్ నినునమ్మఁగనీరుమాధవా॥ ౪౫

ఉ॥ విత్తనముల్ విదల్చి తడి,వేమఱుగట్టి హొయల్ చెలంగ పెం
పెత్తిననారుదీసి బల,మెక్కిన మళ్లనునాటి కల్పనే
చెత్తనుదీసి గట్లనిడి,చేలను పైరునుగోసి నూర్చి వ
డ్లెత్తుకపోవుసేద్య మరె,రే నినుగొల్వదుశ్రీరమాధవా॥ ౪౬

ఉ॥ గ్రామములఁ జరించి సెన,గల్ ధనియాల్ పొగాకుమిర్చి యా
సాములయొద్దచౌకఁగొని, క్షామముఁగోరి గిరాకిఁజూచి కో
స్తామునిషీలకమ్మకము,సల్పిపదింతలు లాభ మొందు మా
రాముడిబేరమెట్లునిను,ప్రార్థనసేయఁగనిచ్చుమాధవా॥ ౪౭

ఉ॥ భోగములన్ మరంగి వెఱ,పుఁగడుదూరము జేసిసత్యముఁ
త్యాగమొనర్చి జీతమెప్ర,ధానముగా గమనించి నేర్పుతో
కాగితముల్ లిఖించియొక,కాసుమొదల్ పదివేలుగూర్చు ను
ద్యోగమునిన్నుజేరగల,యుక్తిగ్రహించదుశ్రీరమాధవా॥ ౪౮

ఉ॥ రంగదనంగ సంఘటిత,రాజితనిర్ఝరిణీ చటచ్ఛటా
భంగతరంగ ఘోషలను,వారియవారితకీర్తిఁ జొచ్చినన్
పొంగకనిల్చి భోరుమని,మ్రోగెడి సంభ్రమభ్రాంతి బాధ తె
బ్బంగిఘటిల్లినన్ విడక,ప్రార్థనజేసెద నిన్ను మాధవా॥ ౪౯

ఉ॥ గాలియడంగిపోయిన న,గంబులు గ్రుంగిన నిప్పుచల్లగాఁ
గ్రాలినఁ జుక్కలూడిన జ,గంబు లదృశ్యములైన నీవొకే
లీలవికారమొందక వి,లీనముఁ జెందక శాశ్వతంబుగా
కాలములన్నిటన్ నిలిచి,కాపురముందువు శ్రీరమాధవా॥ ౫౦

ఉ॥ భూరితరప్రభావ పరి,పోషిత భూషితమా త్వదీయ వి
స్తారకటాక్ష వీక్షణ శ,తంబను నావ యొసంగకున్నచోఁ
గ్రూరభుజంగదంత విష,క్షుంభిత ఘోరపిశాచరూప సం
సారమహాబ్ధి దాటఁగ వ,శంబె విధాతృనకైన మాధవా॥ ౫౧

ఉ॥ శాత్రవసైన్యమధ్యమున,స్యందనమాపి ప్రశాంతచిత్తుఁడై
పుత్ర సుమిత్ర భ్రాతృ గురు,పుంగవులన్ దిలకించి దీనతన్
శస్త్రముమాని భీతిలి వి,చారముఁ జెందిన క్రీడికిన్ కురు
క్షేత్రమునందు గీతలు వ,చించిన దేశికవర్య మాధవా॥ ౫౨

ఉ॥ ఎట్లుగుణత్రయంబు సృజి,యించితొ నిర్గుణమూర్తివై జగం
బెట్లు త్వదీయకుక్షిని వ,హించితివో గద నిర్వికారివై
యెట్లు దశావతారముల,నెత్తితివొక్కొ నిరంజనుండవై
యెట్లుమదీయపాపముల,నన్నక ప్రోతువొ శ్రీరమాధవా॥

ఉ॥ పోడిమి మీరఁ శయ్యలగు, ముల్ గమకంబులు ప్రాసలర్థముల్
గూడి రసంబు గల్గు పద, గుచ్ఛములల్లఁగ లేని యీతఁ డె
వ్వాఁడు లిఖింప గ్రంథమని, బల్కక నా కలమందు తాండవం
బాడుము దంధణంధణ ధ, ణారవముల్ జెలఁగొంద మాధవా॥

ఉ॥ శారద చంద్రికాజనిత, సారము గ్రోలు చకోరకంబు నీ
పేరరసంబు గ్రావఁగల, దా శుక శౌనక పుండరీక సా
మీరి విభీషణాదులు ర, మించి తరించిన నీదు నామ మం
దార మరందమాన కెటు, నా మనమన్యముఁ గోరు మాధవా॥

ఉ॥ నీటగు గాయనీమణుల, నృత్య విలాసము సన్నజాజి పూఁ
దోటల తాఘుమంఘుమలు, తోయజనేత్రలతోడి కుల్కు స
య్యాటలు కప్పురంపు విడి, యంబులు చందన లేపనంబు నా
కేటికి నీ దయారస మొ, కింత స్రవింపఁగఁ జేయు మాధవా॥ ౫౬

ఉ॥ భారము లేక నే విషయ, వాజిఖలీనములన్ బిగించి యే
దారిని లాఁగ నీక సుప, థంబున స్వారి నిదీయు విద్య నే
నేరువ లేదు నీదు పద, నీరజముల్ నెరనమ్మి యన్యమున్
జేరనిశక్తి నాకొసఁగి, శీఘ్రము ప్రోవుము శ్రీరమాధవా॥ ౫౭

ఉ॥ సొంపుదలిర్ప కోయిలకి, శోరము తియ్యని కూత గూయఁగాఁ
జూపఁదలంచు వాయసము, చాడ్పున నా మనమన్య మేమి యా
సింపక నిన్ గనన్ దలఁచి, సేవకుఁ బూనెడి వేళలందు వా
రింపఁగరాని నిద్ర ముసి, రించు నిదేటి యవస్థ మాధవా॥ ౫౮

ఉ॥ ద్రౌపదిఁ బ్రోచి రాతినొక, తన్విగఁ జేసి కిరీటిఘోరసం
తాపము సంహరించి కరి,నాథునిఁ గాచి కుచేలు నేలి సాం
దీపునిపుత్రుఁ గాచి, దీనుఁడనై విలపించుచున్న నా
పాపముఁ బాపకున్న నగు, బాటగుఁ గాదె శరి శ్రీమాధవా॥ ౯౯

ఉ॥ మారుతమెట్లుపుట్టెడిదు, మారము రేపు నొకింతమిన్న నుట్టనా
నేకములట్లె భిన్నమయి, నింగి తెరంగున శూన్యమొందు సం
హారముఁ జేయకున్న నణు, మాత్రముసైపను సుమ్మినాదు హృ
త్సారసమందు నీపదము, సంకెలివైచి బిగింతు మాధవా॥ ౬౦

ఉ॥ అందమొసంగు కెంజిగురు, టాకులఁ గేరెడి పాదముల్ కుచుల్
పొందిన జాళువా తళుకు, పుట్టము నాల్గుభుజంబు లిందిరా
సుందరి గల్గువక్షమును, సొంపొనగూర్చెడి నల్లచాయ నీ
వెందున డాగినన్ గురుతు, లింకెటు పోయెదవయ్య మాధవా॥

ఉ॥ సారములై ఖిలాళికి వి,చారములై యనిమేషకోటి కా
ధారములై ప్రదోషక వి,దారములై దనుజేంద్రబృంద సం
హారములై సుమానసవి,హారములై యసమానకీర్తి వి
స్తారములైన నీదుచరి,తల్ వినఁ గోరికగల్గె మాధవా॥ ౬౨

ఉ॥ మానసమందు లోకపరి,మాణము భారముగాఁగఁ దోఁచి ని
ర్యాణముఁ జేసి నీవుమహా,దంబర చుంబిచటచ్ఛటచ్ఛట
ధ్వానముహుర్ముహుర్లుఠద,భంగతరంగ పయఃపయోధి నే
పానువుగా గ్రహింతువట, పన్నగతల్పము వీడి మాధవా॥ ౬౩

ఉ॥ కుక్కనుకొండగొఱ్ఱియను,గోతినిగార్ధభమున్ వరాహమున్
నక్కనుగొక్కెరన్ పశుగ,ణంబుల ముట్టి మనుష్యజాతిఁగో
నొక్కఁడుగాజనించియు మ,హాపకృతిన్ ఘటియించుపంచమున్
వెక్కసమూని తాకరిది,వింత భరింపనిచింత మాధవా॥ ౬౪

ఉ॥ త్రాగనుగంజిలేక మెయి,దాల్చగవస్త్రములేక ఘోరమా
రోగముచేతగుందిన బ,రుండను మంచములేక నూరిలో
కేగిన నంటుదోసమున,హీననొందెడు పంచముం డయో
యేగతిజీవయాత్ర భరి,యించునొ నీవెవచించుమాధవా॥

ఉ॥ రెక్కలుముక్కలౌనటుల,రేయిబవల్ శ్రమజేసిరొక్కమున్
బొక్కసమందునింపి యతి,భోగులజేసి నుతించు పంచమున్
గుక్కలకన్న నెక్కువగ,గొట్టెద రావలికేగుమంచయో
దిక్కుదివాసిలేని జగ,తిన్ సృజయించితివేలమాధవా ॥౬౬

ఉ॥ లోకములోన జన్మముల,లో నరజన్మము శ్రేష్ఠమంచు తా
టాకులలోనవ్రాసిన మ,హాత్ముల వ్రాతల ద్రోసిపుచ్చి చీ
కాకొనరించు బూటకపు,గాథలునమ్మిన కారణంబుచే
కాకులకన్ననీచముగ,గాంతురుపంచములిన్ రమాధవా॥౬౭

ఉ॥ నాలుగువత్సరంబులయి,నన్ బరిపూర్తిగలేని కూనయా
బాలికయేడ్చుచుండగ వి,వాహముజేసి మగండు వెంటనే
కాలునిజేర నాపె కల,కాలముదుఃఖముఁ జెందుచున్న యా
గోలకు గుండెఝల్లురన,కుండునె మూఢునకైన మాధవా॥

ఉ॥ మానవతీమణుల్ జదువ, మంచిదిగాదట స్త్రీరజస్వలే
యైనవివాహమున్ సలుప, న్యాయముగాదట చేడెఛత్రమున్
బూనఁగ గొప్పదోసమట, ముండ్లయినన్ సరె పాదరక్షలన్
మానిని దాల్చ నేరమట, మాయలమారివిఘుల్ రమాధవా॥

ఉ॥ భార్యలు నల్వురుండిన వివాహవు టర్హత పూరుషాళికీ
చర్య సతీజనావళికి, చట్టములేక మగండు చచ్చినన్
కార్యము వేరె లేదనెడు, కర్ణకఠోరవు వాక్యజాలమే
యార్యుఁడుపల్కె ప్రేమమది, యందణుమాత్రము లేక మాధవా॥

ఉ॥ మానవులైన స్త్రీలకు సమానవు స్వేచ్ఛయొసంగకే సభా
స్థానములందుఁ దావిడక, సజ్జనబృందము చేయు ప్రార్థనల్
గానగఁ కప్రాయ్యపోగ, కన్నులఁ జొచ్చి ప్రయాస మొందఁగా
బోనులనుంచు సింహముల, పోలికనుంచెద రేమి మాధవా॥౭౧

ఉ॥ శీవిదలిర్సు శాస్త్రము గణించి లిఖించెను గ్రంథరాజ లీ
లావతి దేవహూతి యబలల్ చదువుల్ చదువంగ రాదనే
భావము సిగ్గుచేటగు ప్రపంచమునన్ గళలన్ని శారదా
దేవియధీనమందు గల, తీరు గ్రహించిన శ్రీరమాధవా॥ ౭౨

ఉ॥ పుత్రుఁడు బావితోట చెరువున్ గృతిసత్రము దేవగేహమీ
ధాత్రిని బున్నెమిచ్చెడి విధమ్మున మానవజాతికెల్లెడన్
బాత్రమెరింగి బాలికకు భర్త గతించిన బెండ్లిసేయ స
త్పుత్రులుపౌత్రులున్ గలుగు, పున్నెముగల్గును శ్రీరమాధవా॥

ఉ॥ ప్రేమ రవంతలేక నిడు, భిక్షము భిక్షముఁగాదు రోగులన్
బాములబెట్టి డబ్బుగొను, వైద్యుఁడు వైద్యుఁడుఁగాఁడు దీనలా
భామల స్వేచ్ఛనోరువని, పత్రిక పత్రికగా దనాథలా
లేమల పెండ్లిగూడదను, లీడరు లీడరుగాడు మాధవా॥ ౭౪

ఉ॥ కోరికెదీర మంచి తళు, కుల్ బెళుకుల్‌గల మేల్మివన్నె బం
గారవుభూషణంబులు ని, గారపు కాలరుకోట్లుసూట్లు మో
టారులు వెండిగిన్నెలు వ, టంబులనీయఁగలేని బీదసం
సారికుమార్తె పెండ్లియగు, మార్గముగన్పడ దేమిమాధవా॥

ఉ॥ ప్రాయము జాలనట్టి పసి, బాలికలన్ దమతల్లిదండ్రులా
డాయముకై భ్రమించిస్మృతి, దప్పితుయన్ గృశియించిక్షీణతన్
కాయముఁగ్రుంగి మస్తకము, కంపముదాలిచి నేలపైఁబడన్
గాయములొందు వృద్ధులకుఁ, గట్టెద రేమితమాషమాధవా॥

ఉ॥ అక్రమపద్ధతుల్ దునిమి, న్యాయము స్థాపనజేయునట్టి నీ
చక్రముగాక వేఱెయొక, సాధనమున్నదె లోకమందు ని
ర్వక్రమఁలౌవిధానములు, రాజిలఁజేయఁగమున్ను రాక్షసుల్
శక్రుడుఁబోరు కాలమున, శాంతినిగూర్చఁగలేదె మాధవా॥

ఉ॥ కాకులుగోరువంకలు బ, కంబులు చిల్కలు చక్రవాకముల్
ఘూకము లూరబిచ్చుకలు, కోళ్లుచకోరకముల్ మయూరముల్
కోకిలముల్ కపోతములు, గువ్వలుమున్నగు పక్షిరాశి నీ
వేకరణిన్‌సృజించితివొ, యెవ్వరుజెప్పగలారుమాధవా॥ ౭౮

ఉ॥ కాకులుకొంగలౌచుశున,కంబులు మత్తగజంబులౌచు బెం
డాకులు తమ్ములౌచుకుజ,నాళి బుధావళియౌచు స్వప్నమం
దేకరణిఁ గనంబడున, దేవిధి దేవిధి నీజగమెల్ల మిథ్యయై
నీకువినా మరెద్దియును,నిల్వఁగఁజాలదు శ్రీరమాధవా॥౯౯

ఉ॥ పన్నగమెట్లు పాములను,బట్టెడువాని పాదాలసొంపుకై
గ్రన్ననమ్రోలజేరి పలు,కష్టములొందునొయట్లెతంత్రముల్
పన్నినగాథలన్ వినఁగఁ,బర్విడుఁగాని మదీయ కర్ణముల్
పున్నెపు నీకథల్ వినఁగ,బోవు జవంబున శ్రీరమాధవా॥౧౦౦

ఉ॥ సంపెంగపుష్పమందుగల,సారతరంబగు తావిభృంగమా
సింప వినాశమొందునటు,లింపగు నీపదపద్మగంధమా
సింపక నాదునాసికము,చెచ్చెరపోవు జవాజిపున్గు క
ప్రంపుసుగంధవాసనల,పైమమకారముచేత మాధవా॥ ౧౦౧

ఉ॥ పండనియగ్నిగాంచుశల,భంబులమాడ్కి మదీయనేత్రముల్
దండిప్రభుండవైన తమ,దర్శన సంపద గాంచలేక బల్
కండలక్రొవ్వులన్ దనరి,గబ్బిచనుంగవ గల్గునట్టి స్త్రీ
మండలివంకఁజూచునతి,మత్తతఁగ్రొవ్వి తెగించి మాధవా॥

ఉ॥ జాలరి గాలమందెరను,జంపిభుజింపఁదలంచి మత్స్యమా
గాలమునందుజిక్కి దరిఁ,గానక దుఃఖముఁ జెందునట్లు నా
నాలుక నీపవిత్రమగు,నామసుధారసమున్ గ్రహియింపకే
క్రోలును షడ్రసంబులను,కోరికతోడను శ్రీరమాధవా॥౧౦౩

ఉ॥ మత్తకరీంద్ర మొంటిగులమానగవృక్షము చెంతమ్యాహమా
యత్తము జేసియున్న నొక, యల్లిక పైఁజను దెంచి గుంటలో
తత్తరపాటుచేఁబడు వి,ధంబున నాదుశరీరమత్తరుల్
మొత్తుకొనున్ త్వదీయపద,మ్మొత్తికఁ గోరక శ్రీరమాధవా॥

ఉ॥ కమ్మని తెమ్మెరల్ సడల, గా వడగ్రుమ్మగ నుమ్మదమ్ము చే
చెమ్మట గ్రమ్మి యుమ్మి యొక, చిమ్ము ముఖమ్మున లేక నన్ని ప్రా
ణమ్ములుఁ దిమ్మరొందవ్యస, నమ్మధికమ్మయి సొమ్మసిల్లు గ్రీ
ష్మమ్మున మిమ్మునమ్మెడి క్ర, మమ్ము మనమ్మున లేదు మాధవా॥౧౫

ఉ॥ ఫెల్లున చల్లగాలి వడి,వీవఁగఁ గొల్లఁగ నెల్లదిక్కులన్
బిల్లియు నల్లి బల్లియును,బిల్లలు బల్లిదులెల్లవారు భీ
తిల్లగ నల్లిబిల్లి ఘటి, యిల్లుచునుండెడి శీతకాలమం
దుల్లము తల్లడిల్లి కననొల్లదు మెల్లగనిన్ను మాధవా॥౧౬

ఉ॥ కారు మొయిళ్ళనుండి యుద,కంబతి ధారగగారి జోరుగా
దారులుజేరి మీరి పటు,దర్పపరంపరలన్ జెలంగ గం
భీర బలాహకా రవము,భీకరమై తగుఁవర్షమందు కం
గారయి హృత్సరోరుహము,గానఁగ నేరదు నిన్ను మాధవా॥

ఉ॥ పుత్రులు నిల్వఁ బోరు పొల,ముల్ విడిపోవును గేహముల్ చెడున్
గాత్రము క్షీణమొందు సతి,గన్పడ దర్థము గ్రుంగు బంధువుల్
మిత్రులు దూరమౌదురని,మిథ్యగనెంచి జగత్సుఖంబు నీ
స్తోత్రముఁ జేయువారిపద,ధూళి శిరంబునదాల్తు మాధవా॥

ఉ॥ తేనియఁబెట్టి యీఁగ కడు,తియ్యని పాలనుఁగూర్చి యావు వి
న్నాణెమెసంగు కస్తురి వ,నంబున నుఁడు మృగంబొసంగి ని
ర్ధ్యానము జేసి కోయిల ము,దంబిడి యన్న్యులసేవఁజేయఁగా
మానవుఁడేమిచేయవలె,మానినుతాంఘ్రిసరోజ మాధవా॥

ఉ॥ శారదకోవిదారవట,చంపక కేసరబిల్వతాళ జం
బీరరసాల శాబర క,పిత్థమధూలక వాతపోధ మం
దారతమాలవంజుల క,దంబ శమీర శిరీష తింత్రిణీ
భూరుహముల్సృజించిన ప్ర,భుండవువాహ్వారె శ్రీరమాధవా॥

ఉ॥ నీవుసమస్తలోకములు,నింగి తెరంగు చెలంగియుండి యా
రావగుణంబునొందక జ,రామరణంబులఁజెందకే మనో
భావముఁబొందకే విషయ,వాసనలంటకె సత్ప్రకాశ సా
ఖ్యావళికాలవాలమయి,నట్టిస్వరూపుడవయ్యమాధవా॥

ఉ॥ చారలుబార్లుదీరగ పి,సాళిరుచుల్ దళుక్కొత్తుజాళువా
చీరనివాటు మీర నును,జెక్కుటిసెజ్జకు నీటుముంగురుల్
జార జిలుంగుపయ్యెద వ,చారిడనెమ్మొయిమేల్మివన్నె బం
గారును గేరు రాధనిను,గాంచి తరించె సెబాసు మాధవా॥

ఉ॥ రాపిడిదీరు మేల్పసిడి,రంగు లలందిన గద్దియల్ పసం
దా పరుపుల్ నివాళెసగు,నద్దపుమేడలు మానికంబులన్
దాపిన పట్టెమంచములు,దాకక చిల్వలరేని శయ్య నీ
వేపని బూనిదాల్చితివొ,యెవ్వరుచెప్పఁగలారు మాధవా॥

ఉ॥ పన్నగవేణి చంద్రముఖి,పంకజగంధి సువర్ణగాత్రి సం
పన్నతభాగ్యశాలి నవ,పల్లవ కోమలపాణి యెన్నడున్
కిన్నెరమీటుచున్ కదన,కేళి నెఱుంగని సత్యభామ నీ
సన్నిధి దానవాగ్రణిని,జంపిన చిత్రమదేమొ మాధవా॥౯౪

ఉ॥ కోయనితియ్యనల్ బరవు,కూతలు గూయుచు లేతమావి కెం
జాయచిగుళ్లు మేయుచున,సందులు గుల్కుచునుండు కోయిలన్
వాయసమూరకే తనదు,వాటపుచంచువుతోడ నొక్కి బల్
గాయములొందఁజేయునుజ,గంబిటులుండుటదేమొ మాధవా॥

ఉ॥ కాలఁనిదూతలోయన బ,కంబు ఝషంబుల జాలిలేక మా
ర్జాలము మూషకంబులను,సర్పములన్ విహగాధిపుండు శా
ర్దూలము గోవులన్ దరిమి,దోర్బలతన్ భుజయించు నీజగ
జ్జాలపుగారడిన్ దెలియ,శక్యమెవారికి శ్రీరమాధవా॥౯౬

ఉ॥ క్రోధవుమిట్ట మోహముల,గుట్ట నరంబులచుట్ట ఘోరమహా
వ్యాధులుపుట్ట దుఃఖముల,కంతములేనటువంటి బుట్ట బల్
బాధలతట్ట లోభముల,పట్ట మదంబులమట్ట దేహ మ
య్యా దయజూపిజన్మమదు,గంటగఁజేయుము శ్రీరమాధవా॥

ఉ॥ నీచరితల్ లిఖింపని మ,నీషి మనీషియుగాడు నిన్ను నే
జూచెడికోర్కెలేనియతి,శూరుఁడుశూరుఁడుగాడు భక్తితో
నీచరణాబ్జముల్ గనని,నేర్పరి నేర్పరిగాఁడు నిన్ను చే
పాచినుతించనట్టి నర,జన్మజన్మముగాదు మాధవా॥౯౮

ఉ॥ అండముపిండముంబుజ భ,వాండమునిండిలసత్ప్రచండమా
ర్తాండవికాసపావక వి,రాజితపూర్ణ శశాంకమండలాల్
మెండుగ వెల్గజేయఁగల,మేటివెలుంగును గల్గియుండి యే
యండయులేక నేనిలచి,నట్టి మహాత్ముడవయ్య మాధవా॥

ఉ॥ కారణమీవు లోకమున,కర్తవునీవు చరచరాళి కా
ధారము నీవు ప్రాణులకుఁ,దండ్రివి నీవల వేల్పు పెద్దకున్
శూరుఁడవీవు పాపముల,కోపిలఁజేయఁగ ఘోరదైత్య సం
హారుఁడవీవు భావముల,కందని వాఁడవునీవుమాధవా॥ ౧౦౦

ఉ॥మూలము లేనినాజనన,ముల్ మరణంబులు నీకుఁ గ్రీడఁగా
బోలవినాకు భారమేఁకఁ,బుట్టువుగిట్టువు లేక చేసి న
న్నేలక యున్న నీచరణ,మేగతి నుంచు మదిన్ దలంచి యే
జోలియు లేని నాయుసురు,చూపునునీకు నిజంబుమాధవా॥

ఉ॥ నేనతిమూఢుడన్ జడుఁడ,నిన్ను స్తుతించెడిమార్గమున్ రవం
తేని యెరుంగనట్టి మతి,హీనుఁడ స్వల్పుఁడఁ బాపకర్ముఁడన్
మానవనామధారుఁడను,మాయకుఁడన్ విషయ ప్రలోలుఁడన్
గాన మదీయరక్షణము,కష్టముగానగు నీకుమాధవా॥ ౧౦౨

ఉ॥ చంద్రుడు లేని రాత్రి పతి,సమ్మతిలేనిసువర్ణగాత్రి రా
జేంద్రుఁడు లేనిధాత్రి చన,వించుకఁ గానని మైత్రిరీతి నీ
సాంద్రదయాసముద్రమున,స్నానముఁజేయని జన్మవ్యర్థమౌ
యింద్రను తాంఘ్రివారిజ గ,జేంద్రవిచార నివారమాధవా॥

ఉ॥ రాగులుబోయి రెందరో వి, రాగులుగూలిరిమిక్కుటంబుగా
త్యాగులుగుంపుగాజనిరి, దాగిరిభోగులు పుష్కలంబుగా
యోగులుగూడనేగిరిఁక, నుండెడివాఁడెవఁడీజగాన నీ
వేగదయన్నికాలముల, నేమరకుండుట శ్రీరమాధవా॥ ౧౦౪

ఉ॥ మాధవమాధవాయనుచు, మాటికిమాటికి వ్రాయజాలకే
మాధవనామలాంఛనము, మాత్రమువ్రాసితినంచు నీవు నా
మీఁదచలంబుఁ బూనకకు, మింపుముమాధవశ్రీరమాధవా
మాధవశ్రీరమాధవర, మాధవమాధవశ్రీరమాధవా॥ ౧౦౫

ఉ॥ భాగ్యముభోగమాయువు శు, భంబునుగల్గి చెలంగినత తా
రోగ్యులునై పరస్పర వి, రోధములేక మెలంగి జ్ఞానులై
యోగ్యులునై మనీషులయి, యుత్తములై భవదీయసత్కృపా
భాగ్యముచేఁ బ్రజాసమితి, వర్ధిలుగావుత శ్రీరమాధవా॥ ౧౦౬

ఉ॥ కమ్మకులావతంసము జ, గత్త్రయపూజ్యముపాటిబండ్ల వం
శమ్మున సత్కళాయుత ని, శాకరబింబము పాపవారి వా
హమ్ములణంచుమారుతము, నై తగు వీరయదేశికేంద్రుపా
దమ్ములుగొల్చి నినుఁగని, ధన్యుడనైతిని శ్రీరమాధవా॥ ౧౦౭

ఉ॥ ఆతతమైన కమ్మకుల, మందు జనించి విశేషమైన ప్ర
ఖ్యాతిగడించినట్టి యిన, గంటినృసింహుఁడు బాపమాంబికా
చేమురంజిలన్ గనిన, చిన్నికుమారుఁడఁబున్న యాఖ్యుఁడన్
కైతనుగూర్చినీకిడితిఁ, గల్వలమాలధరించు మాధవా॥ ౧౦౮

శాంతిప్రెస్, తెనాలి.